*Issued on 1— 1—1957*




# The Andhra Legislative Assembly

# DEBATES

## OFFICIAL REPORT

*FRIDAY, the 23rd MARCH, 1956.*

VOLUME V — No. 5.

CONTENTS



PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL.

1957

# ANDHRA LEGISLATIVE ASSEMBLY

*Friday, the 23rd March* 1956

The House met in the Assembly Hall, Kurnool at half past eight of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

## STARRED QUESTIONS.

*Temporary clerks working in the Secretariat.*

612—

*684 Q.—Sri P. GOPALU REDDI & Sri M RAJESWARA RAO :—Will the Hon. the Chief Minister be pleased to state .

(a) the total number of temporary clerks appointed, working in each Department of the Andhra Secretariat as Clerks (Upper Division and Lower Division separately) on 31—3—1955 ;

(b) the number of (i) Harijans and (ii) Backward Classes among them ; and

(c) the number of them recommended by the Employment Exchange ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) The information is laid on the table of the House.

(b) and (c) Out of the total number of 194 temporary clerks, there were 4 Harijans and 19 Backward classes candidates and 94 were recommended by the Employment Exchange.

---

Vide Appendix at page 608 infra,

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—Temporary వారికి ఎంత సర్వీసు ఉంటే, పర్మనెంటు చేస్తారు?

THE HON. DR. B. GOPALA REDDI :—ఈ విషయములో ఒక general rule ఉన్నది ఏ డిపార్టుమెంటులోనైనా సరే, అయిదు సంవత్సరముల సర్వీసు ఉంటేగాని పర్మనెంటు చేయరు. That is the normal yard stick.

SRI S. VEMAYYA :—Secretariate service కు కావలసినటువంటి minimum qualifications, ఈ temporary గా appoint చేసే వారికి ఉన్నదా? లేక minimum qualifiction లేకపోయినప్పటికీ గూడ ప్రభుత్వం appoint చేయడము ఉన్నదా?

THE HON. DR. B. GOPALA REDDI :—నాకు తెలిసినంత మటుకు minimum qualification లేనిదే appoint చేయము. But I have no informtion now.

SRI S. VEMAYYA :—Temporary వాళ్ళకైనాసరే, అయిదు సంవత్సరముల సర్వీసు ఉండాలని మంత్రిగారు చెబుతున్నారు. అయితే యిందులో అయిదు సంవత్సరముల సర్వీసుకు పైన ఉన్నవారు ఎంతమంది ఉన్నారు? అంతకు లోపల సర్వీసుగలవారు ఎంతమంది ఉన్నారు? చాలా చోట్లలో వాళ్లను పర్మనెంటు చేయలేదని complaints వస్తూ ఉన్నవి కాబట్టి, వాళ్లను త్వరగా పర్మనెంటు చేసేటట్లు చూస్తారా?

THE HON. DR. B. GOPALA REDDI :—ఈ విషయము గత సంవత్సరముకూడ consideration కు వచ్చింది దానిమీద instructions కూడ యిచ్చాము చాలామందిని పర్మనెంటు చేసిఉన్నారు. ఈ temporary recruitment కూడ సాధ్యమైనంతమటుకు లేకుండా చేయటానికే ప్రయత్నము చేస్తున్నారు. ఎవరినైనా appoint చేయవలసివచ్చినప్పుడు అది అంతయు ఆలోచించుకుని ముందుగానే Public Service Commission కు వ్రాసి, వారిని select చేయమని కోరుతూ ఉంటారు. కాని recruitment విషయములో మాత్రము డిపార్టుమెంటువారు కొంతవరకు చర్య తీసుకుంటూనే ఉన్నారు.

SRI P. SREERAMULU :—ఇందులో మహిళలు ఎంతమంది ఉన్నారండి?

THE HON. Dr. B. GOPALA REDDI :—మహిళలు ఎంతమంది ఉన్నారో నాకు బాగా తెలియదు, వారుగూడ ఉన్నారు వారు clerks గా ఉండి ఉండరు కాని Stenographers గా మాత్రము ఉన్నారనుకుంటాను.

SRI G. YELLAMANDA REDDI :—Employment Exchange Office లో చాలామంది applicants పేర్లు register చేసి ఉన్నప్పుడు, యీ temporary recruitment ఎట్లా ఉత్పన్నమైనది? అలాంటి సందర్భములో temporary recruitment లేకుండా చూస్తారా? కారణము యేమిటంటే, Exchange Office లో పేర్లు రిజిష్టరు చేసుకున్నవారు ఎంతోమందికి ఉద్యోగాలు లేకుండా ఉంటున్నారు. అందులో Intermedaite pass అయినవారు, Graduates కూడ ఉన్నారు ఇటువంటివారు ఉండగా, temporary గా recruit చేయడం ఎట్లా సంభవించింది?

THE HON. Dr B GOPALA REDDI :—Employment Exchange Office వారు 94 మందిని recommend చేశారని చెప్పానుగదా! వారు recommend చేసినవారినే తీసుకోవడం జరిగింది.

SRI V. VISWESWARA RAO :—అయిదు సంవత్సరముల సర్వీసు ఉంటేగాని పర్మనెంటు చేయరు అని చెప్పారే, అలాంటప్పుడు అంతకు పైగా సర్వీసు ఉన్నప్పటికినీ, పర్మనెంటు చేయనివారు ఎంతమంది ఉన్నారు?

THE HON. Dr. B. GOPALA REDDI :—Normal గా ఏ డిపార్టుమెంటులోనైనా కొత్తగా కొన్ని sections ను open చేసినప్పుడు, అది తాత్కాలిక డిపార్టుమెంటు క్రిందికి వస్తూ ఉంటుంది ఉదహరణకు ఒక సైక్లోన్లో, భూకంపమో, ఏదైనావస్తే, దానికిగాను ఒక Section గాని, డిపార్టుమెంటుగాని ఏర్పాటు చేశాము అవి తాత్కాలికంగా ఏర్పాటైనవి కాబట్టి, అవి పర్మనెంటు చేయరు. కాని ఏ డిపార్టుమెంటు అయినా అయిదేళ్లు ఉంటే, ఆ తరువాత దాని అవసరతనుబట్టి, యింకా ఉంచడమా, తీసివేయడమా అనేది ఆలోచించవలసి ఉంటుంది అయిదు సంవత్సరాలు దాటితేగాని, ఆ డిపార్టుమెంటును పర్మనెంటు చేయరు ఇప్పుడు Public Works Depratment విషయము చూడండి. అందులో ఎంతో మంది ఇంజనీర్లు, సూపర్వైజర్లు పనిచేస్తూ ఉంటారు. కాని వారి నందరిని పర్మనెంటుచేస్తే, అప్పుడు వారికి పనిలేకుండాపోతే, పర్మనెంటుచేసినవారు ఏమవుతారు? వారిని తీసివేయటానికి వీలుండదుగదా? కాబట్టి యీ విషయములో consider చేయవలసిన విషయాలు చాలా ఉంటాయి.

SRI P. SUNDARAYYA :—అట్లా అయితే, యిప్పుడు గవర్నమెంటు సెక్రటరియట్ గూడ అత్యవసర పరిస్థితులను బట్టి ఏర్పడిందేగదా! అప్పుడది శాశ్వతముగా ఉండేదేనని ప్రభుత్వముయొక్క అభిప్రాయమా ?

THE HON. DR. B. GOPALA REDDI :—కాదు. కాదు సెక్రటరియట్ లో గూడ కొన్నికొన్ని Sections ఒకొక్కప్పుడు open చేయవలసి ఉంటుంది. పనిఅయిపోగానే, అవి తీసివేస్తారు. ఇప్పుడు Land Reforms Committee అనివేసి, దానికి ఒక Section ను open చేశాము. అది Revenue Department క్రిందకు వస్తుంది. యిది తాత్కాలికంగా ఏర్పరచబడినదే. అయిదు ఏండ్లదాకా పనిచేస్తే, అటు తరువాత, అది యింకా ఉండవలెనని ఆవశ్యకత కనబడితే, అది యింకా అట్లాగే ఉంచడమో, పర్మనెంటు చేయడమో, దానియొక్క పనిని బట్టి, ఆవశ్యకతనుబట్టి, ఉంచుతూ ఉంటాము. కాని తాత్కాలికముగా ఏర్పరచినవి, ఉండవు. యివి అన్నీ అవసరాన్ని బట్టి ఉంచబడుతూ ఉంటాయి.

SRI P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా, Employment Exchange office ప్రతిజిల్లాలోనూ ఉన్నది. కాని మా శ్రీకాకుళంజిల్లాకు ఏర్పాటు చేయబడలేదు. దీన్ని అక్కడగూడ పెట్టేఏర్పాటు చేస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—ఇది కేంద్రప్రభుత్వమువారు చేయవలసినపని. అక్కడకుగూడ శాంక్షను చేయబడ్డది. రాబోయే ఏప్రియల్ నెలనుంచి open చేయబోతారు.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, ప్రభుత్వానికి కావలసినంతవరకు Lower Division clerks ను, Upper Division clerks ను Public Service Commission వారు select చేస్తున్నారుగదా! ఇప్పటివరకు temporary వారు service లో continue అవుతున్నారు. అటువంటప్పుడు వారికి postings యివ్వకుండా అవుతారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—Regular candidates వచ్చినప్పుడు temporary వాళ్లు పోతారు. లేకపోతే వారుకూడ Service Commission వారి పరీక్షకు కూర్చునివస్తారు. ప్యాసుఅయిన వారికి ఉద్యోగము వుంటుంది. ప్యాసుకాని వారు oust అవుతూఉంటారు. కాని యిందులో ఒక విషయము మాత్రముఉన్నది. Public Service Commission వారు recruit చేసేది ఎప్పుడూకూడ పర్మనెంటు ఖాళీల కోసమే. ఏ డిపార్టుమెంటుఅయినా యున్న పర్మనెంటుపోస్టులు ఖాళీగా ఉన్నవి. వాటి కోసము యింకోమంది కావాలిఅని సర్వీసుకమిషనువారికి తెలియ

పరుస్తారు. దానిమీద సర్వీసుకమిషనువారు ఆ ఖాళీలకు సరిపోయేటట్లుగా అభ్యర్థులను సెలెక్టుచేసి list అయా డిపార్టుమెంట్సుకు పంపుతారు. అప్పుడా లిస్టులో ఉన్నవారిని appoint చేయడము జరుగుతుంది, ఇవిగాక యింకా ఉపరిగా కావాలనితో స్తే, అప్పుడు temporary గా కొంతమందిని appoint చేసుకుంటారు.

SRI M. NAGI REDDI :—Temporary ఖాళీలు సుమారు మూడు వందలదాకా ఉంటే, అందులో 94 మందినే Employment Exchange ఆఫీసు వారు recommend చేశారు. వారిని తీసుకున్నామని చెప్పారే, ఆలాంటప్పుడు మిగతా ఖాళీలకుగూడ candidates ను recommend చేయకపోవడము Employment Exchange వారికి candidates లేకపోవడమువల్లనా ? ఈ ఖాళీలన్నీ Employment Exchange office వారిద్వారానే పూర్తి కావాలని ఉంటున్నప్పటికినీ, ప్రభుత్వమే direct గా recruit చేసిందా ? అట్లా అయితే ఎందుకు ఆ విధముగా చేసింది ?

THE HON. B. GOPALA REDDI :—అధ్యక్షా, అది అనేక పరిస్థితులమీద ఆధారపడి ఉంటుంది. ఒక్కొక్కప్పుడు urgent గా candidates కావలసివుంటే, Employment Exchange office వారికి reference చేయటానికి time లేకుండా పోవచ్చు కాకపోతే, suitable qualifications గలవారు సమయానికి ఉండకుండా పోవచ్చు. కాబట్టి యిది అనేక పరిస్థితుల మీద ఆధారపడి ఉంటుంది. అంతేగాని, యిందులో ఎవరూకూడా పక్షపాతము చూపించేది ఏమీలేదు.

SRI E. AYYAPU REDDI:—అధ్యక్షా, probation complete అయిన lower division clerks ను, పర్మనెంటుచేయకుండానే, upper division clerks గా, temporary గా నైనా recruit చేస్తారా ? ఆలా recruit చేస్తే, ఏకారణముచేత చేస్తున్నారు ?

THE HON. DR B. GOPALA REDDI :—Highr educational qualifications ఉన్నవారిని certain percentage వరకు upper division clerks గానే direct recruit చేయడముకూడా ఉన్నది.

SRI. VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, temporary గా పనిచేస్తున్నవారుకూడ Service Commission పరీక్షకు వెళ్ల వచ్చునని అన్నారు. అటువంటివారు గూడ పరీక్షప్యాసు అయినట్లైతే, వారికి అదివరకు చేసిన temporary service ను గూడ regular service లోకి చేర్చుతారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—ఇది చాలా గూఢమైన ప్రశ్న. నోటీసు యివ్వండి.

SRI. S. VEMAYYA :—Temporary గా పనిచేస్తున్నవారికి కొంత సర్వీసు జరిగిఉంటుంది కాబట్టి, అలాంటి వారి పేర్ల list ను Service commission వారికి పంపించి, ratify చేయించడానికి ప్రభుత్వము ఎందుకు ఆలోచించకూడదు ?

THE HON. Dr. B. GOPALA REDDI :— చేయవచ్చుకాని, వారిలోకొంతమందికి వయస్సు దాటిపోయి ఉండవచ్చు. కాకపోతే వారికి required qualification లేకుండా పోయిఉండవచ్చు. కాబట్టి fully qualified candidates యొక్క పేర్లనే Service Commission వారికి పంపించి, వారినిగూడ consider చేయమనే చెబుతూ ఉంటాము.

SRI T. LAKSHMINARAYANA REDDI :— అధ్యక్షా, probation complete అయిన lower division clerks పర్మనెంటు చేయటానికి eligible అయినప్పటికినీ, వారిని పర్మనెంటు చేయకుండా, upper division clerks ను temporary గా ఎందుకు ఉంచారు ?

MR. SPEAKER :—You are repeating the same question.

SRI T. LAKSHMINARAYANA REDDI :—That question was not answered.

THE HON. DR. B. GOPALA REDDI:—I have answered it.

MR. SPEAKER .—It was answered. Perhaps you have not followed it.

SRI L. LAKSHMANA DAS .—అయిదు సంవత్సరాలు సర్వీసు చేసిన తరువాతకూడ, సర్వీసు కమిషనువారి ఆమోద ముద్ర లేక పోయినప్పటికినీ వారిని service లో ఉంచటానికి ప్రభుత్వం ఎందుకు ప్రయత్నించకూడదు ? అంతవరకూ వారు సక్రమంగా పనిచేస్తూ ఉన్నప్పుడు, సర్వీసు కమిషనువారి ఆటంకము లేకుండా చేయటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—అట్లా అయితే, సర్వీసు కమిషనును ఏర్పాటుచేసిన ఆశయమే నెరవేరదు. ప్రభుత్వములో పక్షపాతము చూపించి, పార్టీ తత్వాలతో చేస్తారేమోననే ఉద్దేశ్యముతోనే, యీ సర్వీసు కమిషను అనేది వచ్చింది. అందువల్ల ప్రభుత్వములో పర్మనెంటు ఖాళీలకు recruit చేసేటప్పుడు Service Commission వారితో సంప్రదించే చేయవలసి ఉన్నది.

23rd March 1956]

ఒక వేళ తాత్కాలికంగా ప్రభుత్వము ఎవరినైనా appoint చేసినప్పటికినీ, వారిని పర్మనెంటు చేసేటప్పుడు మాత్రము సర్వీసు కమిషనువారితో సంప్రదించకుండా చేయటానికి వీలులేదు.

*Tamil school in the Ramakrishnarajupet Constituency area.*

613—

*803 Q.—SRI S. RANGANATHA MUDALIAR :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether any enquiry has been instituted in regard to the representations contained in my letter, dated 25—12—1955 that out of the schools opened in the Chittoor District, under the Central scheme not even one tamil school was given to the Ramakrishnarajupet constituency area ; and

(b) if so, why ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) The representation, dated 25—12—1955 does not refer to the non-opening of Tamil Schools in Ramakrishnarajupet Constituency. Four Schools under the scheme for the relief of educated unemployed and four schools under the State's Five Year Plan have however been opened in that Constituency area.

(b) Does not arise.

SRI S. RANGANATHA MUDALIAR :—In my representation, I specifically pointed out that out of 400 single schools sanctioned under the Government of India Scheme, not one single school was opened and I made personal representations also to the Hon Chief Minister. Would the Government be pleased to get information from the Collector concerned why he did not give one school even out of 400 schools sanctioned ?

THE HON. DR. B. GOPALA REDDI :—Please see the last portion of the sentence on my answer (a) viz., that 4 schools under the State's Five Year Plan have however been opened in that Constituency area.

[23rd March 1956

SRI S RANGANATHA MUDALIAR :—To my knowledge, only 4 schools under the State's Scheme were sanctioned Sir, not under the Government of India Scheme.

THE HON DR. B. GOPALA REDDI :—You please see that the schools opened under the scheme for the relief of educated unemployed is a Government of India Scheme—single teacher schools and all that.

SRI S. RANGANATHA MUDALIAR :—Will the Government be pleased to state the villages in which those 4 schools were opened ?

THE HON DR. B GOPALA REDDI :—Gopalapuram, Gangamabapuram, Kattarukuppam and Kothanadam.

SRI L. LAKSHMANA DAS :—ఇప్పుడు ఆంధ్ర దేశంలో ఉన్న Tamil Schools విషయంలో రక్షణ కోరినప్పుడు అరవ దేశంలోయున్న Telugu Schools విషయంలో రక్షణలున్నాయా లేదా అనే విషయం ప్రభుత్వం తెలుసుకుంటుందా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—ఇప్పుడు మదరాసులో ఉన్న తెలుగువారి విషయంలో మనం చూడడానికి వీలులేదు. మన రాష్ట్రంలో ఉన్న విషయాలు మనం చూచుకోవచ్చునేగాని ఎక్కడో మధురలో వుండేటటువంటి వాళ్లు, తిరనల్వేలిలో యుండే తెలుగువారి grievances అన్నీ మన ఆంధ్రా గవర్నమెంటు చూస్తూంటే, ఆ గవర్నమెంటుకు కొంత కష్టంగా వుంటుంది. అందువల్ల వాళ్ళ కష్టాలకోసం వాళ్ళే అక్కడ ఆందోళనచేసి, ఆ గవర్నమెంటు దగ్గరనుంచి ఉదారమైన ఫలితం పొందవలసి యుంటుంది.

SRI A. KALESWARA RAO :—ఇప్పుడు రాష్ట్ర పునర్విభజన Act ద్వారా Tamilians ఎక్కడైతే ఉన్నారో, రామకృష్ణరాజు పేట Constituency యే కాకుండా, తిరుత్తనీ అక్కడ మరీ 100 కి 4, 5 సంఖ్య కాకుండా హెచ్చుమంది వుంటే వాళ్ళందరికీ నిర్బంధంగా Tamil Primary Schools పెట్టేటటువంటి Scheme ఈ ప్రభుత్వం త్వరలో అవలంబించ నున్నదా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—ఇప్పుడే ప్రభుత్వానికున్నదా బాధ్యత ఆ Areas లో Tamil Schools పెట్టాలని సాధ్యమైనంతవరకూ అక్కడున్న తమిళులకు వాళ్ళ మాతృ భాషలోనే Primary Education

గరపవలెననే నిబంధన వున్నది. ఇంకా ఎక్కడైనా అన్యాయం వుంటే దాన్ని గురించి చూస్తాం.

SRI N. P. CHENGALRAYA NAIDU :—మంత్రిగారు సమాధానం చెబుతూ, పై రాష్ట్రాలలో వుండే తెలుగువారిని గురించి మనం శ్రద్ధ తీసుకోడానికి వీలులేదన్నారు. మన రాష్ట్రంలో చదువుకునే తమిళ విద్యార్థులకోసం మదరాసు రాష్ట్రంనుంచి అక్కడ ఆర్థిక, విద్యా మంత్రి సుబ్రహ్మణ్యంగారు అనంతపురం వస్తే మన ప్రధాన మంత్రిగారు వారిని కలుసుకోడానికి ఇక్కడనుంచి అనంతపురం పరుగెత్తినారు. ఆమాదిరిగానే మన మంత్రిగారుకూడా ఆ రాష్ట్రానికి పోతే, వారుకూడా ఆ విషయమై ఏదైనా శ్రద్ధ తీసుకుంటారేమో ఆలోచిస్తారా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—అనంతపురం కాలేజి విషయం వేరు. ఎందుచేతనంటే ఆ Tamil students ఆ కాలేజీలో చేరినప్పుడు అది Madras University క్రింద, Madras Government క్రింద ఉంది. అందువల్ల కొంత మంది Tamil students ని అనంతపురం కాలేజీలో చేర్పించినారు. మాకు Madras University degree ఇవ్వాలనీ, ఇక్కడ treatment బాగాలేదనీ వాళ్లు complaint చేసినారు. వాళ్ళకు ఏలాటి కష్టం లేకుండా చేయవలసిన బాధ్యత, వాళ్లు మన రాష్ట్రంలో ఉన్నంత కాలం, మనమీద ఉన్నది. They do not belong to the Andhra State at all. They belong either to Tanjore, Madura or Coimbatore. They were temporarily there as students of the Anantapur Engineering College which is now affiliated to the Andhra University. It was then affiliated to the Madras University.

*Conversion of N.E.S. Blocks into C.D. Blocks in the State.*

614—

*1036 Q.—SRI P. BAPAYYA :-Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) the number of National Extension Service Blocks that are converted into Community Development Blocks in the State ; and

(b) the basis for converting a National Extension Service Block into a Community Development Block ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) Eleven Sir.

(b) The selection of National Extension Service Blocks for conversion into Community Development Blocks is made on the basis of the progress of expenditure, accomplishment of physical targets, people's contributions in cash, kind and labour in the Blocks and also on the basis that every district in the State has a fair percentage of Community Development Blocks.

(అ) పదకొండు.

(ఆ) జాతీయ విస్తరణప్రణాళికలో ఉన్నటువంటి ప్రదేశాలను Community Development Block ల క్రింద మార్చువిషయంలో, అక్కడ జరిగిన ఖర్చునుబట్టి, అక్కడ నిర్ణయించినటువంటి ఆదర్శాలను అమలుపరచడాన్నిబట్టి, ప్రజలు ధన రూపంగా, వస్తురూపంగా శ్రమదానరూపంగా ఇచ్చిన ఫలితాలనుబట్టి ఈblockలను మారుస్తారు. అల్లా చేయడంలో ప్రతిజిల్లాకూ తగినటువంటి ప్రాతినిధ్యం వచ్చేటట్లు చూస్తారు.

SRI P. BAPAYYA:—ఈN.E.S. blocks నిర్మాణంచేయడంలో కొన్ని లక్ష, 20 వేల జనసంఖ్య, వందగ్రామాలకన్న ఎక్కువ area కల్గినటువంటివీ, కొన్ని 60 వేల జనసంఖ్య, 40 కంటె తక్కువగ్రామాలు కల్గి కొద్ది area కల్గినటువంటివి ఏర్పాటుచేశారు. డబ్బు allot చేయడంలో అన్నిటికీ 7 లక్షల 50 వేలు చొప్పున సమానంగా allot చేశారు. పెద్ద area లో ఎక్కువగ్రామాలు, ఎక్కువ జనసంఖ్య కల్గినటువంటివాటికి ఈవిధానమువలన నష్టంవస్తుంది. కనుక ఈవిషయం ఆలోచించి ఈ community developement blocks గా మార్పుచేయడంలో పెద్ద blocks గా ఉన్న N.E.S. Block ను వాటిని ముందు C.D. Blocksగా ఏర్పాటు చేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO:—ఆ ఒక్కపద్ధతిమీదే చేయడానికి వీలులేదు. నేను చెప్పిన సిద్ధాంతాలమీద చెయ్యడం జరుగుతుంది. నేను వచ్చిన తరువాత ఇటువంటిపద్ధతి చెయ్యలేదు. ఇది మా కెప్పుడైనా జరిగితే ఒక తాలూకా అంతా కూడా Community Development Blocks పెట్టినవి ఉన్నాయి. వాటిని సరిదిద్దేయత్నం నెమ్మదిగా చెయ్యాలి కాని ఈవేళ కొన్నిటికి preference ఇచ్చేటటువంటి ధర్మం ఉండదు.

23rd March 1956]

SRI B. SUBBA RAO—కోరుకొండ N. E. S. block ని C. D. block గా చేసే అవకాశం ఏమైనా వుందండీ ?

THE HON. SRI K. VENKATA RAO :—ఆ విషయం ఇంటికి వచ్చి మాట్లాడండి.

MR. SPEAKER :—The hon. Members may spare the Health Minister.

THE HON. DR. B. GOPALA REDDI :—24, 25, 26 తేదీలలో planning మీద సాయంత్రం 5 నుంచి 8 గంటలవరకూ discussion అవుతుంది. అప్పుడు ఈ విషయాలన్నీ మాట్లాడవచ్చును.

SRI. P. SUNDARAYYA :—ముఖ్యమంత్రిగారి సూచన ఏమాత్రం సవ్యంగాలేదు. Second Five Year plan లోని మూలసూత్రాలను గురించి ఏరకంగా ఉండాలని ప్రధానంగా చూడవలసిందే కాని కోరుకొండ C. D. block చెయ్యడమా, లేక బుచ్చిరెడ్డిపాళెం చెయ్యడమా అని కాదు.

THE HON. SRI K. VENKATA RAO :—అధ్యక్షా, మీరు దయతో నా ఆరోగ్యాన్నిబట్టి సలహా చెప్పారు. ఏమీ బాధలేదు. ఎన్నిప్రశ్నలు వేసినా సమాధానం చెప్పడానికి సిద్ధంగా ఉన్నాను.

SRI. M. NAGI REDDI :—N. E. S. block ల క్రింద ఒక్కొక్క block కు 7½ లక్షలు చొప్పున మూడుసంవత్సరాలకు కేటాయించారు. అందులో 25 % contribution గా ఇవ్వాలని—శ్రమదానంకాని ఇంకేవిధంగా కాని 25% పంచాయితీలు ఇవ్వాలన్నారు. అది ఇచ్చి 7½ లక్షలు ఖర్చుపెట్టినప్పుడు, మీరు చెప్పినటువంటి పద్ధతిలో అన్నీ సక్రమంగా జరుగుచున్నట్లేకదా. కాబట్టి దానిలో ఇంకా శ్రమదానంచేస్తే ఇవన్నీ చూస్తాం అనడంలో ప్రభుత్వోద్దేశ్యం ఏమిటి ?

THE HON. SRI K. VENKATA RAO :— ప్రభుత్వం యొక్క ఉద్దేశ్యం అనుకున్నటువంటి schemes ను బడ్జెటు ప్రకారం వ్యవహారం జరిపించడం, 100 National Extension Service blocks అయితే 50 Community Development blocks అవుతాయి. వీటిలో కొన్ని 1952 లో పెట్టినారు. కొంత preference వాళ్ళకి ఇస్తున్నాం. వాళ్ళే కనుక అనుకున్న ప్రకారం 7½ లక్షలు ఖర్చుపెట్టి అక్కడ జరిగినటువంటి పని పూర్తిచేసినట్లయితే ఈ ఏడు April 1 వ తేదీన 11 బ్లాకులు ఏర్పాటుకాబోతున్నాయి. August నాటికి ఇంకో పదకొండో, పదిహేనో మనకిచ్చిన Scheme

[23rd March 1956

ప్రకారం తీసుకుంటాం. రెండో పంచవర్ష ప్రణాళిక పూర్తిఅయ్యేసరికి రాష్ట్రమంతా Blocks వస్తాయి.

*Malayalees in the Andhra Government Service.*

315—

*875 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether this Government propose to send the Malayalee Government servants working in the State to 'Kerala' if they are willing to do so ; and

(b) the number of such people working in this State now ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) 'Kerala State' as such is not now in existence. If one such State is formed as a result of the reorganisation of States and if any Malayalee Government servant working under this Government applies for transfer to that State, his application will be considered on its merits.

(b) The time and labour involved in collecting the information will not be commensurate with the Public purpose served thereby.

SRI S. VEMAYYA :—మలయాళీలు చాలామంది మన రాష్ట్రంలో వున్నారు. వారి రాష్ట్రం ఏర్పడిన తరువాత పోవడానికి ఆతురతపడుతున్నారు. వారిని ఆ గవర్నమెంటులోనికి పంపే ప్రయత్నం చేస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఎంతమంది ఆతురత పడుతున్నారో నాకు తెలియదు. Application పెడితే ఆ Government కు forward చేసి తీసుకోవాలని చెబుతాను. ఎవరిని బలవంతంచేసి పంపడానికి వీలు లేదు.

SRI S. RANGANATHA MUDALIAR .—There are half a dozen Malayalees serving in Chittoor District and they have spent the best portion of their lives in Chittoor District. Therefore will the Hon. Chief Minister consider that it will not be advisable to send them back at the fag end of their service even if a State were to come int

THE HON. DR. B. GOPALA REDDI :—Unless they themselves are willing to go there and unless they want to serve their own native State, they will not be compelled to go there.

SRI P. GUNNAYYA :—ఈ ప్రశ్నలన్నీ ఇంగ్లీషులోనే ఉన్నాయి. అసెంబ్లీలోను, ప్రభుత్వ కార్యక్రమంఅంతా తెలుగులోనే నడిపిస్తామని తీర్మానం చేశాము. ప్రశ్నలుకాలం గంటనయిన తెలుగులో జవాబులు ఇప్పించడానికి ప్రధాన మంత్రిగారు అనుమతిఇచ్చి ప్రశ్నలు తెలుగులోనే answer చేస్తారా ?

MR. SPEAKER :—ఇంకా ఆకాలంరాలేదు.

*Purchase of handloom cloth by U.S. Trade Delegation.*

616—

*520 Q.—SRI N. C. SESHADRI :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether the Government contracted the U.S. Trade Delegation which is touring India at present in connection with the purchase of handloom cloth; and

(b) if so, whether any quantities of handloom cloth is purchased by them from this State ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) The Government did not have intimation about the visit of the Delegation. But at the instance of the All India Handloom Board, a representative of the Andhra Handloom Weavers' Co-operative Society and the Deputy Registrar (Weavers), Co-operative Societies met the delegation at Madras in October and held discussions. Samples of different varieties of exportable handloom cloth in Andhra were given to them.

(b) Not as yet.

SRI N. C. SESHADRI :—U. S. A. Trade delegation మద్రాసు వచ్చినప్పుడు మద్రాసు రాష్ట్రంలో ఉండే చేనేత సహకారసంఘాల బట్టలలో సుమారు 80% stocks clear చేసినట్లు తెలుస్తోంది. మన ప్రభుత్వంవారి

దగ్గర ఏమి trade వ్యవహారాలు చేయలేదని తెలుస్తోంది. మనరాష్ట్రంలో విలువ ఉన్న చేనేతబట్ట తీసుకొనడానికి వారు ఇష్టపడలేదా ?

THE HON. SRI K. VENKATA RAO :—వారికివచ్చిన సంజాయిషీ తప్ప, నాదగ్గర ఒక పేజీఉన్నది. ఎవరు samples ఇచ్చారో, ఏఏ కంపెనీలకు Orders వెళ్లాయో అన్నీఉన్నాయి. వారిదగ్గరనుంచి జవాబులు రాలేదని మనవి చేస్తున్నాను.

*Inclusion of the Mylavaram and Kondapalli Firkas into N.E.S. Block.*

617—

*957 Q.—SRI V. VISWESWARA RAO :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

whether the Government propose to include Mylavaram and Kondapalli Firkas into National Extension Service Block in the programme for 1956-57 ?

THE HON. SRI K. VENKATA RAO :—

Mylavaram firka and a part of Kondapalli firka have been costituted into a Block which will be inaugurated in the first week of March 1956 under the programme for the year 1956-57.

మైలవరం ఫిర్కాలోను, కొండపల్లి ఫిర్కాలోను ఒక భాగాన్ని N. E. S. Block క్రింద నిర్ణయించి 15 రోజులక్రితమే ఏర్పాటుచేసాము.

*Complaints about the President, Leguntapadu village Panchayat Board.*

618—

*809 Q.—SRI B. SANKARAYYA :—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

(a) whether the Government have received any complaints about the President, Leguntapadu Village Panchayat Board, Kovur Taluk, Nellore District that he never attends to the official duties ; and

23rd March 1956]

(b) if so, the action taken thereon ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

(a) The question is answered in the affirmative.

(b) Action is being taken by the Inspector-General of Local Administration against the president under section 47 of the Madras Village Panchayats Act, 1950.

SRI B. SANKARAYYA :—ఏమి complaints వచ్చాయి ; ఎప్పుడు వచ్చాయి ; ఇంతవరకు జరిగిన విషయాలు ఏమిటో తెలియచేస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO:—1954 సంవత్సరంలో వచ్చింది. ప్రభుత్వం warning ఇచ్చింది. తిరిగి మళ్ళీ complaints వచ్చాయి. దానిపై show cause notice ఇవ్వబోతున్నారు.

SRI G. YELLAMANDA REDDI:—ఈ ప్రసిడెంటు Vice President ఎన్నికలలో forgery చేసిన విషయం 3 సంవత్సరాల క్రితమే రిపోర్టు ఇచ్చారు. అసెంబ్లీలో తర్జన భర్జనలు జరిగాయి. నిరూపణకూడా అయినది ; ఇన్ని complaints వచ్చినా ఆలోచిస్తామని చెబుతూ, మూడు సంవత్సరాల Term అయేవరకు Action తీసుకోలేదంటే Department ఎంత అసమర్థంగా పనిచేస్తున్నదో గమనిస్తారా ? గమనిస్తే ఏమి చర్య తీసుకుంటారు ?

THE HON. SRI A. B. NAGESWARA RAO:—ఈ ప్రశ్న క్రిందటి ప్రభుత్వంలో వేశారు. 17-5-54 వ answer చేశారు. Warning ఇచ్చారు. తిరిగి Representations రావడం మూలంగా removal చేయడానికి ఇప్పుడు notice ఇచ్చారు.

SRI V. VISWESWARA RAO :—1954 సంవత్సరంలో warning ఇచ్చామని సెలవిస్తున్నారు. 1956 దీనిని గురించి ఆలోచించబోతున్నారు.

MR. SPEAKER :—ఇదివరకు warning తో dispose of చేశారు. ఇటువంటి పనులను ప్రసిడెంటు చేసినా warning ఇవ్వడం కన్న వేరే చర్య తీసుకోక పోవడం జరుగుతోంది. ఎలక్షనులు జరగబోయే ముందు remove చేస్తాం అని చెప్పడం action క్రింద రాదని గుర్తిస్తారనుకుంటాను. సకాలంలో చర్య తీసికొనకుండా కాలయాపన చేయడంవల్ల ఇటువంటి పరిస్థితులు ఏర్పడుతున్నాయని ప్రభుత్వంవారు గుర్తిస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ప్రజాస్వామికంలో ఎంతో మంది చదువు రానివారు ఉండడంవల్ల అనవసరంగా వారిమీద చర్యలు తీసికోనరాదని గౌరవ సభ్యులు సూచించిన కారణంగా, ముందు ఒక warning ఇచ్చి ఇంకా persistent గా అక్రమాలు చేస్తుంటే notice ఇచ్చి remove చేస్తున్నారు. ఈ విషయంలోకూడా ముందు warning ఇచ్చారు; Persistent గా అక్రమ చర్యలు తీసుకుంటున్నట్లు representations రావడం వల్ల Show Cause Notice ఇచ్చారు.

SRI P. SUNDARAYYA :—1954 లో complaint వచ్చింది అన్నారు. దాని స్వభావం ఏమిటంటే, Vice President పేరుపెట్టి forgery చేశారని. ఇది serious complaint అయినా కేవలం warning సరిపోతుందని భావించారు అప్పట్లో. Forgery నేరానికి warning సరిపోతే పదవినుంచి oust చేయడానికి అంతకన్న అధికమైన ఏ నేరం చేశారని complaints వచ్చినాయో తెలవిస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—Illiterate people ఉంటారు కాబట్టి మొదట్లో warning సరిపోతుందనుకున్నాము.

SRI P. SUNDARAYYA :—ప్రజా స్వామికంలో forgery చేసే వాళ్లు, లంచాలు తీసుకునేవాళ్లు, గొంతుకలు కోసేవాళ్ళకు warning ఇవ్వడం ప్రజాస్వామికమని మంత్రిగారి ఉద్దేశమా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—వేలి ముద్రలు వేసేవాళ్లు forgery చేయడానికి సావకాశం ఉంటుంది. Illiterate people, వారిపై action తీసుకోవద్దని ప్రతిపక్ష సభ్యులు చెప్పిన రోజులున్నాయి. వారి సూచనలు మూలంగానే ఇట్లా చేస్తోంది ప్రభుత్వం.

SRI G. YELLAMANDA REDDI :—Communist President విషయంలో 24 గంటలలో Removal Orders పంపించారు. వీరు influence ఉపయోగిస్తూండడంవల్ల 3 సంవత్సరాలు చర్య తీసికోకుండా గడుపుతూ వచ్చారు. Warning తిరిగి ఇచ్చినట్లు రెండు రోజులనాడు తెలిసింది. ఇటువంటి పక్షపాత వైఖరిని ప్రభుత్వంవారు మానుకుంటారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ప్రభుత్వానికి పక్షపాత వైఖరి లేదని మనవి చేస్తున్నాను. Merits of the case ను బట్టి చర్య తీసుకుంటారు.

*Implementing the separation of the Legislature Secretariat.*

619—

*577 Q.—Sri VAVILALA GOPALAKRISHNAYYA :— Will the Hon. the Chief Minister be pleased to state the steps taken to implement the separation of the Legislature Secretariat according to Article 187 (1) of the Constitution of India ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

The Government of the Composite State of Madras examined this question in respect of the Legislature Secretariat with reference to Article 187 of the Constitution of India and issued certain instructions under Article 187 (3) in consultation with the Speaker. These instructions will apply to the Secretariat Staff of the Legislative Assembly in this State.

The other Part-A State Governments have been requested to furnish information together with relevant rules, regulations and orders, to show in actual practice, how the separate Legislature Secretariat has been constituted in the various States so that the Government can examine whether the existing practice in this State needs any modification. The Government of India have also been addressed for clarification on certain issues in this regard.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—Composite state లో కొన్ని సూచనలు చేసారు అన్నారు అవి తెలియజేస్తారా?

The Hon. Dr. B GOPALA REDDI :—4,5 సంవత్సరాలైనది నాకు కూడా తెలుసు. నేనుకూడా ఆ వ్యవహారంలో ఉన్నాను. సంతృప్తికరంగా లేదని గౌరవ సభ్యుల అభిప్రాయం. ఇతర గవర్నమెంటులు ఏమి చేశారు, Government of India ఏమి చేస్తుందో, ఏమి చేయాలని ఉద్దేశమో, దర్యాప్తు అంతా చేస్తున్నాము.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—వారు చేసినది తెలియచేస్తే మనం చేయవలసింది ఆలోచిస్తాము అప్పుడు చేసినది మీకే సంతృప్తిగా లేదంటారా అభ్యంతరంలేదు ఇతర గవర్నమెంటులకు వ్రాస్తే సంతోషం, చేసినది ఎంతవరకో చెబుతారా?

THE HON. Dr. B. GOPALA REDDI :—వేరే ప్రశ్నలు వేస్తే వివరాలు ఇస్తాము ఆనాటి instructions ఫలితంగా ఈనాడు జరుగుతోంది.

SRI P. NARASIMHAPPA RAO :—ఇతర రాష్ట్రంలో చేసేవి copy చేయడం ఎందుకు? మన రాష్ట్రంలో తెలిసినవాళ్లు లేరా? ఇతర రాష్ట్రాలకు ఆదర్శంగా ఉండేట్లా మనమే ఎందుకు చేయకూడదు?

THE HON. Dr B. GOPALA REDDI :—చాలా ఉత్తమమైన ఆశయమే. అన్నింటిలో మనమే అగ్రనాయకులుగా ఉండేబదులు ఇతరులు చేసేది కూడా ఆలోచించడం మంచిది. అదీకాక అన్ని రాష్ట్రాలలోను సమానంగా ఉండడం మంచిదేమో.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఇతర విషయాల్లో ఏమైనా, ఇందులోనైనా నాయకత్వం వహిస్తే Constitution లో ఇచ్చిన protection అమలుజరిపినట్లు అవుతుంది. అదిచేస్తారా?

THE HON. Dr. B. GOPALA REDDI :—అన్నింటిలోను న్యాయమైన విషయాన్ని చేయవలసి ఉంటుంది. న్యాయమో, అన్యాయమో ఇంతవరకు నిర్ణయం లేదు.

*Tannery and leather goods shops in the State.*

620—

* 854 Q.—SRI P. GUNNAYYA :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

(a) the number of tannery and leather goods shops opened by the Government in the State ; and

(b) if there are no such shops, will the Government propose to open them ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) There are no such shops at present, Sir.

(b) The question will be considered with the expansion of the tanning and leather production units and organisation of marketing emporia for cottage industries products.

23rd March 1956]

(అ) ప్రస్తుతము అటువంటి దుకాణాలు లేవండి.

(బ) ఇది తోళ్ళ పదునుచేసేటటువంటి సంస్థలు, తోళ్లు ఉత్పత్తి చేసేటటు వంటి సంస్థల్ని Cottage Industries Scheme క్రింద ఎక్కువగా చేసినతర్వాత emporium వగైరాలు ఏర్పాటుచేసే తప్పుడు ఆలోచించడం జరుగుతుంది

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, తోళ్ళ పారిశ్రామికులు ఆంధ్ర దేశంలో చాలమంది ఉన్నారు. కనుక ఈ సొసైటీలను ప్రతి తాలూకాలోను ఒక్కొక్కటి నెలకొల్పించినట్లయితే వారికి వృత్తి కల్పించినట్టు ఉంటుంది తర్వాత ప్రభుత్వానికికూడ పెద్దసహాయంచేసిన వాళ్ళవుతారు. ఆలాంటి Society లను హరిజనులకే యివ్వటానికి ప్రభుత్వం ఏమైనా ఏర్పాటు చేస్తుందా?

THE HON. SRI K. VENKATA RAO :—తోలుపదును చేయడం సాధారణమైన వ్యవహారము కాదు. దానికి కావలసిన పదార్థాలు చాలా ఉన్నాయి. అటువంటివి ప్రతి తాలూకాలోను లభ్యంకావు. అందుచేత దానికి అనుగుణ్యమైనట్టి ప్రదేశాలలో ప్రభుత్వంవారు అప్పుడే చర్య తీసుకొన్నారు. అనంతపూరులో, విజయవాడలో, ఏలూరులో, సామర్లకోటలో, గుట్టం కొండలో (వాయల్పాడు తాలూకా) అంతేకాకుండ రామచంద్రపురం, తేనాలు, టంగుటూరు, నిడుబ్రోలు, కనిగిరి, పొన్నూరు పెద్ద పవ్వూరు, మంటపంపల్లి వగైరా అనేక ప్రదేశాలలో Co-operative Societies పెడుతూ, Slaying Centres పెట్టుతున్నారు Foot wear వగైరాలకుగాను leather production విషయంలో కృషి చేస్తున్నారు మంచి టాన్నింగు చేసేటటువంటి ఏర్పాట్లు చేస్తున్నారు అందుచేత ఇవన్ని జయప్రదమైతే క్రమేణా ఇతరచోట్లకుకూడా పంపించవచ్చు

SRI N. K. LINGAM :—అధ్యక్షా! కర్నూలు మునిసిపాలిటీలో private గా ఒకరు tanning industry ని పెట్టి ఆర్థికంగా దెబ్బతినడంచేత దాన్ని ప్రస్తుతానికి మూసివేశారు. అటువంటిదానికి ప్రభుత్వం ప్రోత్సహిస్తూ వాళ్లకు ఏదైనా subsidy ఇచ్చి దాన్ని తెఱపించి పనిచేయించుటకు ప్రయత్నం చేస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—ప్రయత్నించదు.

SRI S. VEMAYYA :—Second Five Year Planలో దీన్నిగురించి ఆలోచిస్తామని మంత్రిగారు చెప్పారు. Co-operative Societies కే encouragement ఇస్తారా, లేకుంటే private గా ఉంటేవాళ్లకుకూడా encouragement ఇవ్వడానికి ఆలోచిస్తున్నారా ?

THE HON. SRI K. VENKATA RAO :—Private వాళ్లకు encouragement ఇవ్వడం అంటే వారు తయారుచేసినటువంటి పదార్థాలు వారిదగ్గర ప్రభుత్వం కొనడంద్వారా encourage చేయవచ్చు. ఊరికే ప్రతివారు పెట్టిన దానికి ప్రతి సంస్థకు subsidy అంటే Government కు వచ్చిన ఇరవై ఐదు కోట్లు subsidy ల క్రిందే సరిపోతుంది. అటువంటివి జరగడానికి వీలులేదు. ఇంకా ఇవ్వగలిగిన ప్రోత్సాహము ఏమిటంటే ఈ స్కూళ్లలో ట్రెయినింగ్ ఇవ్వడం క్రొత్తరకం తోలు పదునుచేయడం, చెప్పడం ఇదంతా జరుగుతుంది.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా! విజయవాడలో జాతీయ వధశాల పెట్టాలని మొత్తం రాష్ట్రములో అక్కడే ఎక్కువ పశువులు నరుకబడతాయని ఈమధ్య పత్రికల్లో చూశాము. అందువల్ల అక్కడే ఈ తోళ్లపదునుచేసే పరిశ్రమను స్థాపించడానికి ప్రభుత్వం పూనుకుంటుందా?

THE HON. SRI K. VENKATA RAO :—వారు కనలేదేమో ఇప్పుడు చదివాను. విజయవాడలో తోలు పదునుచేసే పరిశ్రమ పెడుతున్నామని.

SRI RAJARAM :—అధ్యక్షా! ఈ ట్రెయినింగ్ సెంటరికి ప్రభుత్వం subsidy ఇచ్చేదానికి వీలులేదని మంత్రిగారు చెప్పుతున్నారు. లేకపోతే అప్పులైనా ప్రభుత్వం మంజూరుచేసే విధానం ఉందా?

THE HON. SRI M. VENKATA RAO :—ఇప్పుడున్న order ప్రకారం ఏ సొంతంగా ఉత్పత్తి చేసేటటువంటి వ్యక్తికైనా 300 రూపాయలు హామీలేకుండా అప్పు ఇచ్చేటటువంటి ఏర్పాటు ఉంది. వారేమో Director of Indutries కుగాని Assistant Director of Indutries కుగాని దరఖాస్తులు పంపుకోవచ్చు.

SRI B. SANKARAIAH :—అప్పులు మంజూరుచేయటానికి ఇచ్చినటువంటి forms లో వాళ్ళకెంత ఆస్తి ఉంది అనేటటువంటివి చాల ఉన్నాయి. వాళ్ళకు హామీలేకుండా అప్పులిస్తారని మంత్రిగారు చెప్పారు. అందువల్ల ఆ procedure కూడా simplify చేసి వాళ్ళకు ఎక్కువ చిక్కులులేకుండా అప్పులు మంజూరయ్యేటట్లు చూస్తారా?

THE HON. SRI K. VENKATA RAO :—ఈ application లన్నీ మంత్రిగారు చూడడం అసంభవమైన విషయం.

23rd March 1956]

*Posts of Social Education Organisers.*

621—

* 847-A. Q.—SRI N. SREENIVASA RAO.—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state:

(a) the number of applications received from Harijans by the Deputy Commissioner for Planning and Development for the posts of Social Education Organisers ;

(b) the total number of posts for which applications were called for ; and

(c) the number of Harijan candidates selected on communal basis ?.

THE HON. SRI K. VENKATA RAO :—

(a) Applications were received from 3 (Men) Harijans for the posts of Social Education Organisers. No applications were received from Harijan women candidates.

(b) Applications were called for 42 posts (29 men and 13 women) of Social Education Organisers.

(c) Out of the three Harijan candidates, one of them did not appear before the Selection Committee and out of the remaining two, one candidate was selected. The selection was not made on communal basis though preference was shown to Harijans and Backward classes.

(ఎ) ముగ్గురు హారిజనుల (మగవారి) దగ్గరనుంచి ఈ Social Educational Organisers కు దరఖాస్తులువచ్చాయి. స్త్రీల దగ్గఅనుంచి ఏమిరాలేదు.

(బి) 42 post లకి 29 మగవారు 18 ఆడువారికోసం దరఖాస్తులు పిలువ బడ్డాయి.

(సి) ముగ్గురు హారిజనులు చేసిన దరఖాస్తులలో ఒకాయన అసలు Selection Committee దగ్గరికి రానేలేదు. మిగిలిన ఇద్దరిలో ఒకర్ని select చేయడం జరిగింది. ఇదికూడా Minister గారు అడ్డుపడితే జరిగింది.

SRI P. GUNNAYYA:—అధ్యక్షా! Social Educational Officers గా ఆడవాళ్ళను వేస్తున్నారు. వారు చేసినటువంటిపని ఏమిటో మంత్రిగారు సెలవిస్తారా?

THE HON. SRI K. VENKATA RAO :—వారు చేసినటువంటిపనిని supervise చేయడానికి, ఆయూాల ఒక block పెట్టినపుడు, గున్నయ్యగారికి అధికారమిస్తారు.

*Weavers' Co-operative Societies in Proddaturpeta Area.*

622—

* 838 Q.—SRI S. RANGANATHA MUDALIAR :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether it is a fact that many of the Weavers' Co-operative Societies in Proddaturpeta area have stopped their work from April, 1955 due to non-sanction of rebate claims (under cess fund scheme) of these societies from the month of July, 1954; and

(b) if so, whether the Government will be pleased to take steps to revive these societies to provide work for the weaver members of the societies ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) As certain abnormal features were noticed in the working of the weavers co-operative societies in the Proddaturpeta area, the claims of the societies for rebate under the Cess Fund Schemes were withheld pending further scrutiny by the Registrar of Co-operative Societies. But it is not correct to say that the societies stopped working because their claims for rebate were not sanctioned.

(b) The matter will be considered.

*Co-operative Sugar Factories in the State.*

623—

* 1056 Q.—SRI P. GOPALAKRISHNA REDDI :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) the number of new Co-operative sugar factories that the Government propose to start in the State ; and

(b) their location and the estimated cost of each factory ?

28rd March 1956]

THE HON. SRI K. VENKATA RAO :—

(a) Five Sugar factories on co-operative basis are proposed to be started in this State.

(b) These five co-operative sugar factories are to be located at Chittoor, Hindupur (Anantapur Dt.), Palacole (West Godavari Dt ), Chodavaram (Visakhapatnam Dt ) and Amadalavalasa (Srikakulam Dt.). The estimated cost of each factory is about Rs. 60-62 lakhs.

(a) ఐదు పంచదార ఫ్యాక్టరీలు ఈ రాష్ట్రంలో పెట్టవలెనని నిర్ణయం జరిగింది. ఈ ఐదున్ను చిత్తూరు, హిందుపూరు, పాలకొల్లు, చోడవరం, ఆముదాలవలసలో పెట్టడానికి సిఫార్సుచేయడం జరిగింది. ఒక్కొక్క ఫ్యాక్టరీ పెట్టాలన్నట్లయితే 60 మొదలు 62 లక్షలదాక పెట్టుబడిక్రిందే కావాల్సివస్తుంది.

Sri P. SURYANARAYANA :—ఇప్పుడు ఐదు ఫ్యాక్టరీలు పెట్టడానికి సిఫార్సుచేశామని చెప్పారు. అందులో ఆముదాలవలస ఫ్యాక్టరీని గురించి కూడ చెప్పారు. గవర్నమెంటువారి ఆదేశానుసారం 3 లక్షలరూపాయలు deposit చేస్తే recommend చేస్తామని చెప్పారు. 3 లక్షలరూపాయలు ఆముదాలవలస ఫ్యాక్టరీకి. deposit చేశారు. Co-operative Registrar, దానిని recommend చేసి పంపించారు, గవర్నమెంటు దానిని మూడుమాసాలు ఇక్కడ పెట్టుకోవడానికి కారణం ఏమో చెప్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఇప్పుడు వారు వేసిన ప్రశ్న, నా department కు సంబంధించినది కాదు. అది సంజీవయ్యగారికి ప్రశ్న వేస్తే వారు సమాధానం చెప్తారు.

SRI P. SURYANARAYANA :—వారంటే వీరు, వీరంటే వారని కాలయాపనచేయడమేనా? లేక మాడబ్బు మాకు వాపస్సుచేయిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO:—అంత సరదాగా డబ్బు వాపస్సు పుచ్చుకోవాలంటే తప్పకుండా చేయిస్తాను. అయితే సూర్యనారాయణగారే ఈ ఫ్యాక్టరీ పెట్టలేదు. పెట్టినవారికి దాన్ని సఫలంచేసి దాన్ని బాగా చేయాలనే ఉద్దేశముందని నాకు తెలుసు,

SRI M. BAPAIAH CHOWDARY :—ఈ గుంటూరుజిల్లా చుండూరు గ్రామమునుంచి అర్జీ ఏమైనా తమకు వచ్చిందా, దాని పర్యవసాన మేమయింది ?

THE HON. SRI K. VENKATA RAO:—చుండూరు Factory వారు అందరికంటే ముందుగా వచ్చారు. నేను Minister అవగానే. కాని కార్య విధానంలో ఏవిధమైన పని చేయలేదు. ఇప్పటికి వారు డబ్బు వసూలుచేయలేదు. మళ్లీ ఇవన్ని సిఫార్సు అయినతర్వాత వచ్చి మాకు ఫ్యాక్టరీ కావాలని అడిగారు. తయారయినటువంటివారిని తీసేసి క్రొత్తవారిని పెట్టడం న్యాయముగాదని వారికి చెప్పాను. మీరు గనక డబ్బు వసూలుచేసి తయారుచేసినట్లయితే మీకుకూడ సిఫార్సు చేస్తామని చెప్పాను.

[*Note* :—An asterisk * at the commencement of a speech denotes revision by the Member].

II. POINT OF INFORMATION re—(1) Discussion on draft outline of the Second Five Year Plan.

SRI P. NARASIMHAPPA RAO :—One point of information, Sir. రేపు Second Five Year Plan మీద అంతా మాట్లాడదలచుకున్నారని చెప్పారు. మాకు ఆ పుస్తకం మొత్తం ఉండేది కలిపి యిచ్చారు. దానిగురించిన అంకెలు ఏమీ బోధపడవు. మనరాష్ట్రానికి వేరుగా మీరు తీసుకు వచ్చి యివ్వడంలేదు. దానిని discuss చేయడానికి time లేదు. వేరుగా యివ్వాలని మంత్రిగారిని కోరుతున్నాను.

THE HON. SRI K. VENKATA RAO:—మనం discuss చేయమన్నది draft outline of the Second Five Year Plan. దానిమీద మన అభిప్రాయాలు చెప్పమన్నారు. వారేది చెప్పమన్నారో అదిమట్టుకు యిచ్చాము. కాని ప్రశ్న ఏదయినా అడుగవచ్చు. 196 పేజీలు శ్రమపడి చదవడానికి అప్పారావుగారు సిద్ధంగా ఉంటే రేపు ఉదయానికో లేక యివ్వాళ సాయంత్రానికో 10-12 పుస్తకాలు తెలుగులో యిస్తారు. నా speech కూడా తెలుగులో అనువదించి అచ్చేసి Member లకు అందజేస్తాను. వీలయినంత సహాయం చేయగలిగింది చేస్తాను.

SRI P. NARASIMHAPPA RAO :—మా తాలూకు ఉద్దేశ్యాలన్నీ కాగితంమీద వ్రాసి యిస్తే accept చేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—తప్పకుండా accept చేస్తాను. అంత శ్రద్ధ పుచ్చుకుని వ్రాసియిస్తే తప్పకుండా దానిగురించి ఆలోచించ డమే కాకుండా వారిపేరు సువర్ణాక్షరాలతో ముద్రవేసి Government of India కు పంపిస్తాం.

(2) Discussion on the States Re-organisation Bill.

SRI N. P. CHENGALRAYA NAIDU :—S.R.C. Report పైన ఎప్పుడు చర్చ ప్రారంభిస్తారో తెలుసుకోవాలనుకుంటున్నాను. అదికాకుండా Delhi లో Farmers' Forum Conference జరుగుతుంది. సుమారు 40 మంది శాసనసభ్యులు వెళ్లుతున్నారు. దయచేసి 7 వ తేదీ తరువాత పెట్టుకోవాలని కోరుతున్నాను.

The Hon. DR. B. GOPALA REDDI :—అయిదు దినాలు ఆగా Farmers' Forum జరుగుతుందని తెలుస్తుంది. మొదటి రెండుదినాలు హాజరై బయలుదేరి వచ్చినప్పటికికూడా యిక్కడకు రావడానికి వీలుగా 2,3,4,5 తేదీలలో, అవసరమైతే 6 వ తేదీకూడా S.R.C చర్చజరిపించడానికి పెట్టాలనుకుంటున్నాను. ఇంక 7 వ తేదీని ప్రారంభిస్తే 11 తేదీవరకు అవుతుంది. Delhi కికూడా పంపించాలని కోరుతున్నారు.

MR. SPEAKER :—15 తారీఖులోగా ఉపన్యాసాలకు English translation చేసి పంపించడానికి interval కావాలి.

SRI N. P. CHENGALRAYA NAIDU :—Hyderabad Assembly 10 వ తేదీని పెట్టుకుంది. వారుమాత్రం 15 వ తేదీలోగా పంపనక్కర లేదా ? వారు పంపించింది మనం ఎందుకు పంపించలేము ?

Mr. SPEAKER :—Hyderabad పోయాక తెలుసుకుందాము.

THE HON SRI K. VENKATA RAO:—పంపించినా పంపించవచ్చు. కాని పంపించినది చదువుకోడానికి కాలవ్యవధి వారికి కావాలా వద్దా ? ముందువచ్చిన కట్ట ముందు చదువుతారు.

SRI N.P. CHENGALRAYA NAIDU:-బళ్లారి విషయంలో ప్రభుత్వం తగినంత శ్రద్ధతీసుకోలేదు.

THE HON SRI K. VENKATA RAO :—బళ్లారిగురించి ప్రభుత్వం ప్రయత్నం చేయలేదని సంగతి సందర్భాలు తెలియవు. అతుకులబొంతలు చెప్పవచ్చు

Sri K. Venkata Rao] [23rd March 1956

కాని బాధ్యతగలవారెవరైనా ప్రభుత్వం దీని విషయంలో చేసినకృషిని ప్రశంసించి తీరుతారు.

SRI L. LAKSHMANA DAS :—30 మంది ఢిల్లీకి వెళ్ళేటట్టుగావున్నది కాబట్టి దీనిమీద చర్చ 7 వ తేదీవరకైనా పొడిగిస్తే సదుపాయంగా వుంటుంది.

THE HON. DR. B. GOPALA REDDI :—నేను చెప్పినట్టు Farmers forum 5 దినాలుంటుంది. చాలమంది మొదటి రెండుదినాలు హాజరై చర్చలలో పాల్గొనడానికి వీలు ఉంటుంది. తరువాత ప్రతి పక్షనాయకులతో సంప్రదించి 2,3,4,5 తేదీలలో పెట్టడానికి నిశ్చయించాం.

SRI P. GUNNAYYA :—27 తేదీనుంచి April 5 తేదీవరకు శాసన సభకు వచ్చినటువంటి Bill లు Pass చేయించుకుందాం అనే సంకల్పం ప్రధాన మంత్రిగారికి ఉన్నది. గాని నెలరోజులనుంచీ కుటుంబాల్ని వదులుకొని హైదరాబాదులో వున్నట్టున్నాం. కనుక వారంరోజులు శెలవిప్పించి మళ్లీ రమ్మంటేవస్తాం.

THE HON. DR. B. GOPALA REDDI :—30,31, 1 తేదీలలో మన Assembly సమావేశం ఉండదు ఇంటికి పోయి రావడానికి వీలుంటుంది Speaker గారి సూచనప్రకారంగా T. A. యివ్వడానికి ప్రభుత్వం ఆలోచిస్తుంది. తప్పకుండా Pass చేస్తారు. ఇవ్వాళ రావచ్చు. ఆలస్యంకావచ్చు. ఎట్లాచేసినా చేసుకోవచ్చు.

SRI PRAGADA KOTAIAH :—ఇప్పుడు ముఖ్యమంత్రి 8 రోజులు మధ్యలోవుంటే T. A. గురించి ఆలోచిస్తున్నాం అన్నారు. ఉన్నటువంటి T.A. Rules అడ్డంగావున్నాయి. 4 రోజులిచ్చి 8 తేదీనుంచి ప్రారంభంచేస్తే ఏమార్పు లేకుండా T.A. రావడానికి అవకాశంవుంటుంది

MR. SPEAKER :—ఆరూలే సవరణ చేస్తున్నారు.

## III. BUDGET FOR THE YEAR 1956-57. (contd.)

## Voting of Demands for Grants for the Year 1956-57 (contd.)

## DEMAND No. XXIII—LABOUR INCLUDING FACTORIES.

THE HON. SRI G. LATCHANNA :—On the recommendation of the Governor, Sir, I move :

> "That Government be granted a sum not exceeding Rs. 8,07,700 under Demand No. XXIII—Labour including Factories."

Labour demand కు సంబంధించి 8,07,700 రూపాయలకు మించకుండా sanction చేయవలసినదిగా సభవారిని కోరుతున్నాను. ఈ demand ను ప్రతిపాదిస్తూ మన Labour Department చేస్తున్న కార్యక్రమాల వివరాలు కొద్దిగా మనవిచేస్తున్నాను. ముఖ్యంగా యీ Labour Department కు head-quarters లో 2,11,000 రూపాయలు, జిల్లా staff కు గాను 41,000 రూపాయలు, Industrial Tribunal Office గురించి రు 15,900 లు, development schemes మున్నగు పంచవర్ష ప్రణాళిక ఏర్పాటు చేసిన schemes కు గాను రు 26,400, తరువాత Factory Department లోని Inspector of factories గురించి 1,36,700 రూపాయలు, Assistant Inspectors of Labourers గురించి అవుతున్నటువంటి ఖర్చు 2,73,000 రూపాయలు. Minor heads క్రింద miscellaneous ఖర్చుల క్రిందనూ అవుతున్నటువంటి ప్రత్యేక ఖర్చు రు. 1,03,000. మొత్తం 8,07,000 రూపాయలు దీనికి ఈ శాఖలో ఒక కమీషనరు, ఒక Assistant Commissioner, ఒక Deputy Inspector of Factories ఉన్నారు. అదేకాక జిల్లాలో నలుగురు Labour officers, 5 గురు Regional Inspectors of Factories, 57 మంది Assistant Inspectors of Labour యీ department లో పని చేస్తున్నారు. వీరుకాక ఒకే ఒక వ్యక్తితో కూడిన Industrial Tribunal office విశాఖపట్టణంలో పనిచేస్తున్నది. Indian Trade Union Act అనుసరించి యిప్పటికి మన రాష్ట్రంలో సుమారుగా 187 Unions యింతవరకు Trade Union Act క్రింద Register చేయబడి ఉన్నవి. Industrial Disputes Act అనేది Central Act, ఈ Act ను అనుసరించి ప్రభుత్వం Labour Department ద్వారా workers కు factory employees కు employers కు వచ్చిన తగాదాలను సాధ్యమైనంతవరకు ముందట సామరస్య పూర్వకంగా పరిష్కారం చేయడానికి ప్రయత్నించి అది సాధ్యంకానప్పుడు Industrial Tribunal కు మనం నిర్ణయించి . Industrial Tribunal యిచ్చినటువంటి judgment ప్రభుత్వం ఆమోదంమీద ప్రభుత్వ గెజటులో ప్రకటనచేసి ఆచరణలో పెట్టించడం యీ యొక్క Industrial Disputes Act ప్రకారం జరుగుతున్నటువంటి కార్యక్రమం.

దానిని అనుసరించి 1955 సంవత్సరం, మార్చి 1 వ తేదీనుంచీ, నవంబరు 30 వ తేదీవరకు 930 కేసులు మన రాష్ట్రములో Labour department వారికి report చేయబడ్డాయి. అందులో 492 కేసులు settle చేయడం జరిగింది.

Sri G. Latchanna] [23rd March 1956

ఇప్పుడు 26 కేసులు settlement లో ఉన్నాయి. వాటికికూడ memo drafting జరుగుతున్నది. Adjudications కు refer అయినాయి. 370 కేసులలోను 11 pending గా ఉన్నాయి. ఇది Industrial Disputes Act ను అనుసరించి మనముచేస్తున్న కార్యకలాపాలలో ముఖ్యమైన విషయము 10 మంది కంటే మించి పనిచేస్తున్న ప్రతి power పరిశ్రమకూడా factory క్రిందకు వస్తుంది. Workers కు సరియైన welfare activities ఏర్పాటుచేయుటకు 500 లకు మించివున్న factory లలో Labour Officers యొక్క నియామకము కూడా ఈ Act ను అనుసరించే, జరుగుతుంది. Factory Act ను అనుసరించి ప్రభుత్వం ప్రత్యేకంగా ఒక Medical officer ను ఈ department లో నియమించడం కొఱకు ఆలోచన జరుగుతున్నది. Medical Supervisor అన్ని ఫ్యాక్టరీలలోనూ సక్రమంగా నిర్వహించడానికి పరిశీలనలు జరుగుతున్నాయి. ఉమ్మడి మద్రాసురాష్ట్రములో 1934 సం॥లో చేయబడిన Madras Shops and Employment Act ను అనుసరించి, సినిమాలలోనూ, హోటల్సులోను, పరిశ్రమల లోను కార్మికులు 8 గంటలకంటే ఎక్కువపని చేయకూడదని, వారమునకు ఒకరోజు జీతముతోవైన సెలవు ఇవ్వాలని ఉన్నది. ఈ Act ప్రకారంగానే ఆడవారికి ప్రసవ మునకు ముందు 3 వారములు, ప్రసవము అయినతరువాత 4 వారములు జీత నష్టము లేని సెలవు ఇవ్వాలని వున్నది. Minimum Wages Act కేంద్రప్రభుత్వం అమలుజరుపుతున్న ముఖ్యమైనటువంటి Act. దానిని అనుసరించి మన రాష్ట్రములో 8 పరిశ్రమలలో minimum wages నిర్ణయము చేయబడ్డది. Experiment కు గాను 14 గ్రామాలలో కూలీలకు కనీసవేతనం నిర్ణయించడం జరిగింది. దానిని పరి శీలనచేయడానికి మొట్టమొదట మనయొక్క Labour Department కుగాని, Factory Department కుగాని తగిన అవకాశము లేదనేది ప్రభుత్వము గమ నించి, Revenue department ద్వారా దీనిని అజ్మాయిషీలోకి తీసుకొని, in- vestigation చేసి, ఏఏ గ్రామాలలో కనీసవేతనములు నిర్ణయించబడ్డాయో ఆ గ్రామ ములలో అది సక్రమంగా అమలు అయ్యేట్లుగా, రివెన్యూ ఇనస్పెక్టర్లు అజ్మాయిషీ చేసి, 1957 జనవరిలోగా వారి అనుభవమును తెలియజేయవలసినదనికూడా వారికి డిసెంబరు లో ప్రభుత్వం ఒక G. O. ద్వారా తాఖీదులు పంపించింది.

State Insurance Act అనేది కేంద్రప్రభుత్వం 1948 సం॥లో చేసినది. ఇది మనరాష్ట్రములో 1955 వ సంవత్సరం అక్టోబరు 7 వ తేదీన చిట్టివలస, నెల్లి మర్ల, విశాఖపట్టణము, ఏలూరు, విజయవాడ, మంగళగిరి, గుంటూరు కేంద్రములలో అమలుజరుపబడింది. ఈ Scheme అనుసరించి medical benifits వారికి కలుగ [illegible] తరువాత sick leave విషయములో వారికి రక్షణలు కలుగజేయడమంటి

సౌకర్యములు వారికి జేయబడ్డాయి. దీని ఆచరణకు అయ్యే ఖర్చులో 3 వంతులు కేంద్ర ప్రభుత్వము, 4 వ వంతు రాష్ట్ర ప్రభుత్వము భరించవలసి వున్నది. Workmen Compensation Act, Employment of Childrens Act, Industrial Employment Act, the Plantation Labour Act, Provident Fund Act, వంటి ఈ Act లు అన్నీ కార్మికులయొక్క రక్షణకోసం కల్పింపబడ్డాయి. ఇప్పుడు మన రాష్ట్రములో సుమారుగా Factory Act క్రిందవచ్చే, factory లు, 2,800 వున్నాయి. ఇందులో ఎక్కువభాగము చాలా చిన్న చిన్న Factory లు. పెద్ద ఫ్యాక్టరీలలో చెప్పుకోతగినవి 2, 3 తప్ప, మిగిలిన పెద్ద ఫ్యాక్టరీలు చాలావరకు సీజనల్ ఫ్యాక్టరీలుగా వున్నాయి. మొత్తం 2,800 ఫ్యాక్టరీలో సుమారు 1,00,800 మంది కార్మికులు పనిచేస్తున్నారని, అంచనాలనుబట్టి తెలుస్తున్నది. Tobacco, groundnut factory లు చాలావరకు సీజనలు factoryలే. వీటిలో దిన వేతనములు సుమారుగా ఉన్నాయి. చిన్నచిన్న ఫ్యాక్టరీలలో దినవేతనములు చాలడములేదని కార్మికులలో చాలా ఎక్కువగా అలజడి వున్నది. వాటిని అభివృద్ధి పరుచుటకు ప్రభుత్వం ప్రయత్నములుచేస్తున్నది. చిన్నచిన్న ఫ్యాక్టరీలలో ఇది తృప్తికరంగా ఆచరణలో లేదని నేను మనవిచేస్తున్నాను.

ప్రభుత్వంవారు ఇటీవల Industrial Housing Scheme ను అమలు పరచడానికి పూనుకున్నది. దీనిని అనుసరించి విజయవాడలో 301 ఇండ్లు కట్టడానికి స్కీము తయారుచేయబడ్డది. దీనికి సుమారు 7 లక్షలు ఖర్చు అవుతుందని అంచనా వేయబడ్డది. అందులో కేంద్రప్రభుత్వం సగం గ్రాంటుగాను, సగము అప్పుగాను ఇవ్వడానికి అంగీకరించింది. ఈయేడాది 100 ఇండ్లు కట్టడానికి కార్యక్రమము పూర్తి అయింది. మార్చి ఆఖరులోపల వాటిని పూర్తిచేయాలని వారియొక్క వుద్దేశ్యము. ఇంకా కొంతపని మిగిలినా గడుపుకోడానికి ప్రభుత్వం నిశ్చయించింది. వచ్చే 5 యేళ్లలోపల చిన్నచిన్న ఫ్యాక్టరీలలో పనిచేస్తున్న కార్మికులకు ఇండ్లవసతులు ఏర్పాటుచేయడానికి 42 లక్షల 72 వేల రూపాయలు ఖర్చుపెట్టి 1560 ఇండ్లు కట్టడానికి ప్రభుత్వం ఒక స్కీమును తయారుచేసినది. దానిని కేంద్రప్రభుత్వం ఆమోదించిందని చెప్పడానికి సంతోషిస్తున్నాను.

శివరావు కమిటీ సూచనల ప్రకారం Employment Exchange లను కేంద్ర ప్రభుత్వం రాష్ట్రప్రభుత్వముల స్వాధీనము చేయదలచింది. దానికి మన ప్రభుత్వం ఆమోదం తెలిపినది. వాటికి నిర్వహణలో అయ్యేఖర్చు 60% కేంద్రప్రభుత్వము,

Sri G. Latchanna] [23rd March 1956

40% రాష్ట్రప్రభుత్వము భరిస్తుంది. ఈ నెల 3 వ తేదినే ఆర్డర్లు వస్తాయని ఆశిస్తున్నాను

ఈ విధంగా మన ప్రభుత్వం కార్మికులపట్ల తనయొక్క విధులను నిర్వహించడంలో, శ్రద్ధతీసుకుంటున్నదనే సంగతి సభ్యులందరూ గమనిస్తారని నా విశ్వాసము. ఈ పద్దును అందరూ ఏకగ్రీవంగా ఆమోదించాలని కోరుతున్నాను.

Mr. SPEAKER :—Motion moved :

"That Government be granted a sum not exceeding Rs. 8,07,700 under Demand No. XXIII—Labour including factories."

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 8,07,700 for Labour including Factories by Rs. 100.

(కార్మికులు తమ యిబ్బందులు లేబరుఆఫీసరుకు తెలియజేసిన 3 నెలలు లోగా పరిష్కారం చేయవలెనని డి. యల్. ఓ. లకు హుకుం యిప్పించవలెనని)

Sri PILLALAMARRI VENKATESWARLU :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 8,07,700 for Labour including Factories by Rs. 100.

(To discuss the working of the Industrial Tribunal).

Sri PILLALAMARRI VENKATESWARLU :—Sir, I beg o move :

To reduce the allotment of Rs. 8,07,700 for Labour including Factories by Rs. 100.

(To discuss the failure of the Government to implement the terms of agreement arrived at with the Andhra Electricity Employees Union).

Sri M. NAGI REDDI :—Sir, I beg to move :

**To reduce the allotment of Rs. 8,07,700 for Labour including Factories by Rs. 100.**

(పరిశ్రమలలో పనిచేస్తున్న కూలీలందరికి కనీసవేతనాలు నిర్ణయించి, అమలు పరచుటకు ప్రభుత్వం పూనుకోనందుకు.)

MR. SPEAKER :—The main-Demand and the cut motions are now before the House for discussion.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా! మన రాష్ట్రంలో పారిశ్రామకసంస్థలు చాలా తక్కువగా ఉన్నాయి. ఈ పారిశ్రామిక సంస్థలకు సంబంధించిన కార్మికుల పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉన్నదని చెప్పక తప్పదు. ఇప్పుడున్నటువంటి machinery కదిలే machinery కాదు. ఎవరైనా ఒకరికి ఏదైన ఇబ్బంది వస్తే, దాన్నిగురించి పై అధికారులకు వ్రాసుకుంటే సంవత్సరముల తరబడి అటులనే ఉండిపోతున్నది గాని కన్సిలియేషన్ జరుగుట లేదు. కన్సిలియేషన్ జరిగితే వాటిని అమలు జరపడం లేదు. దానిని అమలు జరుపుటకు ప్రయత్నంచేసి విఫలమయిన తరువాత Tribunal కు పంపించడం జరుగుట లేదు. ఒకవేళ Tribunal కు పంపించినట్లయితే వారు ఇచ్చేటటువంటి award అమలు జరిపే విషయంలో మళ్లీ మీరు కోర్టుకే వెళ్లాలి అని చెప్పే పద్ధతి చాలా విషాదంగా ఉన్నది. అందువల్ల భారతదేశంలో కార్మికులకు రక్షణ అనేది ఉందా లేదా? అన్నది తెలియకుండా ఉన్నది. ఉదాహరణకు ఒక మోటారు కార్మికుని యొక్క ఉద్యోగం ఆమాంతగా తీసివేస్తే అతడు ప్రభుత్వానికి తెలియబరచి 6 నెలలు అయినప్పటికీ దానిని గురించి ఆలోచిస్తున్నామని గాని, లేకపోతే త్రోసివేసినామనిగాని జవాబు లేకపోతే ఆ కార్మికునికి ఆశ ఎలాఉంటుంది?. అటువంటప్పుడు ఈ Acts యొక్క ప్రయోజనం ఏమిటి? ఈ departments యొక్క ప్రయోజనం ఏమిటో ఏవిధంగా కార్మికులకు మన ప్రభుతం సహాయం చేస్తున్నదో నాకు అర్థంకావడంలేదు. గవర్నమెంటు ఇచ్చిన award ఎందుచేత అమలు జరగలేదు అన్నట్లయితే వారు ఒప్పుకోవడంలేదు. మమ్ములను ఏమిచేయమంటారు మీరు కావాలంటే సివిల్ కోర్టుకు వెళ్లండి. అప్పుడు మేము సహాయం చేస్తాము. మేముకూడ పాత్ర్యముంటామని చెబుతున్నారు. సివిల్ కోర్టుకు సహాయంవచ్చే పద్ధతిలో ప్రభుతంఉన్నది అంటే ఇది ప్రభుత్వం యొక్క అసమర్థత అనుకోవాలో, లేక శాసనములలో ఉంటే బలహీనత అనుకోవాలో నాకు అర్థంకావడంలేదు. ఒకవేళ శాసనములలోని బలహీనతే అయినట్ల

Sri Vavilala Gopalakrishnayya] [23rd March 1956

యితే దానికి తగినటువంటి శాసనములు చేయాలి. ప్రభుత్వంలో ఉంటే అసమర్థత అయినట్లయితే దానికి సంబంధించి ఉద్యోగస్థులను మార్చి సమర్థనీయంగా ఉండే టట్లు అమలు జరపవలసియున్నది.

గుంటూరు జిల్లాలోని District Labour Officer ను higher training కోసం కలకత్తా పంపించి 6 నెలలు అయింది. మంచి విజ్ఞానం సంపాదించి ఆయన వస్తారు. సంతోషించవలసిన విషయమే. ఈ 6 నెలలలోను అక్కడ appoint చేయుటకు ఎవరూ లేరా ? ఇప్పటికి 4 సార్లు వస్తామని వ్రాశారే కాని ఎవ్వరూ రాలేదు. వస్తారు కదా యని మేమంతా సంతోషించాము. జిల్లా లేబరు ఆఫీసరు శ్రీ సత్యమూర్తిగారు లేనప్పుడు కూడా Labour Officer ను appoint చేసినారు. కాని ఆయన సరిగా చేయలేదు. ఈ 6 నెలలు పోతే ఆయనే వచ్చి చేసుకుంటాడు. ఇది నాకేమీ సంబంధం లేదు అన్నట్లుగానే వ్యవహరించారు. 6 నెలల తరువాత ఆయన వచ్చి చేసుకొనే పరిస్థితిలో ఈయనకు అక్కడ ఉద్యోగం ఎందుకు ?.

సత్తెనపల్లిలో factory ఒకటి ఉన్నది. ఆ factory contractor మీద నడుస్తున్నది. contract లో ఉన్నటువంటి driver ను వెళ్లగొట్టినారు. అతను కన్సిలియేషన్ అడిగినాడు. ఇప్పటికి దాదాపు 1½ సం॥లు అయింది. దానికి విచారణ చేస్తామని జవాబు మాత్రం ఇచ్చారు. contract మారిపోయింది. ఇప్పుడు ఆ factory ఇంకొకరి యాజమాన్యంలో ఉన్నది. అతనికి కన్సిలియేషన్ ఇవ్వడం జరగ లేదు. అతను ఇప్పుడు కన్సిలియేషన్ కొరకు వచ్చినట్లయితే proprietor లేక ఆ employer ఇదివరకటి అతను కాదు. అందువల్ల నాకేమీ సంబంధం లేదు, నేను చేయను అంటాడు. ఒకవేళ అతనికి అన్యాయం జరిగిందనే ఉద్దేశ్యంతోటి తనకు డబ్బు ఇవ్వాలని అడిగితే, అతను ఒప్పుకొనకపోతే, Tribunal కు పంపి, ఆ tribunal award ఇస్తే వారిమీద అమలుజరుపుతారు. అసలు ఇదివరకు ఉన్న మనిషి కాదు: ఆలస్యం జరుగుటకు కారణమేమిటి ? 2, 3 నెలలలో ఇది పరిష్కారమయ్యే విధానమును ప్రభుత్వంవారు అవలంబించకపోయినట్లయితే ఈ departments అన్నీ నిరుపయోగమవుతాయని మనవి చేస్తున్నాను.

I.L.T.D. కంపెనీలలో వివాదపడినవారు 5 సార్లు appeal చేశారు. ఇంత వరకు దానికి జవాబు రాలేదు. 2 సంవత్సరములయిపోయింది. అతనిమీద అన్యాయంగా ఛార్జి పెట్టినారు. తనంతట తాను చెప్పుకుంటూ నన్నాడు. కార్మికులను [illegible]న్నారు. సత్తెనపల్లిలో జరిగిన సంఘటనను చేసి [illegible]

23rd March 1956] [Sri Vavilala Gopalakrishnayy

చెప్పకపోయినట్లయితే "మీరు abstract గా generalise చేస్తే లాభంలేదండీ'
అని మంత్రిగారు అంటారు కనుక నేను ఒక్కొక్కరూపమే మీదృష్టికి తీసుకి
వస్తున్నాను. ఒక ఉత్తరం అతను, నేను కలిసివెళ్లి Labour officer గారి చేతి
ఇచ్చాము: అందలేదు అనడానికి వీలులేదు. విచారణచేస్తానని చెప్పినాడు
ఇంకా ఎన్నాళ్లు విచారణచేస్తారో తెలియదు. ఆలోచిస్తున్నామని enquir:
letter కూడ లేదు. ప్రభుత్వంవారిదృష్టికి అక్కడ జరిగినటువంటి 3 సంఘట
నలను తీసుకువస్తున్నాను. అది చాలా వెనుకబడిన బీదప్రాంతం. అక్కడ ఉండే
మొత్తం కార్మికులు 66 మందికన్నా ఎక్కువ ఉండరు. 66 గురు గల్గిన, బహు
స్వల్పజనాభా గలిగిన ఈ ప్రాంతంలో విచారణచేయుటకు కుదరనప్పుడు మిగిలిన
ప్రాంతాలనుండి వచ్చే కేసులను ఏవిధంగా విచారిస్తారు. మంత్రిగారు బహుశా
ఇవి వదలిపెడుతున్నామని చెప్పవచ్చును. మోటారుడ్రైవరులకు వర్తించినా
లారీడ్రైవరులకు Minimum Wages Act apply కాదు. డ్రైవర్సుకు apply
అవుతుంది కాని కార్మికులకు apply కాదు. అది ఏమి న్యాయం ?

అవి న్యాయంగాలేదని చెప్పి అందరూ అనుకొంటున్నారు. త్రైపాక్షిక
సంఘముకూడ అంగీకరించింది. ప్రభుత్వంవారు ఈబిల్లు ఎన్నాళ్ళలో తీసుకువస్తా
రనేది ప్రధానమైన సమస్య. వీరి ఉద్యోగములకు హామీ ఏమైనా ఉన్నదా ?
హామీ ఇవ్వకపోతే ఎట్లాగ ? ఇప్పుడు ఉదాహరణకు మోటారుడ్రైవరు ఉన్నాడు.
motor మారిపోతుంది. అతనని మళ్ళీ డ్రైవరుగా తీసుకొందుకు శాసనములో హక్కు
ఏమైనా ఇచ్చారా ? ఇవ్వలేదు. ఆ బస్సు యజమానులకు, డ్రైవరులమీద ఏదైనా
కోపం వచ్చినట్లయితే ఇతనిని తొలగించి తన ఆప్తుని వేసుకొంటాడు. అటువం
టప్పుడు ఈ drivers గతి ఏమికావాలి ? వారు గవర్నమెంటు సర్వీసులో
ఉన్నట్లయితే pension రావలసినపరిస్థితి. వారికి 25, 35 సం॥లు సర్వీసు
ఉన్నది. అతని జీవితమంతా కార్మికరంగంలోనే ధారపోశాడు. దానికే
ఆహుతి అయ్యి ఎండప్రాంతములలో ఉండడంవలన అతనికి పనిచేయుటకు
శక్తిలేనిపరిస్థితులలో "మీకు protection ఎక్కడనుంచి వస్తుంది" అని
వారిని అడిగినట్లయితే వారు చెప్పుటకు తెలియనిస్థితిలో ఉన్నారు.
అందువల్ల ప్రభుత్వంవారు ఈ విషయమును గురించి ఆలోచిస్తున్నారా ? కార్మికులకు
గృహవసతి Factory యజమానలు కలుగజేసినటయితే బాగుంటుంది. హైదరా
బాదులో 500 రూ॥ల తోటి ఒక model house ఏర్పాటు చేశారు. ఈ

Sri Vavilala Gopalakrishnayya] [23rd March 1956

workers కు అందరకూ ఒక్కొక్కరికి 500-1,000 రూపాయలు ఖర్చుపెట్టి ఒక చిన్న house ఏర్పాటుచేస్తే బాగుంటుంది. Co-operative Department ద్వారా ఖర్చుపెడుతున్న డబ్బంతా సద్వినియోగంఅవదు. 2, 3 ఇళ్లు ఉన్నవారు ఇంకో 4 ఇళ్లు కట్టుకొని ఇళ్లులేక బాధపడుతున్న కార్మికులకు అద్దెలకు ఇచ్చుకొనేలాగా ఉంటున్నాయి. వీటినిగురించి ప్రభుత్వంవారు ఏమి ఆలోచిస్తారు? ప్రభుత్వంవారు చేస్తున్నాము, చూస్తున్నాము అంటున్నారు. డబ్బు ఖర్చుకాలేదని చెప్పడానికి వీలులేదు. మంచి మంచి భవనములతో గాంధీనగరమని, పట్టాభి నగరమని, ప్రకాసునగర్ అని పెరుగుతూఉంటే కార్మికులకు ఇళ్లులేక బాధపడుతున్నారు. బీదవానికి ఆ భవనములవైపు వెళ్ళవలసినపనేలేదు. ఒక్క పాకీ పనికి వెళ్లడంతప్ప ఇంకేమీపనిలేదు. కాబట్టి కార్మికులపరిస్థితిని ఈ Labour department ఏ విధంగా పరిశోధిస్తున్నది ?

గ్రామాలలో ఎక్కువమంది వ్యవసాయకూలీలు ఉంటున్నారు. రాష్ట్ర మొత్తంలో 5,6 గ్రామములకుకలిపి Minimum Wages Act అమలు పరచామంటున్నారు. ఇది ఎన్ని గ్రామాలలో Actual గా అమలుజరిగింది. వారికి ఇంత కూలికన్న తగ్గించకూడదని నిర్ణయం చేశారు. బాగానేఉంది. వారికి శెలవుల పద్ధతి ఏమైనఉందా ? లేకపోతే సంవత్సరంలో ఇన్ని రోజులకన్నా, వారంలో ఇన్నిగంటలకన్నా ఎక్కువపని చేయకూడదని ఉన్నదా ? అయితే వ్యవసాయమునకు ఇది ఎట్లా అన్వయిస్తుంది ? ఇది పగలస్తమానం చేసేపనికదా అని మంత్రిగారు అంటే నేను దానిని త్రోసిపారేయడంలేదు. కాని ఎవరైనా overwork చేసినట్లయితే దానికిగాను ఇంకొకరోజున కూలీఇవ్వండి. వారంరోజులలో 5 రోజులు పనిచేయించి, 2 రోజులు కాళీగాఉంచి మొత్తం ఈ 7 రోజులకు జీతంఇచ్చే ఏర్పాటుచేస్తే బాగుంటుంది. Minimum Wages Act ఒకటి అమలుపరచాలి. అంతేకాని ఏ రోజున కారోజీలెఖ్ఖకట్టి మొత్తం పనిచేయడానికి వీలులేదన్నట్లయితే న్యాయంకాదు. ఈ 2 ప్రధానంగా ఆలోచించాలని నేను మంత్రిగారిని కోరుతున్నాను. వ్యవసాయకూలీలకు Minimum Wages Act తోపాటు time restrictions కూడ ఏర్పాటు చేయవలసిన అవసరంఉన్నది. ఈ మోటారు పనివారు ఎవరైనాసరె వారు ఏ వృత్తిలో పనిచేస్తున్నారో ఆ వృత్తి మేనేజమెంటు మారినప్పుడు, ఇతనిని కదిలించుటకు వీలుండదని యజమానులమీద పెట్టినారు. దానికి సంబంధించిన G. O. గాని శాసనం గాని implement చేయాలి. ఇప్పుడున్నటువంటి Labour Officers ఏదో పద్ధతిలో వస్తున్నారు,

[At this stage Mr. Deputy Speaker occupied the Chair.]

మూడవది Shop Employees act అనేదిఒకటిఉంది. Shop Employees Act గనుక చూచినట్లయితే వేదాంతములో అచ్చం నేతి నేతి సిద్ధాంతము మాదిరిగా ఈ Industry ని exempt చేయడం జరిగింది ఇక మిగిలేది ఏమిటో, ఇక వాళ్ళకు apply అయ్యేటటువంటిదేదో బోధపడడంలేదు వాటిని అమలుపరచేవాళ్లు ఎవరూ అగపడడంలేదు Labour Officer మాత్రంవచ్చి పుస్తకాలు సరిగా ఉన్నాయా లేదా అని తనిఖీ చేస్తున్నాడు. అంతవరకు సంతోషమే అసలు వస్తున్నాడని. కాని వాళ్లకు ఇచ్చి protection ఏమిటి అంటున్నాను. కనుక Shop Employees Act లో exemption ఏమిలేకుండా అన్నిటికీకూడా అమలుజరిపే పద్ధతైనా ఉండాలి. లేకపోతే బిల్లేఎత్తివేయాలి Statute లో బిల్లుమాత్రం అగుపడుతున్నది గాని దానివల్లజరిగేదేమిలేదు. ప్రతితడవ Gazette లో చూసుకొంటే ఈ Industries ఒకటి తరువాత ఒకటి జారిపోతున్నాయి ఈనాడు మన రాష్ట్రానికి సంబంధించినంతవరకు చిన్న చిన్న ఫాక్టరీలలోని కూలీలు shop employees, మోటారు workers ఫ్యాక్టరీలలో కొందరు ఉన్నారు అంతాకలిస్తే organised labour 1 లక్ష 6 వేలమందిమాత్రం ఉన్నట్లు లెక్కవున్నది. దానిలోకూడా మార్పులు వచ్చినాయి. ఇప్పుడు latest figures రావడంలేదు గనుక నేను చెప్పలేకుండా ఉన్నాను. అందువల్ల వాళ్లకు ఏవిధమైనటువంటి protection ఇస్తున్నారని అడుగుతున్నాను. తరువాత co-operative labour organisations ఉన్నాయి. అది Co-operative Department కు సంబంధించింది కావచ్చుకొండి. అయిన, దానిని అమలు జరపవలసినవాళ్లు వీళ్ళే. ఆ workers కు ఎవరు జీతాలు ఇస్తారు. ఇప్పుడు నాగార్జునసాగర్ ప్రాజెక్టు ప్రారంభించారు. అక్కడ పనిచేస్తున్న workers కు జీతాలు ఎవరిస్తున్నారో వారందరికి కూలి ఎవరిస్తున్నారో విచారించారా ? నేను క్రిందటి తడవ కూడా ఈవిషయమై మనవి చేశాను. తుంగభద్ర ప్రాజెక్టులో మనం ఒకసారి అనుభవం పొందాము, ఎవరో దళారీలు contractors వచ్చి ఆ workers నందరిని తీసుకొచ్చి వీళ్లంతా నామువా అని పనికి వప్పజెప్పి రెండుదఫాలు వాళ్లయొక్క జీతాలు తీసుకొని కనబడకుండా వెళ్లిపోతే, ఆ workers పోయి contractors ను అడిగితే వాళ్లు మీ sub-contractor కు మొన్ననే ఇచ్చాము అంటే ఎవరండీ వాళ్లెవ్వరో మాకే తెలియదు అంటే వాళ్లద్వారా మీరు వచ్చారుగనుక ఆ గ్యాంగు క్రింద ఆ గాంగులోనే మీరుపోయారు వేరేగా ఇవ్వడానికిలేదు అనిచెప్పారు. అందువల వాళ్లకు protection ఇచ్చేటటువంటి పద్ధతిలో Labour Officers ను

appoint చేసే contractor విషయంలో అతను register అయి deposit చేసే పద్ధతిగాని అవసరమయితే అతనిఆస్థిలో పట్టుకునే పద్ధతిగాని అమలుజరపాలి. వాళ్లకు ఇళ్లసౌకర్యాలు ఏమిలేవు. అందువల్ల పెద్దపెద్ద ప్రాజెక్టులపనులు జరిగేచోట్ల 500 మందికన్న ఎక్కువ కూలీలను ఎక్కడైతే పెట్టు కుంటారో అటువంటి ప్రాజెక్టు లన్నింటికికూడ labour conciliation officer ను regular గా appoint చేస్తే కొంతవరకు ఉపయోగం వుంటుంది. అతను ఏమి చేయలేకపోయినా మనిషి అయినా ఉంటాడు చెప్పుకోటానికి. అతడు ఏమిచేయక పోతే ప్రభుత్వాన్ని ఒత్తిడిచేసి అడగడానికైనా పీలవుతుంది. కనుక ఆవిధంగా projects ఏర్పాటుచేయ వలసిందని మనవిచేస్తున్నాన.Labour workers కు ఇండ్ల స్థలాలు ఇవ్వవలసి వున్నది. వాళ్లు ఎక్కడైనా వేసుకోవాలంటే Government స్థలాలలో వేసుకోవాలి. అదికూడ encroachment అని వెళ్లగొడుతున్నారు. ఆ విధంగా వెళ్లగొడితే 14 మైళ్ల దూరంలో ఇక్కడ encroachment కాకుండా forest కాకుండా మరెక్కడ ఉంటాడు అతను? అందువలన ఆ workers కు అక్కడ చోటివ్వాలన్నట్లయితే మీరువిధిగావాళ్లకు కావలసిన welfare opinion కు వేసిఇళ్లసౌకర్యాలు ఇవన్నికూడా కలుగజేయవలసిన అవసరం ఉన్నదని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI B. G. M. A. NARASINGA RAO :—ఉపాధ్యక్షా, ఈ కార్మిక పద్దును నేను బలపరుస్తు కొన్ని నిర్మాణాత్మకసూచనలను ప్రతిపాదిస్తున్నాను. ఈ సంవత్సరం ద్వితీయపంచవర్ష ప్రణాళికయొక్క మొదటిఘట్టము. కార్మిక సంక్షేమంక్రింద ఏమిపనులు చేస్తున్నారో పూర్తిగా నిర్ణయం కాలేదు. ఇంతవరకు మనం labour enactment అమలు జరపడంతోనే మన ప్రభుత్వముయొక్క కాలము సరిపోతోంది. సంక్షేమం అనే పదానికి పూర్తి అయిన అర్థం కలుగలేదు. Labour union కు సహకారం ఇవ్వడానికి labour union లో సహకార సంస్థలు స్థాపించడానికి ప్రభుత్వం మద్దతు ఇవ్వడంగాని, labour union లో సాంఘిక సంక్షేమ కార్యకలాపాలు జరిపించడానికి అనువుగా గాని ఇంతవరకు ఏమి జరుగలేదు. Adult Education centres పెట్టవచ్చును. Night schools కూడ పెట్టవచ్చు. సాంఘిక సంక్షేమ కార్యకలాపాలలో కార్మికులు విరివిగా పాల్గొనేటట్లు చేయడానికిగాను ప్రభుత్వం ఇంతవరకు ఒక నిర్ణీత కార్యక్రమాన్ని ఏర్పాటు చేయలేదు. Labour Department లో యిప్పుడున్న [illegible] అమలుజరపడంతోనే కాలం సరిపుచ్చుతున్నదేగాని ఇప్పటివరకు ఇటు వంటి [illegible]మానికి ప్రభుత్వం యింకా పూనుకోలేదు. అందువల్ల ద్వితీయపంచ

వర్ష ప్రణాళికలో అయినా మంచిపనులకు పూనుకొని labour unions అంటే యజమానులతో పోరాడే సంస్థలు కాకుండా కార్మికుల సమాజ వికాసానికి తోడ్పడే సంస్థలు క్రింద పనిచేసేటట్టు ప్రభుత్వము అవకాశం కల్గిస్తుందని నేను ఆశిస్తున్నాను.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక నిరుద్యోగ నివారణకు ఎక్కువగా తోడ్పడుతుందని అన్నారు. అయితే నిరుద్యోగ నివారణకు ఏవిధంగా తోడ్పడేది ఇంత వరకు ఎటువంటి సూచనలు ప్రభుత్వం చేయలేదు. పారిశ్రామిక విధానాన్ని బట్టి చూసినను అటువంటి ఆశ కూడా ఏమి కనబడడం లేదు. గతసంవత్సరముయొక్క అనుభవాన్ని బట్టిచూస్తే పారిశ్రామికవిధానలోపముచేత ప్రతిసంవత్సరము కార్మికుల సంఖ్య తగ్గిపోవడం సంభవిస్తున్నదిగాని కార్మికుల అభ్యుదయానికి కార్మికుల ఉద్యోగవసతులు అభివృద్ధిచేయడానికిగాను ప్రయత్నమేమి జరగడంలేదు. అందుచేత ద్వితీయపంచవర్ష ప్రణాళికలో కార్మికులకు ఎక్కువ వసతి సౌకర్యాలు కల్పించేందుకుగాను ప్రభుత్వం ఒక నిర్ణీతపథకాన్ని తయారుచేసి దాని ప్రకారం పారిశ్రామిక విధానాన్ని రూపొందించి కార్మికులకు వసతిసౌకర్యాలు, ఉద్యోగ అవకాశాలు ఎక్కువగా కల్పిస్తారని నేను ఆశిస్తున్నాను. Employment Opportunities కు ఇతోధికంగా సహాయంచేస్తున్నదనుకొనేందుకు ద్వితీయ పంచ వర్ష ప్రణాళికలో దానికొరకేమి రూపొందించలేదని నేను మనవిచేస్తున్నాను. వచ్చే ప్రణాళికకాలములో తప్పకుండా ఆవిధంగా ప్రభుత్వం పథకం తయారుచేస్తుందని నేను ఆశిస్తున్నాను.

జాతీయాదాయాన్ని యీ రాబోయే అయిదుసంవత్సరాలుగా 4 వ వంతు పెంచుతామని అన్నారు. 25% పెరగాలి అంటే ప్రతిసంవత్సరము ప్రతికార్మికునికి, ప్రతి ఉద్యోగికి కూడా 5% జీతం పెంచవలసి ఉంటుంది అన్నమాట. ప్రతి సంవత్సరం 5% అధిక వేతనం కల్పించేందుకు ప్రభుత్వము ఎటువంటి ఏర్పాటు చేసినదని ఆలోచించినట్లయితే ఇప్పటివరకు ఏమి చేయలేదు. ఇటువంటి ఏర్పాట్లు నేటినుంచి చేయకపోయినట్లయితే ద్వితీయపంచవర్ష ప్రణాళికలో, రెండు మూడు ఏండ్లు గడచిపోయినప్పటికి ఈ ఏర్పాటు జరగదేమోనని కార్మికు లందరికి భయంగా ఉన్నది. కనుక ఏ హామీలైతే కార్మికులకు ఇస్తున్నామో ఆ హామీల మీద వాళ్లకు నమ్మకం కలగటానికి ప్రభుత్వం యిప్పటినుంచి ప్రయత్నంచేసి వారికి ఇతోధిక ఉత్సాహం కలిగించి పనిచేసేటట్లయితే national production లో నైనా increase కావడానికి అవకాశం ఉంటుందని నా నమ్మకం. అందుచేత

National wage level, State wage level Boards వెంటనే నిర్మించి ప్రతి కార్మికునికి అధికవేతనం వచ్చేటట్లు చేస్తారని నేను నమ్ముతున్నాను. కఱువుభత్యాన్ని కూడా జీతంతో కలపాలని గాడ్గిల్ కమిటీ సూచనలు చేసినది. ధరలు పడిపోవన్న నమ్మకం ప్రతివారికి కలిగింది. ధరలు పడిపోకుండా ప్రభుత్వం రక్షణలు, హామీ యిస్తూనే ఉన్నది. ధరలు పడిపోకుండా ఎన్నిచర్యలు తీసుకోవాలో అన్నిచర్యలు ప్రభుత్వం తీసుకొంటూనే ఉన్నది. రైతుల రక్షణకోసం ధరలు పడిపోకుండానే కాపాడుతున్నామని ప్రభుత్వం చెబుతున్నది. అది ప్రభుత్వంయొక్క policy అయినప్పుడు ధరలు ఏవిధంగాను తగ్గిపోగలవు. ధరలు లగ్గనపుడు కరువుభత్యం తగ్గుతుందనే నమ్మకం ఎప్పుడూ ఉండదు. కరువుభత్యం తగ్గినపుడు కఱువు అని వేరే చూపించేదానికన్న యీ కరువుభత్యాన్ని జీతంలో కలిపివేసి wage level తీసుకురావాలనేది ప్రభుత్వంయొక్క policyగా నైనాఉండాలి. లేకపోతే కనీసము యీ కరువు భత్యాన్ని జీతంతో కలిపి ఆ జీతాన్ని ఆదాయంగా చేయాలని గాడ్గిల్ కమిటీ సూచించినా మనప్రభుత్వం ఇప్పటివరకు ఏమి ఏర్పాటుచేయలేదు. ఈవిధంగా చేయకపోవడంవల్ల Provident fund లోను, bonus లోను, తదితర overtime allowances లోనూ కార్మికునికి తగ్గిపోతుంది. ఈవిధంగా కరువు భత్యం అని వేరే చూపించడంవల్ల అనేకవిషయాలలో కార్మికునకు నష్టం సంభవిస్తోంది. అందువల్ల ప్రభుత్వంయొక్క policy యే ధరల తగ్గకుండా చూడాలని అంటున్నప్పుడు ధరలు తగ్గిపోవనే నమ్మకం ప్రభుత్వానికి ఉన్నప్పుడు కరువు భత్యం కరువుభత్యం అని 1939 సంవత్సరం ఏర్పాటుచేసినపద్ధతిని ఇంకా ఎందుకు అనుసరించాలో బోధపడడంలేదు. ఈ సంవత్సరం అయినా గాడ్గిల్ report ను అమలుజరిపి జీతంతో కరువుభత్యాన్ని కలిపివేస్తారని నేను నమ్ముతున్నాను.

రెండవది Minimum Wages Act ఉన్నది. ఏ పరిశ్రమలలో అయితే కార్మికులు తమంతట తామే కార్మికసంఘాలను ఏర్పరచుకొని, తమ పరిస్థితులను తామే రక్షించుకొనే శక్తి ఎవరికైతే ఉండదో అటువంటి కార్మికులు రక్షణ కల్పించేందుకు Minimum Wages Act నొకదానిని తయారుచేశారు. అయితే ఈ Act లోని schedule లో కొన్ని పరిశ్రమలను మాత్రమే పేర్కొన్నారు. ఆంధ్రలో ఉప్పుపరిశ్రమ ఉన్నది. చాలపెద్ద పరిశ్రమ. ఆంధ్ర రేవులలో అసంఖ్యాకమైన జనాభా పనిచేస్తున్నారు. వారిలో సంఘటితశక్తికూడా చాలా తక్కువ. అందుచేత వారందరికి కూడా Minimum Wages Act వర్తిస్తుంది. Shop employees కి కూడా కార్మికసంఘాలను సృష్టించుకొనే సంఘటితశక్తి చాల

తక్కువగా ఉన్నది. ఎటువంటి కార్మికులకు సంఘటితశక్తి ఉండదో అటువంటి వారిని రక్షించడం ప్రభుత్వంవారి ప్రథమ కర్తవ్యం. అందుచేత ఈ పరిశ్రమలన్నింటినికూడా Minimum Wages Act యొక్క Schedule లో క్రింద చేర్చి వారి పరిస్థితులన్నిటిని విచారించి, కార్మికుల కనీసవేతనాన్ని నిర్ణయించి అమలు జరుపుతారని విశ్వసిస్తున్నాను. ద్వితీయపంచవర్ష ప్రణాళికలో Minimum Wages Act కాకుండా Fair Wages Act కూడా అమలుజరుపుతారని మా తాలూకా ప్రజలయొక్క ఆశయం. ప్రభుత్వం ఈవిషయం ఎక్కువగా కృషి చేస్తుందనే నా నమ్మకము.

అంతే కాకుండా, కార్మికులకు, బీదజనానికి, సంఘాలు లేనిచోట, వారికి రక్షణఅంటూ లేకపోతున్నదిWorkmen's Compensation Act అనండి, Payment of Wages Act క్రింద అనండి, తరువాత తదితర చట్టాలక్రింద అనండి, minimum wages ఇవ్వమంటె, ఇవ్వననే యజమానిఉంటె, ఆ యజమానిమీద దావా వేయాలన్నగాని, చట్టరూపకంగా అతనివద్దనుంచి రాబట్టాలన్నాగాని, Court కు పోవలసియుంటుంది. అయితే బీదకార్మికుడు కోర్టు ఎక్కడానికి శక్తి లేక చాలామట్టుకు ఇటువంటి కేసులు వదులుకోవడం సంభవిస్తుంది. కనుక అటువంటిదిజరుగకుండా, కార్మికులకు, బీదజనానికి రక్షణ కల్పించేందుకు వారికి ఇటువంటి విషయాలలో free legal aid ఇప్పించవలసిందని మనవిచేస్తున్నాను. ఆ విధంగా కార్మికులకు, కార్మికసంఘాలకు free legal aid కల్పించినట్లైయితే, చాలా కార్మికసంక్షేమం జరుగుతుందని ఆశిస్తున్నాను. తరువాత Employees State Insurance Scheme అమలు జరుపుతామని అంటున్నారు. అది చాలా ముదావహము. ఈ Scheme పట్టణాలలో అంత సహాయకారిగా లేదుగాని పల్లెటూళ్లలో చాలా సహాయకారిగా ఉంటున్నది. అయితే ఇప్పుడు ఈ చట్టములో అనేక లోపాలున్నాయి. పెట్టవలసినచోట Dispensaries పెట్టకుండా, ఉన్న Dispensaries లోకూడ అన్ని మందుల సౌకర్యాలు లేకపోవడంవల్ల ప్రస్తుతం చాలా ఇబ్బందిగా ఉన్నదని కార్మికులు చెప్పుతున్నారు. విజయవాడలో Dispensary చాలా దూరంగాఉన్నదని, విశాఖపట్టణంలోఉన్న Dispensary సరిగా అందుబాటులోలేదని, చాలా Complaints ఉన్నాయి. ఇవన్నీ సర్దుబాటు చేసుకోవచ్చు. కాని ఈ చట్టము యదాతథంగా అమలు జరిగినట్లైయితే, కార్మికులకు ఏ విధంగాను సౌకర్యంఉండదు. ఈ చట్టములో కార్మిక కుటుంబానికికూడ వైద్యసౌకర్యము అనేది కల్పించినప్పుడే ఈ చట్టముయొక్క real spirit అమలు

జరిగినట్లు అవుతుంది. కనుక ఈ చట్టాన్ని కార్మికులకుటుంబాలకుకూడ వర్తింప చేయాలని, workers ఇచ్చే contribution ఇంకా తగ్గించడానికి వీలుఅవుతుందేమో పరిశీలించవలెనని, ఈ చట్టాన్ని అన్నిచోట్ల కార్మికులందరికి వర్తింప చేయాలని కోరుతున్నాను. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఈ పని ప్రభుత్వము చేయగలుగుతుందని ఆశిస్తున్నాను.

తరువాత, Factory Act గురించి కొంత మనవిచేయవలసియున్నది. ఈ factories లో, పూర్తిగా industrial factories, seasonal factories (agricultural factories) అని రెండు రకాలుగా ఉన్నాయి. మన రాష్ట్రములో seasonal factories ఎక్కువగా ఉన్నాయి. ఈ Factory Act అనేది పెద్ద భారీఎత్తు పరిశ్రమలను దృష్టిలో ఉంచుకొని తయారుచేశారు. దీంట్లో కూడ చాలా అవకతవకలు జరుగుతున్నాయి. ఈ చట్టమువల్ల రావలసిన రక్షణలు రావడంలేదు. ఈ Factory Act పూర్తిగా, సంవత్సరమంతా పనిచేసేటటువంటి perennial industrial factories కు వర్తించినట్లుగా seasonal factories వర్తించడంలేదు. అందుచేత seasonal factories లో పనిచేసేటటువంటి కార్మికులయొక్క సమస్యలుకూడ పరిష్కరించేందుకు వేసే ఒక చట్టము తీసుకురావడానికి వీలుంటుందేమో ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పరిశీలించి ఆ విధంగా వారికి సహాయం చేయడానికి ప్రభుత్వము వెంటనే చర్యతీసుకోవలెనని కోరుతున్నాను. అంతేకాకుండా చాలా చట్టాలు seasonal factories కు పూర్తిగా వర్తించడం లేదు. వర్తించిన, అమలులో చాలా లోపాలు కలుగుతున్నాయి. ఈ seasonal factories లో ఉన్నటువంటి కార్మికులకు రక్షణఅంటూ కలగడంలేదు. ప్రతి దానికికూడ minimum qualifying period అని పెట్టడం జరుగుతున్నది. Meternity benefit act అమలు జరగడంలేదు. దాంట్లో ఎప్పుడో పూర్వము నిర్ణయింపబడిన rates ఈనాడుకూడ అమలు జరగడంవల్ల, కార్మికులకు ఏమి ఉపయోగంలేదు, అందుచేత meternity benefit వారికి వచ్చేవిధంగా ఆ rates మార్చవలసిందని కోరుతున్నాను. తరువాత Workmen's Compensation Act లోకూడ అనేక లోపాలు ఉన్నాయి. ఈ విషయము గురించి అనేక Boards అనేక కమిటీలు పెట్టి చర్చించి, కేంద్రప్రభుత్వానికి సిఫార్సులు పంపించామని చెప్పారు. దీంట్లోఉన్న Schedule లో ఏ workers కు ఏ దెబ్బతగిలితే ఎంత compensation ఇవ్వాలి అనేది నిర్ణయించబడింది. ఈ నిర్ణయం ఎప్పుడో 20 సంవత్సరాలక్రితం జరిగింది, నాటి పరిస్థితులకు, నేటి పరిస్థితులకు చాలా తేడా

ఉన్నది. ఎక్కడా మచ్చుకుకూడా ఆనాటిపరిస్థితులు ఈనాడులేవు. ఆనాడు నిర్ణయించబడిన tariff, ఆనాడు నిర్ణయించబడిన Schedule ఈనాడుకూడ అమలుజరుపుతామంటే అర్థంలేదు. అందుచేత ఈ Schedule ను నేటి పరిస్థితులకు అనుగుణంగామార్చి కార్మికులకు ఇవ్వవలసిన compensation ఎక్కువ చేయాలని, ఆ విధంగా కేంద్రప్రభుత్వానికి సిఫార్సు చేయవలసిందని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. తరువాత Payment of Wages Act అందరి కార్మికులకు, అందరి shop employees కు ఈనాడు వర్తించడంలేదు. కనుక అందరి కార్మికులకు, contractors కు వర్తించేటట్లు చేయవలసిందని కోరుతున్నాను. అంతేకాకుండా ఇంకొక ప్రధానసమస్య ఉన్నది. ఈ పరిశ్రమలలో contractors అంటూ ఈ కార్మికులకు ఎటువంటి సౌకర్యము కలిగించకుండా చాలా factory యజమానులు తప్పించుకుపోతున్నారు. Abolition of contract system ను I. L. O. recommend చేసినప్పటికి, ప్రభుత్వము అది ఎక్కడైతే వీలుగా ఉంటుందో అక్కడ అమలు జరుపుతామనే విధంగా ఆమోదించింది. కొద్దిచోట్ల ఈ contract system చాలా విశేషంగా కనపడుతుంది. నిజంగా ఇదివరకు వేతనంమీద ఉన్న కార్మికులను తీసివేసి కంట్రాక్టర్లు క్రొత్తవారిని వేయడం కొన్నిచోట్ల జరుగుతున్నది. అందుచేత ఈ contract system అనే దాన్ని ప్రభుత్వ వ్యవస్థలలోనైనాసరే పూర్తిగా నిర్మూలించి, private sector లకు ఒక నిదర్శనంగాచూపి, ఈ contract system ను క్రమంగా అన్నిచోట్ల తొలగించేందుకు ప్రభుత్వము ప్రయత్నిస్తారని, అందుకుతగిన ఏర్పాట్లు చేస్తారని ఆశిస్తున్నాను.

తరువాత, గవర్నమెంటు పరిశ్రమలలో వున్న కార్మికుల పరిస్థితి మిగతా private పరిశ్రమలలో వున్నవారి పరిస్థితికంటే చాలా నికృష్టంగా ఉన్నది. మిగతా పరిశ్రమలలో కార్మికులకు జీతాలు చాలకపోతే, యూనియన్లుపెట్టుకొని ఆవిధంగా సాధిస్తున్నారు. ఆ యూనియన్లద్వారా పరిష్కారం కాకపోతే, న్యాయవర్తిద్వారా industrial tribunal కు పోయి awards తెచ్చుకోగలుగుతున్నారు ఆవిధంగా వారికి పూర్తికాకపోయినా, కొంచెమైనా న్యాయం కలుగుతుంది. కనుక ఇతర పరిశ్రమలలో కార్మికులకు awards ఏవిధంగా వస్తున్నాయో, వాటిలో minimum wages ఏవిధంగా రూపొందించబడినాయో, average నైన కనీసం ప్రభుత్వం తీసుకొని తమ పనివాళ్లకు ఇవ్వవలసినటువంటి బాధ్యత ప్రభుత్వం మీద ఉన్నది. ఎప్పుడైతే ఒకటి ఇతరులకు

recommend చేయగలుగుతారో, దానినే తమ పనివారికికూడ apply చేయవలసి నటువంటి బాధ్యత ప్రభుత్వంమీద ఉంటుంది. కాబట్టి ఈ Industrial Tribunal లో ఏవిధంగా నిర్ణయాలు జరుగుతున్నదో వాటిని, ఆ awards ను ప్రభుత్వ పరిశ్రమలలో వున్న పనివాళ్లకుకూడ వర్తింపజేసి ఆ విధంగా wages, కరువుబత్త్యము తదితర సౌకర్యాలు వారికి ఇవ్వవలసిన బాధ్యత ప్రభుత్వానికికూడ వున్నది. ఆవిధంగా ప్రభుత్వపాలిసీని రూపొందించవలసిందని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. తరువాత industrial housing గురించి ప్రభుత్వము చాలా కృషిచేసింది. అయితే పారిశ్రామిక యజమానులు ఈ industrial housing scheme ను అమలు జరపడంలేదు. అయితే ప్రభుత్వము ఎంత ప్రయత్నంచేసినా ఆ యజమానులు దీనిని అమలుపెట్టడంలేదని ఇది ఇంతటితో వదలిపెట్టకూడదు. ప్రభుత్వం ఒక శాసనం తీసుకువచ్చి, factory యజమానులు కార్మికులకు ఇళ్లు కట్టించితీరాలి లేకపోతే factory licence ఇవ్వము అనేవిధంగా, శాసనంచేస్తే తప్ప, ఆ యజమానులు ఈ housing scheme ను అమలుజరపరు. కార్మికులకు ఒకదిక్కూ అంటూ ఉండదు. ఒక రక్షణ అంటూ వుండదు. అందుచేత ప్రభుత్వము ఒక శాసనరూపంగా ఈ పనులమీద వొత్తిడితీసుకువచ్చి, ఆ విధంగా కార్మికులకు గృహనిర్మాణం మొదలగు సౌకర్యములు కలుగజేయవలెనని కోరుతున్నాను. అంతేకాకుండా ప్రభుత్వ కార్మికులకుకూడ గృహవసతి కల్పించవలసిన బాధ్యతకూడ ప్రభుత్వంమీద ఉన్నది. ఇది ప్రభుత్వంయొక్క ప్రథమ బాధ్యత. తక్షణ కర్తవ్యమని, గ్రహించి ప్రభుత్వము ఈ విషయములో వెంటనే చర్య తీసుకోవలసిందని, ద్వితీయపంచవర్ష ప్రణాళికలోనైనా ఈ పద్ధతి జరిపించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ఈ సూక్ష్మ విషయాలు ప్రభుత్వం దృష్టిలో పెట్టుకోవలసి ఉంటుందని నా ఉద్దేశ్యము. నేను చేసిన సలహాలు అన్నీ ప్రభుత్వము గమనించి రాబోవు పంచవర్ష ప్రణాళికలో రూపొందించి కార్మికులయొక్క సంక్షేమమును జరుపుతారని నేను ఆశిస్తున్నాను. మంత్రిగారు ప్రత్యేక శ్రద్ధ కార్మికులయందు తీసుకుంటారని ఆశిస్తున్నాను. మంత్రిగారుకూడ కార్మిక నాయకులుగా ఉన్నవారే గనుక, యీ కార్మికులయొక్క యిబ్బందులు అన్నీ వారికిగూడ తెలుసును. ఇదివరకు వాళ్ళ విషయములో కొన్ని మార్పులు జరిగినవి. ఇంకా జరగవలసి ఉన్నవి. కాబట్టి వారి హయాములోనే యీ కార్మికుల పరిస్థితి యింకా అభివృద్ధికి తెస్తారని నా విశ్వాసము. ఇంతవరకు యీ కార్మికులకొరకు తీసుకున్న చర్యలు నేను ఆమోదిస్తూ, [illegible] ను నేను బలపరుస్తూ, విరమిస్తున్నాను.

23rd March 1956]

SRI. P. VENKATASUBBAYYA:—ఉపాధ్యక్షా మహాశయా, మంత్రి గారు తెచ్చిన డిమాండును నేను బలపరుస్తూ కొన్ని సూచనలనుచేయదలచాను. ఏ దేశమునకైనా ముఖ్యాధారముగా ఉండేవి పరిశ్రమలు. అవి చిన్నవి కావచ్చు, పెద్దవి కావచ్చు. వీటిలో వ్యవసాయ పరిశ్రమ ఒకటి ఉన్నది. ఈ పరిశ్రమలు నాలుగింటిమీద ఆధారపడిఉంటవి. అవి ఏమిటంటె, land, labour capital and management అనేవే. మన దేశము ప్రధానముగా వ్యవసాయదేశము. ఈ వ్యవసాయపరిశ్రమ చాల ముఖ్యమైనది. ప్రజలు దీనిమీద నే ఆధారపడి జీవిస్తున్నారు. వ్యవసాయ పరిశ్రమలో కూలీలు ఎక్కువగా పనిచేస్తూ ఉంటారు. ఈ వ్యవసాయ పరిశ్రమకు కూలీలు లభించకపోవడము లేదు. కారణమేమిటంటే భూస్వాములకు, కూలీలకు, మధ్యకూలి విషయములో చాలా ఘర్షణలు జరుగుతూ ఉన్నవి. తరువాతయింకొక్క విషయము ఉన్నది. కొంతమంది పెట్టుబడి పెట్టి పరిశ్రమలు జరుపుతారు. చిన్నపరిశ్రమలైనా పెద్దపరిశ్రమలైనాసరే, పెట్టుబడి పెట్టిన వ్యక్తులు, మేనేజిమెంటుచేసి అధికలాభాలు గడించుకుంటున్నారు. కార్మికులకు మాత్రము ఏదో నూటికి పదివంతులు లాభాలను పంచటము జరుగుతున్నది. లాభములో నూటికి 90 పాళ్లు పెట్టుబడిదార్లే కాజేస్తున్నారు. నూటికి పదివంతులు కార్మికులకు యిచ్చి, 90 వంతులు పెట్టుబడిదార్లు తీసుకుంటే యిందులో వ్యత్యాసము ఎంత ఎక్కువ ఉన్నదో చూడండి. ఇంత పెద్ద వ్యత్యాసము ఉండబట్టే, కార్మికులలో strikes, దెబ్బలాటలు, సంఘర్షణలు జరగడం సంభవిస్తున్నది. వీటిని నివారించటానికి Tribunal అని, arbitration అని ఏర్పాటు చేశారు గాని ఈ విధముగాచేస్తే యీ సమస్యలు తేలికగా పరిష్కరింపబడవు. ఇవి పరిష్కరింపబడాలంటే, దీనికి యిది మార్గముకాదు. ఏ పరిశ్రమలైనాసరే, అవి చిన్నవిగాని, పెద్దవిగాని, అన్ని సహకారపద్ధతిలో జరిపితే కార్మికులకు, వారి వారు చేసేపనులనుబట్టి లాభాలను పంచటానికి అవకాశము ఉంటుంది. కార్మికులు కృషించి పనిచేసినప్పుడు కష్టమంతా కార్మికులది, లాభమంతా పెట్టుబడిదార్లది అయ్యేబదులు, సహకారపద్ధతిమీద అయితే, అందరికి, వారుచేసిన పనులనుబట్టి సమానంగా లాభాలు పంచటానికి అవకాశము ఉంటుంది. కాబట్టి యీ పెట్టుబడి పెట్టేవ్యవహారము తగ్గిపోయేటట్లుచేయాలని అంటున్నాను. ఈ విధంగాచేస్తే, కార్మికులలో strikes ఉండవు, తగాదాలు ఉండవు. అదేవిధముగా వ్యవసాయముచేసే వ్యవసాయ కూలీలు ఎంతోమంది ఉంటున్నారు. ఇందాక నరసింగరావుగారు చెప్పినట్లు కూలీలకు Minimum Wages Act ఒకటి ప్రభుత్వము ఒక ప్రాంతంలో ప్రవేశపెట్టారేగాని, అది అన్నిప్రాంతాలలోనూ వర్తింపచేయ

లేదు. ఎందుకు చేయలేదని ప్రభుత్వాన్ని అడిగితే, దానియొక్క సాధకబాధకాలు ఒక ప్రాంతములో తెలుసుకొని, తక్కిన ప్రాంతములలో అమలుపరుస్తామని అంటున్నారు. ఆ సంగతి పరిశీలించి త్వరలో యీ యాక్టును అన్ని ప్రాంతములలోగూడ వర్తింపజేయమని మంత్రివర్గాన్ని కోరుతున్నాను.

తరువాత contract system ఒకటి అమలులో ఉంటున్నది. ప్రభుత్వం ఏ పెద్దపని తలపెట్టినా, దానిని contract మీద యిస్తారు. ఆ పనికి పెద్ద కంట్రాక్టుదారుడు ఉంటాడు ఆయన లెన క్రింద మేలుదార్లను ఏర్పాటుచేస్తాడు. ఈ మేలుదార్లు కూలీలను పిలుచుకొనివచ్చి పనిచేయించడము జరుగుచున్నది. పని అంతా, అంతే. మట్టిమోయడము దగ్గరనుండి, పనిపూర్తి అయ్యేదాకా కూలీలేచేస్తారు. మేలుదారుడు ఒకపనిగూడ ముట్టుకోడు. పనిఅంతా ఉదయమునుంచి సాయంత్రమువరకుచేసే కూలీకి దినమునకు రూ. 1-0-0, రూ. 1-8-0 కంటె యివ్వరు. ఏ పని చేయకుండా ఉండే మేలుదారుకు దినమునకు రూ. 4-0-0 లు, లేక రూ. 3-8-0 యిస్తాడు. సరే. లాభమంతా కంట్రాక్టరుది. దీనినిబట్టి, పనిఅంతా కూలీలు చేస్తారు. లాభము కంట్రాక్టరు తీసుకుంటాడు. మధ్యఉన్న మేలుదారుకు నాలుగు రూపాయలు ఎందుకు యివ్వాలని అంటున్నారు. తరువాత యింకొక విషయమున్నది. ఈ కూలీలు ఎక్కువమంది K.C. కెనాల్ పని ప్రభుత్వంకంట్రాక్టరుద్వారా చేయిస్తున్నారు. వీరు ఎక్కడినుంచో మూఠాలుగావచ్చి ఎక్కడో ఒక ప్రదేశములో తాటాకులతోనూ చెట్లకొమ్మలతోనూ, పందిళ్లువేసుకుని అక్కడక్కడఉండి పనిచేస్తున్నారు. వారికి భోజనవసతులుగాని, స్నానానికిగాని వసతిలేదు. రాత్రిళ్లు చలిలో ఉంటూ పనిచేస్తున్నారు. తిండి విషయములోగూడ సరియైన వసతిలేకుండా, రెండు మిరపకాయలు, ఒక ఉల్లిగడ్డ, ఏదో ఒక రాయిమీద నూరుకుని, రొట్టెలు వగైరాలు చేసుకుని యీకూలిపని చేస్తున్నారు. నిజంగా విచారిస్తే వారి స్థితిఎంతో దుర్భరముగా ఉంటున్నది. ఆరోగ్యము చెడితే డాక్టరు ఉండడు. చలిజ్వరముగాని, యింకొ యితర అనారోగ్యముగాని, సంభవిస్తే, వాళ్లను విచారించేవారు ఉండరు. పోనీ కంట్రాక్టరుఅయినా వాళ్లకు యీ వసతులు కలుగ జేస్తున్నారాంటే, అదేమిలేదు. ఆఖరుకు వాళ్లు మందులు తెచ్చుకునే ఏర్పాటుకూడలేదు. ఇటువంటి పరిస్థితులలో కూలీలకు ఆరోగ్య సదుపాయములు భోజన వసతి, ఉండటానికి పాకలు వగైరాలు ఏర్పాటుచేస్తే, యీ కూలీలు యింకా ఎక్కువగా పనిచేయగలరు. ముఖ్యంగా యీ Contract సిస్టము రద్దుచేయుమని ప్రభుత్వమును కోరుతున్నాను. మన దేశమునకు కొంత స్థిరమైన Labour force అనేది ఉండాలి. మనము ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అమలు జరుపుకో బోతున్నాము. మనకు ఎన్ని రకాల యంత్రములు

ఉన్నప్పటికినీ, యీ యంత్రాలవల్ల పని చురుకుగా సాగడములేదు. Labour force లేనిదే, యంత్రాలు ఎన్ని ఉన్నను ఉపయోగములేదు. కాబట్టి పర్మనెంటుగా labour force ను ప్రభుత్వము ఏర్పాటు చేయాలి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక జయప్రదము కావాలంటె, ముందు కూలీలకు ఆరోగ్య సదుపాయాలు, గృహ వసతికి పాకలు నీటి సదుపాయములు చేయాల్సి ఉన్నది. ఇవి లేకపోతే, మనము యీ ప్రణాళికను ముందుకు తీసుకొని పోలేము అని నా అభిప్రాయము. రష్యాగాని, చైనాగానీ చూడండి. చైనా దేశములో పెద్ద పెద్ద ప్రాజెక్టులు అన్నీ కూలీలచేతనే తయారుచేయిస్తున్నారు. వారికి కావలసిన సదుపాయాలు చేస్తున్నారు. ఎన్నో విధాలుగా వారికి సౌకర్యాలు కలుగజేయబట్టే, వాళ్లు యీ పని ఎంతో దారుఢ్యముగా చేయగలుగుచున్నారు. ఈ విధముగా చేస్తే, unemployment problem గూడ solve అయిపోతుంది. ఇటువంటి సదుపాయములు చేయడము ప్రభుత్వం ఒక శాసన రూపములో చేస్తే మంచిది. పంచవర్ష ప్రణాళికగూడ సహకార పద్ధతిలో జరిపిస్తే మంచిది. Co-operative Commonwealth ఒకటి స్థాపించాలని మన కాంగ్రెసువారి ఉద్దేశ్యము. అందరూ కలిసి కృషిచేస్తే, Co-operative Commonwealth స్థాపించటానికి వీలుఅవుతుంది. ప్రభుత్వ కార్యక్రమాలు యీ Commonwealth ద్వారా నిర్వహింపబడేటట్లు చూడాలి. ప్రభుత్వము యేపని తలపెట్టినను, అది సహకార పద్ధతిలో జరిపితే, కూలీలకుగూడ లాభాలు పంచి పెట్టటానికి వీలుఅవుతుంది. Strikes అన్నీ సమసిపోతాయి. కార్యక్రమాలుగూడ శాంతియుతముగా జరిగిపోతాయి; గనుక ప్రభుత్వం యీ విషయములో శ్రద్ధ తీసుకుంటారని ఆశిస్తూ నాకు యీ అవకాశము యిచ్చినందులకు అధ్యక్షులవారికి నా కృతజ్ఞతాభివందనములు తెలియజేస్తున్నాను.

Sri K. PUNNAIAH.—ఉపాధ్యక్షా, కార్మిక శాఖా మాత్యులు ప్రతిపాదించిన యీ డిమాండును నేను బలపరుస్తూ, కొన్ని సూచనలు చేయదలచుకున్నాను. Labour సమస్య మన ఆర్థిక సమస్యలలో ప్రధానమైన సమస్యగా పరిగణించవలసి వున్నది. మనము స్థాపించుకొనబోయే Socialistic Pattern of Society యొక్క సమగ్రత శ్రేష్టత, Labour Policy యే ఒక measuring rod అని మనము గుర్తించుకొని అందుకు అనుగుణ్యమైన సంతృప్తికరమైన విధానము అవలంభిస్తే బాగుంటుందని నా అభిప్రాయము. మన రాష్ట్రములో ఇటీవల ఒక సంవత్సరంనుండి కార్మికుల Strikes లేక పోవడం చాల సంతోషకరమైన విషయం. ఈ Strikes లేకుండా జేయడానికి ఒక స్పష్టమైన అభ్యుదయకరమైన విధానము నవలంబించినందుకు, మన కార్మిక శాఖా మాత్యులను నేను అభినందించు

చున్నాను Labour యొక్క అభివృద్ధి వారియొక్క క్షేమము, వారి కిచ్చే వేతనములపై ఆధారపడియున్నదనే విషయాన్ని దృష్టిలో పెట్టుకొని మంత్రిగారు ఈ సమస్యపై శ్రద్ధ తీసుకుంటున్నందుకు సంతోషము. కార్మికులు ఏవేళప్పుడు strikes చేస్తారో అని ప్రభుత్వం భయపడుతూ వారికి వేతనములు ఎంత సేపటికి ఎక్కువచేసే ప్రయత్నములోనే ఉంటున్నదేగాని వారికి కావలసిన ఇతర సదుపాయములు సమకూర్చుటలో ఎట్టి ప్రయత్నము చేస్తున్నట్లు కనపడదు. కార్మికులకు వేతనముల సమస్య తోపాటు, గృహ సమస్య education, health తదితర సౌకర్యముల పట్లగూడ ప్రభుత్వం శ్రద్ధ తీసుకొని ఏర్పాటుచెయ్యాలి. పెద్ద పెద్ద towns లో మాత్రమే కార్మికులకు housing ఏర్పాట్లు జరుగుచున్నవి. యీ ఇండ్ల ఏర్పాటు గ్రామములలో వున్న వారికిగూడ చేయవలసియున్నది. ముఖ్యముగ మన ఆంధ్ర దేశం వ్యవసాయ దేశమని అందరికి తెలుసు. లక్షల కొలది వ్యవసాయ కార్మికులు భూమిపై శ్రమించి జీవించుచున్నారు. కాని వీరు ఉపేక్షించబడుచున్నారు. వారికి కావలసిన సదుపాయములను యింతవరకు ప్రభుత్వము చేయనందుకు విచారపడుతున్నాము. ఇటీవల మన రాష్ట్రములో 14 గ్రామాలలో Minimum Wages Act ను అమలుపరుస్తామని ప్రభుత్వం చెబుతున్నందుకు సంతోషమే గాని, యీ పని అంతా రివిన్యూ యిన్స్పెక్టరుకు అప్పజెప్పబోతామని మంత్రి గారు శెలవిచ్చిన దానిపైని విచారాన్ని తెలియజేస్తున్నాను. ఈఅభిప్రాయముతో మేము ఏకీభవించ లేకపోతున్నాము. Revenue Inspector యొక్క మానసిక తత్త్వము అందరికి తెలిసినదే. వారు వ్యవసాయ కార్మికుల పట్ల ఎంతో నిర్దయగా యుంటారు. యీ ప్రజల పట్లవారికి సానుభూతియే ఉండదు. వారి నియామకమునకు వ్యవసాయ కూలీలుగూడ సమ్మతించరు. Minimum Wages Act ను అమలుపరుస్తామని చెబుతున్నప్పుడు, యీ పని Labour Inspector ద్వారా చేయిస్తే, కార్మికుల ప్రతినిధులు కొంతవరకు ఒప్పుకుంటారుగాని, Revenue Inspector ద్వారా చేయిస్తే ఒప్పుకోరు. Labour వ్యవహారము అంతా Labour Inspector కు సంబంధించి ఉంటుంది. ఈ పని వారి ద్వారా జరిగితే, కొంతవరకు శాంతియుతముగా పని నడుస్తుంది. కాబట్టి ప్రభుత్వము ఆ విధమైన పద్ధతి అవలంబించాలని కోరుతున్నాను.

గ్రామాలలోయున్నటువంటి వ్యవసాయ కార్మికులకు maximum wage-తో పాటు housing facilities కూడా కల్పించాలని కోరుతున్నాను. వారి దుస్థితి మంత్రిగారికి ప్రభుత్వానికికూడా తెలుసును. అట్లాగే పట్టణాలలోయుండే మునిసిపల్ కార్మికులకు industrial labour కిచ్చే housing facilities కల్పించాలి

కోరుతున్నాను. Employment Exchange Offices రాష్ట్రప్రభుత్వం చేపట్టాలని అభిప్రాయపడుతూ ఉన్నందులకు చాలాసంతోషం. శ్రీకాకుళంజిల్లాలోకూడా ఒక Employment Exchange Office పెట్టించాలని కోరుతున్నాను. ఈ exchange offices పెరుగుతూయున్నా, ఉద్యోగాలవిషయం అభివృద్ధి కన్పడుటలేదు. వీరు నిర్వహించే కార్యక్రమాల్లో ఎన్ని అవకతవకలు జరుగుతున్నాయో మనకందరకూ తెలిసిన విషయమే అటువంటి అవకతవకలు ఇకమీదట జరగకుండా చూడాలని మంత్రిగారికి మనవిచేసుకుంటున్నాను ఇటీవల విశాఖపట్టణంలోని నూనికర్మాగారంలో labour recruitment సందర్భంలో మంత్రిగారు జోక్యం కల్పించుకున్నప్పటికీకూడా Employment Exchange యొక్క సహాకారంతో recruitment జరుగకపోవడం చాలా విచారకరం. ఈ విషయంలోకూడా మంత్రిగారు ప్రత్యేకమైన శ్రద్ధతీసుకుని labour recruitment అంతయు Employment exchanges ద్వారా జరిపించి, ఈ అవకతవకలు, corruption ఆపి లేకుండా చేస్తారని ఆశిస్తున్నాను. అల్లాగే contract కూలీల సందర్భంలో కూడాచాలా అన్యాయం జరుగుతోంది. మిత్రులు వెంకటసుబ్బయ్య గారుకూడా ఈ విషయాన్నిగురించి చెప్పారు. వారి అభిప్రాయంతో నేనుకూడా ఏకీభవిస్తున్నాను. రాష్ట్రంలో వున్నటువంటి కర్మాగారాలకు, యితర పరిశ్రమలకు labour recruitment రాష్ట్రప్రభుత్వ ఆధ్వర్యంక్రింద జరిగేటట్లు చూడవలెను.

SRI B. APPA RAO :—ఉపాధ్యక్షా, ఈ Demand తో factory labour ను కూడా కలిపి మంత్రిగారు ప్రవేశపెట్టారు. మనదేశంలో ఇప్పుడున్న labour policy నేడు దేశం పురోగమిస్తూయున్నపద్ధతికి అనుగుణమైనది కాదని నా అభిప్రాయం. మన రాజ్యాంగచట్టాన్ని సవరణచేసి, సామ్యవాద సమన్వితసమాజాన్ని ఏర్పాటుచేసుకోడానికి మనం నిర్ణయంచేసుకున్న తరువాత లోగడ ఉన్న Factories Acts ను చాలావరకూ మనం సవరించుకోవలసి యుంటుంది. లేనియెడల మన ఆర్థికవ్యవస్థను ఆవిధంగా రూపొందించడానికి వీలుండదు. ప్రభుత్వానికి చీటికి మాటికి అడ్డంకులు వస్తూనే వుంటాయి. ఒకవిషయం మనం దృష్టిలోపెట్టుకోవాలి. పాతకాలం, నాటి Trade Union పద్ధతులకు అలవాటుపడిన communistలూ, ప్రజలను పీడించుకొ తింటూన్న పెద్దన్నలైనటువంటి Capitalistలు అనుసరిస్తూయున్న విధానాలలోనే ఈ Act లు రూపొందించబడినాయి. కార్మికరంగంలో పనిచేస్తూ, కార్మిక ఆందోళనను అనుసరిస్తూయున్న కార్మికకర్తలకు ఈవర్గ సామరస్యవిధానం అవలంబించడం కష్టమవుతోంది. కార్మికరంగంలోను, labour union ల లోను,

Sri B. Appa Rao] [23rd March 1956

అనుభవం ఉన్నవాళ్ళకు, ప్రభుత్వసిబ్బంది capitalist లకు agent లుగా ప్రవర్తిస్తూ ఉంటారని తెలుసును. ఒక్కొక్కచోట వాళ్లే indirect గా union లు నడిపిస్తూ దౌర్జన్యపంథావాదులకు దోహదం ఇస్తూ ఉంటారు. అందుకనే Capitalism నకు, Communism సన్నిహితం అనీ, ఉభయులూ అన్నదమ్ములే నని నేను మనవిచేశాను. ప్రజాస్వామ్యానికి యీరెండు సిద్ధాంతములు బద్ధశత్రువులే. మనం నిజమైన ప్రజాస్వామ్యం స్థాపించాలంటే రాష్ట్రప్రభుత్వాలూ కేంద్ర ప్రభుత్వం కూడా ఈ లోప భూయిష్టమైన labour policy ని సామ్యవాద సమాజ స్థాపనకు అనుగుణంగా మార్చవలసిన బాధ్యత వహించాలి. నేను ఎక్కువ details లోకి పోదలచుకోలేదు. మన హక్కులు, బాధ్యతలు మనం గుర్తించవలసి యుంటుంది. ప్రభుత్వమే ప్రజలు. ప్రజలదే ప్రభుత్వం. అలాగనే factory యజమానులూ కార్మికులు. అలాగునే non-factories క్రింద వచ్చేవారు. శ్రమకు తగ్గఫలితం, ఫలితానికి కావలసిన శ్రమ అనే ముఖ్యసూత్రాన్ని మనం పాటించాలి. మనదేశంలో అభివృద్ధి సాధించాలంటే production పెంచుకోవాలి. ప్రజలందరికీ తగిన వసతులు కల్పించాలంటే ఉత్పత్తి అధికంచేయుటకు, శ్రమకుతగ్గ ఫలితాన్ని ఇవ్వాలి. లేనియెడల శ్రమసిద్ధాంతం ప్రకారం, ఫలితానికి కావలసిన శ్రమ కార్మికునివద్దనుంచి రాదు. అప్పుడు production కుంటు పడుతుంది. అభివృద్ధి కాముకులైనవారి సలహాలు పొంది ఈ act లు అమలుపరచడానికి నియమించిన సిబ్బందికి తర్ఫీతు ఇవ్వడంలో ప్రభుత్వం శ్రద్ధతీసుకోవాలి. సిబ్బందికి తగినంత తర్ఫీతు లేకపోతే స్థానికపరిస్థితులకు అనుగుణ్యంగా ఉండలేరు. ఈ Labour Inspectors కు act లు అమలుపరిచే ఇతర ఉద్యోగస్థులకూ తర్ఫీతు తప్పకుండా అవసరం. అటువంటి తర్ఫీతు లేకుండా ఏ మంత్రిగారి recommendation వల్లనో ఇంకెవరైనా పెద్దవారి recommendation వల్లనో ఉద్యోగంఇచ్చి acts ని అమలుపరచమంటే పిసినిగొట్టు తండ్రి సామెతవలె ఉంటుంది. పిసినిగొట్టు తండ్రి కొడుక్కు ఖర్చుకు ఇవ్వకపోతే ఆ కొడుకు దౌర్జన్యంవాదియై తండ్రినే హత్య చేసి ఆ తాళాలు లాగుకొని సర్వం నాశనం చేస్తాడని సామెత. ఈ capitalist లనే తల్లిదండ్రులు అవిధంగా పిసినిగొట్టులై ప్రవర్తించడంవల్ల దౌర్జన్యవాదులైన ఈ Communist సంతానం విప్లవకాలం నాటి రక్తపాతవిధానాన్నే అవలంబిస్తున్నారు. Capitalist లు వారి బాధ్యతను గుర్తించి వారికి వస్తున్న లాభాలలో కార్మికుని శ్రమకు తగినఫలితాన్ని అందజేస్తే కార్మికులు communist లు ఇస్తూఉన్నటువంటి నినాదాలకు మోసపోకుండా శాంతియుతమార్గాలలోనే నడుస్తారని కార్మికుడుగా నేను గడించిన అనుభవంవల్ల, కార్మికరంగంలో నేను

నేర్చుకున్న పాఠాల ననుసరించి విశ్వాసంతో రూఢిగా చెప్పగలుగుతున్నాను. ఎప్పుడైతే ఎవరైనా capitalist కొంత progressive అభిప్రాయాలతో వచ్చిన లాభాలను వివరంగా కార్మికప్రతినిధులముందు వివరించి "ఇదిగో ఇంత లాభం వస్తుంది. దీనిలో ఇంత మొత్తాన్ని factory అభివృద్ధికి వినియోగిద్దాం. ఇంత మొత్తం మా పెట్టుబడికి వడ్డీక్రింద తీసుకుంటాం. ఇంత మీ శ్రమకు ఫలితంగా తీసుకోండి" అని, profit saving bonus విధానాన్ని అనుసరించారో అక్కడ సమ్మెలు లేవు. Factory లు అభివృద్ధి ఐనాయి. Production అభివృద్ధి అయింది. కార్మికులు సుఖంగా ఉన్నారు. అక్కడ అల్లరికి తావులేకుండా పోతుంది.

ఎక్కడ ఈ పేచీలువస్తున్నాయంటే వచ్చినదిఅంతా బొక్కసంలో పెట్టుకోవాలనే పిసినిగొట్టు Capitalists శ్రమకుతగిన ఫలితం ఇవ్వడంలేదని కార్మికులను నడిపే కార్మికనాయకులు దానికి అనుగుణంగా policy ని ఏర్పాటు చేసుకోవలసి వస్తోంది. కమ్యునిస్టు దౌర్జన్యవిధానాన్ని పెంపొందింప చేసేవిధానం కాపిటలిస్టులే అనుసరిస్తున్నారని మనవిచేస్తున్నాను. ప్రజాస్వామిక విధానం నిలవాలంటే బలవాలంటే కమ్యునిజానికి Capitalism కు ఉన్న సన్నిహిత సంబంధాన్ని ప్రభుత్వం అర్థంచేసుకుని ప్రజాస్వామిక సామ్యవాదాన్ని నెలకొల్పాలి అని భారతదేశంలో దృఢనిశ్చయానికి వచ్చినప్పుడు ఉభయులను ప్రధాన శత్రువులుగా గమనించి దానిని సవరించడానికి ఎంతైనా చేయవలసిన బాధ్యత కార్మికరంగంలో ఉన్నదని మనవి చేస్తున్నాను. ఇది దృష్టిలో పెట్టుకుని ప్రభుత్వం వ్యవహారంచేస్తే దేశంలో శాంతి ఉంటుంది. అభ్యుదయం వస్తుంది. ఒక విషయం మనవిచేయదలుచుకున్నాను. Shop Employees Act సవరించాలని కోరుతున్నాను. వెంకటేశ్వర్లుగారు, మిగతావారు మద్రాసులో ఉన్నప్పుడు సంయుక్తరాష్ట్రంలో ఆ Act వచ్చింది కాని దానివల్ల తగినఫలితం లేకుండాపోయింది. మరొక విషయంఉన్నది. చిన్న rice mills లోఉండే చిన్న గుమాస్తాలకు రక్షణలు లేకుండాఉన్నవి. Factories Act సవరిస్తే వారికందరికి రక్షణ కలుగుతుంది. Oil expellers లో పనిచేసే వారున్నారు. వారు ఆ Act లోనికి రాకుండా విస్మరిస్తున్నారు. Labour Inspectors ఈ Act ను సవరించుకుంటే వీరందరికికూడా తగిన రక్షణ కలుగడానికి వీలుఉంటుది కాబట్టి Non factories act సవరించి తగిన విధంగా రక్షణ కలిగేట్లా అవకాశం కలిగించాలని మంత్రిగారికి మనవి చేస్తున్నాను. ఆంధ్రదేశంలో agricultural labour విషయమై మిత్రులు మాట్లాడారు. విస్మరించరాని విషయం అది, Rural housing scheme విషయం ప్రభుత్వం ఆలోచనచేయాలని ఎంత తొందరగాచేస్తే అంతమంచిదని నా విశ్వాసం.

SRI B. V. SUBBA REDDI :—Mr. Deputy Speaker, Sir, the Hon. Minister while moving the Demand has narrated several acts which have been passed in the recent years and which have been mainly designed and intended for the improvement of agricultural labourers and industrial labourers in the State. Sir, I am afraid that though many of these acts have been intended for the benefit of and for providing a number of facilities for the labourers some of these acts are causing more harm than good. Sir, I have got my own misgivings and doubts whether people are able to keep pace with the speed at which the Acts are being passed by the Assembly here as well as by the Central Government. Overnight Government think of passing some Acts and within a very short time a Bill is passed and becomes an Act. Sir, while the old order of things was based on mutual love and willing co-operation and trust between the employer and the employee, a number of these Acts are trying to replace and disturb and upset the old order of things, by trying to place them on a contractual and artificial basis. So far as the Minimum Wages Act is concerned, a number of hon. Members of this House have expressed that this Act should be extended to almost all the villages so far as agricultural labourers are concerned. Sir, I am not very much familiar with nor have I read much about Communism and capitalism. I know only a few of these things from my own experience. For generations the old order of things which existed in the villages was based on love and affection, as I have just now said. The poor agriculturists have been attached to particular families of landlords for so many years that they were considered as belonging to those particular families, if I may say so, and the agricultural labourers in times of distress and need approached the land lords for help, monetary and otherwise, and got them in a liberal measure. If money was advanced, in some cases, promissory notes were taken, and I have not come across cases where such promissory notes were realised by going to a court of

law. I have got in my possession a number of documents in the name of my father, which are still unexecuted through the courts for moneys lent to my tenants in my father's time There are tenants in my family who are cultivating our lands for a long time past almost from father to son, so much so that they are attached to our family. That is the kind of relationship which all along had been existing in the villages. Now, what is it the Government are trying to do ? They are trying to fix the hours of labour It is very good on paper Is it possible for any Government to enforce those Acts in practice. Ours is a hot country Agriculturists go to the fields very early in the morning, say, four o'clock in the morning, and if there is moonlight a little earlier too, and work in the fields till the sun gets high in the sky, say, till seven or even eight o'clock, and return home before it gets hot for the man and the bulls to work in the field. Again in the cooler hours of the evening they go to the fields to work. Now what the Government are doing is to fix the hours of labour. They fix seven or eight hours of labour. The labourer goes to the field at eight o'clock ; and by the time he works for one hour the sun gets hot ; and so is it possible for him to work? So, what I am saying is, it is not always possible, nor is it feasible and practicable to enforce the provisions of the Minimum Wages Act. Government have been very wise in experimenting the Act in a very few places. If it proves successful it will be good for the labourer and the agriculturist, and then it may be extended to a number of other places. But I have got my own fears, and I request Government to be very wary and careful in extending the Minimum Wages Act to a number of villages.

* Sri G. SURYANARAYANA :—ఉపాధ్యక్షా, మన రాష్ట్రంలో వ్యవసాయకూలీలు నూటికి 75 మంది ఉన్నారనే సంగతి మనకందరకు తెలిసిన విషయమే. వారికి ఈనాడు జీవించడానికి వృత్తులు ఉన్నాయాఅంటే లేవు. కారణం ఏమిటంటే ఒక గ్రామంలో కొంతమంది ఉన్నారంటే వారికి వ్యవసాయపనులు కొద్ది

Sri G. Suryanarayana] [23rd March 1956

మందికి దొరుకుతున్నాయి. మిగతా వారికి వ్యవసాయపనులు దొరకక, దొరకని గ్రామం విడచి 8 మైళ్లు 10 మైళ్లు పోవాలి అక్కడయినా వ్యవసాయపనులు దొరుకుతాయా అంటే దొరకవు వ్యవసాయకూలీల జీవితాభివృద్ధి నానాటికి క్షీణిస్తూ వారికి రెండో వృత్తిలేక చాలా ఇబ్బందులు పడుతున్న సంగతి మనకందరకు తెలుసు. ఈనాడు ప్రాజెక్టుల క్రింద వ్యవసాయకూలీలు పనిచేయరు సరిగా రారు. పిలిచినా రారు అంటారు జుగేమోసాలు ఏమిటంటే ప్రభుత్వం కూలీకి రు. 2 లు ఇచ్చినారంటే ఆడకూలీకి 0-8-0 మగకూలీకి రు. 1-0-0 ఇస్తారు. ఆ గ్రామంలోని వారే కాబట్టి అంతకు ఎక్కువ ఎందుకుఅంటారు అంతకు తక్కువ రావాలనే ఆశ, కాదంటే పై గ్రామాలనుంచి కొంతమందిని కూలీలను తీసుకవచ్చి పనులను చేయించడం సహజం. భీమునిపట్నంతాలూకా శింగవరందగ్గర ఒకవంతెన పనికి ఆ ప్రాంతాలలోఉండే వ్యవసాయకూలీలు ఇతర కూలీలను పిలవడంలేదు. 10 మైళ్ల 30 మైళ్ల వరకు దూర గ్రామాలనుంచి కూలీలను తీసుకవచ్చి పనులుచేయిస్తున్నారు. వ్యవసాయకూలీలు జీవనాభివృద్ధి కావాలంటే తాలూకాకు రెండు మూడు కేంద్రాలు పెట్టి, ప్రభుత్వం చేతివృత్తులు కల్పించి వారి జీసనాఅభివృద్ధికి ఏర్పాట్లు ప్రభుత్వం వారు చేస్తారని ఆశిస్తున్నాను.

ఇకపోతే ఈ వ్యవసాయకూలీలలోగూడా కనీసవేతనాలు ఏవో కొన్ని గ్రామాల్లో అమలుచేశామని చెప్పారు. అట్లాకాదు. అలాంటి వ్యవసాయకూలీలు ఒక 14 గ్రామాల్లో సేలేరు. ఈ దేశము మొత్తంమీద 100 కి 75 మంది వ్యవసాయకూలీలున్నారు. కాబట్టి కనీసవేతనాల చట్టమును ప్రభుత్వం త్వరలో అమలు చేసి వారికి కూలీగిట్టుబాటుగా చేస్తారని ప్రభుత్వాన్ని నేను కోరుతున్నాను. ఇక పోతే ఆయాప్రాంతాలలో, మామూలుగా ప్రాజెక్టులే కానివ్వండి మరేవైనా కానివ్వండి, వాటిలో ప్రభుత్వ అధ్వర్యంలో జరుగుతున్న పనులలో ఆయా ప్రాంతాల్లోఉండే వ్యవసాయకూలీలకు పనులు కల్పించడానికి contractors కు సరిఅయిన ఆదేశమిస్తారని నేను ప్రభుత్వాన్నికోరుతూ విరమిస్తున్నాను.

SRI. G. NAGESWARA RAO :—అధ్యక్షా, ఈ లేబరు Demand ను నేను బలపరచలేకపోతున్నాను. ఎందువల్లనంటే ఇప్పుడు వ్యవసాయ కూలీలకు సంబంధించినంతవరకు మంత్రిగారు చెప్పిన వ్యవసాయకూలీల కనీసవేతనాల విషయంలో revenue department కు అప్పచెప్పామని చెప్పారు. అసలు ఈ 14 గ్రామాలలో 1958 వ సంవత్సరంలో ప్రకాశంపంతులుగారి ప్రభుత్వం ఉండగా 1-8-0 రు. నిర్ణయించి అమలుపెట్ట డానికి పూనుకొంది. అయితే ఇంతవరకూ

3 సంవత్సరాలు గడచినాకూడా ఆ పదునాలుగు గ్రామాలలో ఏ విధంగా అమలు పెట్టారు, అమలు పరచడానికి ప్రభుత్వం ఏ విధమైన చర్యలు తీసుకొంది? అనే విషయాన్ని ఇంతవరకు ప్రభుత్వం సభ్యులకు తెలియచేయనేలేదు ఇలా ఎన్నో సారులు ప్రశ్నల రూపకంగా, ఉపన్యాసాల రూపములోకూడా వ్యవసాయ కూలీలను గురించి ఇంత ఆందోళన జరుగుతున్నప్పటికీ 3 సంవత్సరములనుండి దీనిని enquiry చేస్తూన్నామని అమలు జరుపుతున్నామని చెప్పుతూనే ఈ వ్యవసాయ కూలీలగురించి పట్టించుకోకుండా ఊరుకుంది. అయితే ఈ 14 గ్రామాలు ఎటువంటి గ్రామాలంటే, ఎక్కడో వెనుకబడిన జిల్లాల్లో వెనుకబడిన తాలూకాల్లోను మారుమూల లున్నటువంటి గ్రామాలలో వ్యవసాయం అంటే ఏమిటో తెలియని గ్రామాల్లోను, అక్కడ కూలీ చాల తక్కువయిస్తున్నటువంటి కొన్ని మెట్టతాలూకాల్లోను ఈ 14 గ్రామాలను select చేశారు. ఈ selection చేసిన గ్రామాల్లో 1-8-0 రేటు ఏవింధంగా అమలు జరుపుతున్నరో చెప్పాలి నిజంగా చూస్తే గోదావరి జిల్లాలోను, కృష్ణా జిల్లాలోనుఉన్న delta తాలూకాల్లో ప్రభుత్వం వీటిని అమలు జరపడానికి పూనుకొంటే విజయంపొంది రూపాయన్నర రేటును అమలు జరిపిఉండేది. మేముకూడా ఇంతకుముందు అనేక పర్యాయములు చెప్పిఉన్నాము అయితే ఇంతకాలంవరకూ కూడా delta ప్రాంతాలలో గ్రామాలను select చేసి ఆ రేటును అమలుపరచడానికీ, అసలు వ్యవసాయ కూలీల పరిస్థతులను బాగు పరుద్దామనే దృష్టి ప్రభుత్వానికి లేకపోవడం విచారకరం. ఈ 14 గ్రామాల్లో కూడా ఇంతవరకూ ఏమి జరిగిందనే కనీస విషయాన్నికూడా ప్రభుత్వం బయలు పెట్టలేదు. చూస్తే ఈ రోజు మన రాష్ట్రంలో వ్యవసాయంమీద ఆధారపడే జనాభా 100, 80 మందిలో అధిక భాగం అంటే 55, 60 మంది వ్యవసాయ. కూలీలుగా ఉంటూ, కనీసం ఉండటానికి సరియైన ఇల్లు లేకుండావున్నారు సంవత్సరానికి వ్యవసాయపు పనులు 4 మాసములకన్నా ఎక్కువ దొరకని వ్యవసాయ కూలీలు, అదేవిధంగా మెట్టతాలూకాలలో 6 మాసాలు, 7 మాసాలకంటే ఎక్కువ పనిదొరకనటువంటి వ్యవసాయ కూలీల కష్టసుఖాలను గూర్చి ప్రభుత్వం ఏమిచేస్తుందో చెప్పవలెనని అడుగుతున్నాను. అదేకాకుండాను Factory labourను .గురించి ప్రత్యేకంగా Tribunalsను వేస్తున్నారు. అనేక విషయాల్లో సౌకర్యాలున్నాయి. అదేవిధంగా ఇతర లేబరును గురించిమాస్తే ఏదో ఒక Plan గానీ సహాయంగానీ ప్రభుత్వం తీసుకొంటుంది. ఎంతో కొంతడబ్బును కేటాయిస్తూ దానికోసం ఖర్చుపెట్టున్నారు. జనాభాలో ఇంత అధికభాగంగాఉన్న వ్యవసాయకూలీలు కనీసం ఉండడానికి ఇండ్లులేకుండా.

సంవత్సరానికి 4 మాసాలకంటే ఎక్కువపని లేకుండా పస్తులువుంటూ వ్యవసాయానికి వెన్నెముక అయినటువంటి వ్యవసాయకూలీల విషయంలో ప్రభుత్వం ఇంత అశ్రద్ధ చేస్తుందంటే యింతకంటె ఘోరము మరొకటిలేదు. ఇంకా వీళ్ళయొక్క కష్ట సుఖాలనుచూస్తే కొన్ని గ్రామాలలో ఇంకను రోజుకూలీ పావలాయిస్తున్నారు. కొన్నిచోట్ల 0-6-0, కొన్నిచోట్ల 0-12-0, మరికొన్ని గ్రామాలలో 1-8-0 ఇస్తున్నారు తక్కువ ఇచ్చేప్రాంతాలలో వ్యవసాయకూలీలు సంఘం పెట్టుకొని మాకు కొంచె ఎక్కువకూలీకావాలనో అంతకుముందున్న కూలిమీద 1 అణాగాని బేడగాని పావలాగాని అదనంగా ఇవ్వమని, భూస్వామివద్దకు వ్యవసాయకూలీలు రాయబారంవెళ్ళి అడిగినంతమాత్రాన, ఆ సంఘాన్ని విచ్ఛిన్నం చేయుటానికి వ్యవసాయకూలీలను విడదీసిదెబ్బ కొట్టడానికి అనేక ప్రయత్నాల్లో భూస్వాములు కుట్రలు సాగిస్తూన్నారు. కొంతమంది రైతులు, భూస్వాముల వలలో పడుతువ్నారు. భూస్వాములు వ్యవసాయకూలీలకు వ్యతిరేకంగా, గ్రామాలలో హింసాచర్యలను జరిపించడము తప్పుడుకేసులు పెట్టడము జరిపిస్తూవున్నారు. అంతేకాకుండా ఎక్కువ కూలీకావాలనే కోర్కెను అంగీకరించనప్పుడు సమ్మెచేసే పరిస్థితివస్తే ప్రభుత్వం వారు వ్యవసాయకూలీలకు అండగావుండి, రక్షించడానికి పూనుకోకుండా భూస్వాముల అండనేవుండివారిని ప్రోత్సాహించి యీ సమ్మె చేయుచున్న వ్యవసాయకూలీల మీద లాటీచార్జిచేస్తూ తప్పుడు కేసులుపెట్టి ఈ వ్యవసాయకూలీలను బాధపెడుతూ వుంది. ఇంతవరకు మన రాష్ట్రంలో జరుగుతున్నది యిదే. ఇది ఆంధ్రరాష్ట్ర వ్యవసాయకూలీ సఘంచరిత్రలోను జిల్లా వ్యవసాయకూలీ సంఘాచరిత్రలోను చూస్తే ఎన్నో లాటిచార్జిలు-తప్పుడు కేసుల వుదంతాలు కనబడతాయి. వ్యవసాయకూలీలు చెప్పకుండా ఒకరోజు పనిమానినా, చేసినరోజులకు కూలియిమ్మని గట్టిగా అడిగినా, లేక మరో కారణముచూపి, అంతకుముందుచేసిన 20 రోజుల కూలీగానీ, నెలరోజుల కూలీగానీ ఎగవేసే భూస్వాములుకూడా ఈ రోజునవున్నారు. ఇటువంటి బాధలకు వ్యవసాయకూలీలంతా గురిఅగుచున్నారు. అందుచేత ప్రధానంగా ఈ వ్యవసాయ కూలీలు జీవించి పనిచేయుడానికి మాత్రమే యీ 1-8-0 substitute wage అవుతూందిగాని కుటుంబ సౌకర్యాలకన్నింటికి కనీసంగా సరిపోయే కనీసపు కూలి మాత్రముకాదు. కాని ప్రభుత్వం దీనికి కనీసవేతనము అని పేరు పెట్టింది.

అయితే ఆ రోజు మనం కూలీని నిర్ణయించటంలో ప్రభుత్వం ఇంత అశ్రద్ధ చేయడం అంటే ఈ ఎక్కువగా ఉన్నటువంటి జనాభాను వారియొక్క కష్టాలను ప్రభుత్వం గుర్తించడములేదని మనవి చేస్తున్నాను. వాళ్లు నివసించేటటువంటి గృహాలను తీసుకొందాము. వారు నివసించే పేటలలో ఆరోగ్యమైన, శుభ్రమైన ఇండ్లు

లేనేలేవు. ఇపుడు Co-operative Housing అనే పేరుతో అనేక లక్షల రూపాయలను (యిండ్ల నిమిత్తము) ప్రభుత్వం మంజూరు చేస్తుంది. మేము రెండు మూడు సారులు చెప్పాము. వ్యవసాయ కూలీల విషయంలో కనీసం మీరు అయిదు వందల రూపాయల లోపు అప్పులివ్వండి. వారు శుభ్రమైన ఇండ్లను కట్టుకొంటారు. మీరు కొన్ని లక్షలు ఖర్చుపెట్టి ఏదో Co-operative Housing అనో మరొకటో చేస్తున్నారు. అవన్నీకూడా వృధా అవుతున్నాయి. వ్యవసాయ కూలీల విషయంలో కూడా ప్రభుత్వం కనీసం తక్కువ అప్పులు ఇచ్చిప్రోత్సహించినట్లయితే వారు శుభ్రమైన ఇండ్లను కట్టుకొని వాళ్ల మురికి పేటలను బాగుచేసుకోవడానికి అవకాశం ఉంటుంది. ఈ అప్పును వ్యవసాయ కూలీలు 20 సంవత్సరములలో తీర్చుకోడానికి కూడా ప్రభుత్వము అవకాశమివ్వాలి. అందుచేత ప్రభుత్వమే ఈ బాధ్యత తీసుకొని లక్షల కొలది రూపాయలు ఏదో Housing Schemes క్రింద ఖర్చు పెట్టే దానికంటే జనాభాలో అత్యధిక భాగమైన వ్యవసాయ కూలీలకు తక్కువ మొత్తం ఇండ్లు కట్టుకోవడానికి ఇస్తే వారు అలాంటి ఇండ్లలో ఆరోగ్యముతో బ్రతుకడానికి వీలుంటుంది. అందుచేత ఆ వ్యవసాయ కూలీలకు కనీస వేతనాల విషయంలోను, ఇండ్ల విషయంలోను ప్రభుత్వం ఇప్పుడైనా తగినంత శ్రద్ధ తీసుకొనవలెనని మరీ మరీ కోరుతున్నాను.

SRI K. SANTAPPA :—అధ్యక్షా, ప్రభుత్వమువారు పెట్టిన Demandను నేను బలపరుస్తూ ప్రభుత్వదృష్టికి కొన్ని సంగతులు తీసుకురాదలచుకొన్నాను. అనంతపురంజిల్లా, కళ్యాణదుర్గం తాలూకా కంబదూరు అనే గ్రామములో, ముఖ్యమంత్రి గోపాలరెడ్డిగారు యిదివరలో ఆర్థికమంత్రిగా వున్నప్పుడు ప్రభుత్వంవారు 18,500 రూపాయలు ఖర్చుపెట్టి అక్కడ ఒక చర్మాలు ట్యానింగుహాలు కట్టించినారు. మేము ప్రభుత్వముదగ్గర ఎన్నివిధములు మొరపెట్టుకొన్నా దాని సంగతి చెవులో వేసుకొనకుండా ఉన్నారు. అది గుడ్లగూబలు కూర్చునేదానికి కట్టించినారేమో నాకు తెలియదు. 22 తొట్లెలుకట్టి ఒక బావి త్రవ్వించినారు. అక్కడ మా గ్రామములో 250 యిండ్ల హరిజనులున్నారు. అక్కడవాళ్లంతా చర్మకారులు చర్మాలు కరగవేయడానికి అనుకూలముగావున్నది. అది మైసూరు రాష్ట్రమునకు తువలకూరిలజిల్లా పావగొండ తాలూకా సరిహద్దులో మా గ్రామము వున్నది. అక్కడనుంచి కర్రవేసినచర్మాలు బెంగుళూరు, మదరాసు, అటు చిత్రదుర్గము, ఇటు పాకాల, ధర్మవరము రవణాచేయువారికి అనుకూలముగా ఉన్నదని క్షేమము అప్పుడప్పుడు, తలంచుకొనుచున్నాము. దీనిసంగతి యిప్పుడైనా ప్రభుత్వము

వారు నేను చెప్పినదానిని రవంత శ్రద్ధతీసికొని అనుకూలము చేస్తే బీదవాండ్రు బ్రతకడానికి అనుకూలముగా వుంటుందని ప్రార్థిస్తున్నాను. రెండవది, ధర్మవరము అనంతపురముజిల్లాకు నడిబొడ్డున ఉన్నది. అక్కడ జంక్షను 1 రైల్వే, పాకాలకు తిరుపతికి, బళ్లారికి బెంగుళూరుకు గుంతకల్లుకుపోతుంది. అక్కడ Cottage industries పెడితే చేతిపనులు చేసేదానికి అక్కడ 300 లేక 400 ఇండ్లు హరిజనులున్నారు. ఈత, తాటిగంపలు, విసనకర్రలు చాపలు బుట్టలు తయారుచేసి పంపడానికి అనుకూలంగా వుంటుంది. ఈ విషయముకూడా ఎన్నోతూర్లు మొరపెట్టుకొన్నాను ఇది ప్రభుత్వమువారు గమనించి చూడవలయును. చెప్పుకో నేదే మావంతు చేయుటకు ఉత్తరవు ఇచ్చేది మీవంతు, ఎంతచెప్పుకొంటే ఏమిలాభము ఉమ్మడి రాష్ట్రము వున్నప్పటినుంచి చర్మాల విషయమును గురించి 18,500 రూపాయలు ఖర్చుపెట్టి కట్టించినారు. ఇది అక్కడకూలీలు జీవనము చేసుకొనుడానికి అనుకూలముగా ఉన్నది. దయచేసి మంత్రిగారు దీనికి సహాయము చేయవలసినదిగా ప్రార్థిస్తూ యింతటితో ముగిస్తున్నాను.

ఇంకొకటి ముఖ్యమైన సంగతి కల్యాణదుర్గము తాలూకా మలయనూరు, కుందుర్పి, నిజవళ్ళి, యరడుకెర, బ్రహ్మసందరము, ములకలేడు, కంబదూరు, రాళ్ల అనంతపురము చెరువులుకు నీళ్లు, వేదావతినదివిగాని లేక తుంగభద్రా హైలెవల్ కాలవ నీళ్లుగాని వచ్చునట్లు ప్రభుత్వమువారు ఆలోచించుతూ, త్వరలో యీ తాలూకాకు, ఎలెక్ట్రిసిటివచ్చునట్లు ఏర్పాటుచేయుదురని ప్రార్థిస్తూ, అధ్యక్షుల వారికి మనవిచేస్తూ ముగిస్తున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, ఈ Demand కోసం కేటాయించిన మొత్తం చిన్నదైనా, కేవలం డబ్బునుబట్టే ప్రాముఖ్యత లేకుండా ఉంటే, Labour కు చాలా ఎక్కువ ప్రాముఖ్యత ఉన్నదనుకుంటాను. ఇందులో ముఖ్యంగా యీ Labour port folio గతంలో కార్మికనాయకులుగా వున్నటువంటి లచ్చన్నగారు తీసుకోవడం చాంతో నరసింగరావుగారు ఆశించినట్లు కార్మికులకు ఏదో ఒరిగిస్తారని ఆశించి సుమారు సంవత్సరం అయినప్పటికీ కూడా పూర్వం ఎక్కడున్నారో అక్కడే ఉండడంవల్ల కార్మికులకు గతంలో ఎంత జరిగిందో అంతకంటె ఎక్కువ చేయలేదనే అభిప్రాయం మాత్రం దృఢపడిపోతున్నది. సంవత్సర సంవత్సరానికీ చూసినట్లయితే

labour సమస్య చాలా తీవ్రంగా ఉన్నదనే విషయం మాత్రం మనం మరచిపోకూడదు. సమ్మె లెన్ని జరిగాయి? వాళ్లలో అసంతృప్తి ఏ మోతాదులో ఉన్నది? పోలీసువాళ్లను ఎన్నితడవలు పంపించాము? అనేదికాదు. ఇంకా ఎక్కువ తడవలు పోలీసువాళ్లను పంపించేటటువంటి పరిస్థితి రాకుండా చేయాల్సిన బాధ్యత మంత్రివర్గంమీద ఉన్నది. అది చేయాలంటే ఉన్నటువంటి పరిస్థితులు సాధ్యమైనంతత్వరలో బాగుచేయడానికి పూనుకోవలసిన అవసరం కూడా ఉన్నది. ఈనాడు చేయవలసినది మొత్తం మన పరిశ్రమలలో 1,70,000 మందికంటె ఎక్కువమంది Labour ను మనం పెట్టలేకపోతున్నాం. అనేకమంది నిరుద్యోగులై పోతున్నారు. Foundry లలో పనిచేసేటటువంటి కార్మికులు పనులులేకుండా ఉన్నారు. అదేవిధంగా బందర్లో Andhra Scientific Company లో పనిచేసేటటువంటివారు అనేకమంది యీనాడు నిరుద్యోగసమస్యతో బాధపడుతున్నారు. మనం పంచవర్ష ప్రణాళిక వేసుకుంటున్నాం. పంచవర్ష ప్రణాళిక వేసుకున్నప్పుడు అంతా చదువుతూంటే పెద్దపెద్దనాయకులు యిచ్చేటటువంటి ఉపన్యాసాలలోనైనా Labour గతి ఏమిటని అగుపడవద్దా? వీళ్ళను కేవలం ఏ రూపంలో ఎంతవరకు తీసుకుంటారని చెప్పారు? ఈ 5 సంవత్సరాలలో వీళ్ళ వేతనాలు యింతవరకు పెంచుతామని చెప్పారా? పన్నులు ఎంతవేస్తాం అని చెప్పారు. లాభాలు ఏవిధంగా తీయబోతున్నారో చెప్పారు. అది ఏవిధంగా control చేయబోతున్నారో కొంతవరకు చెప్పారు. అంతేకాని labour కు జీతాలు యీవిధంగా పెంచుతాం. 5 సంవత్సరాలలో మన ఆదాయం 20% పెరిగినట్లయితే రూపాయికి ఒకవంతు రెండువంతులు 10 వంతులు పెంచుతాం అనేమాట చెప్పారా ఎవరైనా? ఇంతవరకు ఏమీ రాలేదు. సమ్మెలు చేసినట్లయితే నరసింగరావు చేయించినా నేను చేయించినా ఒకవేళ లచ్చన్నగారే చేయించినా దేశద్రోహుల క్రింద చిత్రించడానికి పూనుకుంటారు. ఎందువల్ల? పంచవర్ష ప్రణాళిక వేసుకున్నాం. దేశం ముందుకుపోతున్నది. పంచదార మిల్లులను స్థాపిస్తున్నారు. పనిచేసేటటువంటి sugar మిల్లుల కార్మికుల విషయం పంచవర్ష ప్రణాళికలో ఏవిధంగానూ ఉపయోగపడడంలేదు. కేంద్రప్రభుత్వం దగ్గర నుంచి మన రాష్ట్రప్రభుత్వాలవరకూ కూడా అసలు Labour కు ఏవిధంగా జీతాలు పెంచబోతున్నారు? ఏవిధంగా ఎక్కువసౌకర్యం చేయబోతున్నారు? సంవత్సరానికి 300 యిండ్లు కట్టిస్తాం అంటున్నారు. ఆంధ్రదేశంలో చూసుకుంటే లక్షమంది పైగావున్న కార్మికులే అయితే 300 యిండ్లు 400 యిండ్లు ఏవిధంగా అవుతుంది? అసలు main problem tackle చేయడానికి పూనుకోకుండా Labour కు

capital కు ఉండేటటువంటి relations ఏవిధంగా ఉండాలో మీరు నిర్ణయించకుండా యీ ధరలు పెరుగుతున్నప్పుడు కనీసం వాళ్ళ జీతాలు నిర్ణయించి కష్టపడి పనిచేసినందుకు బ్రతకడానికి అవసరమైనటువంటి జీతాలు నిర్ణయించి ఆ జీతాలు ఖచ్చితంగా అమలుపరచడానికి మీరు పూనుకోకుండా ఏమి చేస్తే ఏమి లాభం అని అడుగుతున్నాను. Minimum Wages Act ను implement చేస్తున్నాం అని చెప్పారు. ఏదో 13 కేంద్రాలలోనో 18 పరిశ్రమలలోనో implement చేస్తున్నారని చెప్పారు. ఏవిధంగా అమలుజరుపబోతున్నారు? Minimum wages అనేది fix చేశారా? అనేక municipal కార్మికులకు minimum wages 15 రూపాయలకు తక్కువ ఉండకూడదని fix చేశారు. ఆనాడు fix చేసినదానికి Composite State లో ఉన్నప్పుడంతా దెబ్బలాడాం? ఈనాడు రు. 30, 32 కంటె ఎక్కువ జీతం రావడంలేదు.

THE HON. Sri A. B. NAGESWARA RAO:—ఆ రోజులలో రు. 15 యిస్తుంటే యిప్పుడు 30 రూపాయలు యిస్తున్నారు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఆ రోజులలో అంటే 1952 సంవత్సరం మంత్రిగారు అప్పుడు డాక్టరుపని చేస్తున్నారు. కాబట్టి అప్పటి ధరలుపెరిగిన ఆ కష్టాలు తెలిసివుండవు, ఈ విధంగా municipal workers కు జీతాలు fix చేశారు. ఈ రోజున fix చేసిన minimum wages కనీసం బ్రతకడానికి వీలయినట్లుగా fix చేశారా? అది ఏవిధంగా అమలుజరుగుతున్నదీ మంత్రిగారి ఉపన్యాసంలో చెప్పలేదు. అమలు జరగడానికి చేసేప్రయత్నాలుగురించి ఆ రిపోర్టులో లేదు. ఒకవేళ:అమలు జరుపకపోతే prosecute చేయడానికి Government లో ఏమయినా శాసనం ఉన్నదా? అధికారం వున్నదా? అమ్మో అంతపని capitalists మీదనే! లచ్చన్నగారు రెండు నిముషాలమీద యీ మంత్రిపదవికే రాజీనామాయిచ్చిపోవలసినదేగాని prosecute చేయడానికి అవకాశం లేదు. అందువల్ల ఈవిషయాన్ని యీ రోజున ప్రభుత్వదృష్టికి ప్రత్యేకంగా తీసుకువస్తున్నాను.మనకున్నటువంటి యీ setupలో యిప్పుడున్నటువంటిచట్టాలలో labourకు అన్యాయం జరిగకుండా పరిష్కారం చేయడానికి మీ చేతులలో అధికారం లేదు. కావలిస్తే adjudication awards తీసుకోండి. Adjudication awards ను minimum wages ను implement చేయడానికి మీకు యీ రోజున అధికారం లేదు. కొన్ని కేసులు Supreme Court దాకా పోయి కొన్నిసంవత్సరాల తరబడి అట్లానే ఉంటున్నాయి. అందువల్ల యీ విధంగా trade union చట్టాలు గాని

ప్రభుత్వవిధానాలు గాని కార్మికులకు పూర్తిగా ఉపయోగకరంగా ఉండడం లేదనే టటువంటి విషయం స్పష్టంగా బోధపడుతుంది. పంచవర్ష ప్రణాళిక చర్చించ బోతున్నాం. కాని labour గోడుమాత్రం దీంట్లో ఎక్కడా కనపడడం లేదు. నేను అడుగుతున్నాను. ఈరోజునమీరు తప్పకుండా compulsory గా committee లు ఏర్పాటుచేయండి. కనీసంliving wage ఎంత ఉండాలి. లాభాలను అనుసరించి fix చేయండి. ధరలు పెరిగితే దానిప్రకారం అధిక ధరల allowance కలుగజేస్తూ ఒక పద్ధతి అవలంబించాల్సినదే కాని లేకపోతే మనం ఎక్కడుంటామో ఆలోచించమని మంత్రిగారికి విజ్ఞప్తి చేస్తున్నాను. ఎవరు ఏమనుకున్నా సరే opposition party తప్పకుండా labour వెనకాలే నిలబడి తీరుతుంది. Labourers యొక్క rights కోసం సంజీవరెడ్డిగారి పోలీసును లెక్క చేయకుండా నిలబడి పోరాడుతాం అనేటటువంటి విషయాన్ని మంత్రివర్గం దృష్టికి తీసుకువస్తున్నాను. అనేక సంవత్సరాలు అనేక petitions యిచ్చాము. నేను యిప్పుడు Sugar factories విషయం తీసుకుని చెబుతున్నాను. అక్కడ కార్మికుల జీతాలగురించి యీ labour commission report లో ఉన్నది. గత సంవత్సరం budget సమావేశంలో దీనినిగురించి చెప్పాము. "బాబూ వుయ్యూరు Sugar factory గురించి చెబుతున్నానంటే" మంత్రిగారు పొరబాటుగా అర్థం చేసుకోవచ్చు. నాకు తెలుసును కనుక చెబుతున్నాను. ఆ సంఘానికి నేను President representations పంపించాను. ఆ సమస్య పరిష్కారం కాకుండా ఉన్నది. Adjudication కు పంపించి మిగిలిన sugar factory లలో ఉండేటటువంటి జీతాలయినా యిప్పించాలని అడిగితే అందుకుకూడా నోచుకోలేక పోయారు. ఇంకా అనేక factory లు అల్లాంటివి ఉన్నాయి. Nellore జిల్లాలో ceramic factory ఉన్నది. ఆ ceramic factory కి labour commissioner ఒక recommendation పంపించారు. lay off వాళ్లకు యీయాల్సిందని labour commissioner recommendations పంపిస్తే ప్రభుత్వం యింతవరకు దానిని అమలు పరచడానికి పూనుకోలేదు. అప్పుడే ఒకసంవత్సరం కావస్తున్నది. ఎందువల్ల పూనుకోలేదు. ఎన్నాళ్లు దీనిని pending గా పెడతారు ? మీచేతులలో అధికారం వున్నది. వున్నదని చెబుతున్నారు. ఏది labour commissioner చేస్తే టటువంటి recommendation అయినా సరే వెంటనే అమలు జరుపడానికి మీచేతులలో లేకపోయినట్లయితే ఎక్కడున్నది defect ? ఏ విధంగా దీనిని implement చేయబోతున్నారని నేను మిమ్మల్నడుగుతున్నాను.

Sri Pillalamarri Venkateswarlu] [23rd March 1956

అంతేకాదు. నజీరియా mortor workers disputeకు 1952సంవత్సరంలో adjudication award యిచ్చారు. అది ఇంతవరకు అమలు జరుపలేదు. ఆ award pending గా ఉన్నది. నజీరియా మీద action తీసుకోడానికి యీ Cabinet కు సాధ్యమవుతుందని నేను అనుకోడంలేదు. ఇన్ని సంవత్సరాలు ఎందువల్ల pending గా వున్నది ? కనీసకోర్కెలు, పని లోంచి తీసినవాళ్లను తిరిగి పెట్టుకోమని, ధరల పెరుగుదల ప్రకారం D. A. యీయమని యీ విధంగా అక్కడ కోర్కెలు కోరారు. కొండమీద కోతిని కోరారా ? లేకపోతే చంద్రుని యింద్రుని కోరారా ? మామూలైనటువంటి కోర్కెలు లేకుంటే చందాలు పెట్టుకోడానికి అవకాశం లేనటువంటి పరిస్థితులు కలుగజేస్తుంటే నజీరియా లాంటి employeesను మీరు ఏమీ పట్టించుకోకుండా వదిలేస్తున్నారంటే ఏమనుకోవాలో నాకు బోధపడడంలేదు.

పిఠాపురం చక్కెరఫ్యాక్టరీగురించి ప్రత్యేకంగా ఆలోచించమని సత్యనారాయణగారు మంత్రిగారి దృష్టికి తీసుకొనిరావడము జరిగింది. దాదాపు సంవత్సరం నుంచి ఈ matter pending లో ఉన్నది. 30 మంది permanent workers ను తీసివేశారు. వారిని మరల తీసుకుంటామని చెప్పారు. కాని తీసుకోలేదు. దీనికి తోడుగా ఇంకా 20 మందిని తీసివేశారు. adjudication కు refer చేయాలి అన్నారు. చేశారు. దీంట్లో minimum, wages. కరువుభత్యం వగైరాలు కొఱకు పిటీషన్ పెట్టారు. అది pending లో ఉన్నది. ఇప్పటివరకు దాని విషయములో adjudication అనేది ఏమీలేదు. మొత్తంమీద యజమానులు చాలా తక్కువమందిఉన్నారు. అలాంటివారిమీద అన్యాయంగా ఉంటే విషయాలలో adjudication పెట్టి అది న్యాయమా అన్యాయమా అనేదిచూడాలి. దీనికి పోవడానికి ఎందువల్ల అవకాశము ఇవ్వలేదు. అందువల్ల ఆ విషయాన్ని విచారించవల్లయునని ప్రధానంగా వానిని మీ ముందుకు తీసుకువస్తున్నాను.

పందలపాకలో ఈ సమ్మెకు నోటీసు ఇచ్చారు. మంత్రివర్గము ఏమో చేస్తుందని ఆశిస్తున్నారు. పందలపాకలోనే ఉన్న. మిగిలిన textile mills కు, ఈ millకు wagesలో సగానికి సగము వ్యత్యాసము ఉన్నది. ఆ wages ను ఎక్కువ చేయమని, కరువుభత్యము ఎక్కువ చేయమని, వారుకోరుతున్నారు. 1948 సంవత్సరములో 14 రూపాయలు కరువు భత్యము నిర్ణయించారు. మిగిలిన అన్ని చోట్ల రోజుకు రూపాయికి [illegible] అణాలు కరువు భత్యము ఇవ్వవలయునని నిర్ణయిస్తే, ఇక్కడ పెంచవద్దంటూ [illegible] దీని విషయం ఎట్లాగుచేయున్నదో 27 వ పేజీలో

23rd March 1956] [Sri Pillalamarri Venkateswarlu

ఉదాహరణలు ఉన్నాయి. East Godavari లో ఉన్న wages కు, గుంటూరు ఇంకా మిగిలిన చోట్ల ఉన్న wages కు ఎంత వ్యత్యాసము ఉన్నదో ఒక పర్యాయము చూడమని కోరుతున్నాను. తూర్పు గోదావరి జిల్లా పిఠాపురంలోను 1-0-6 ఉంటే, గుంటూరులోరు, 1-14-0 మొదలు రు. 2-10-0 వరకు యున్నది. ఈ wages ను ఎందువల్ల మార్చడములేదు? ఆ మానేజిమెంట్లకు లాభము వస్తున్నదా, నష్టమువస్తున్నదా అనేదిఆలోచించాలి. మానేజిమెంట్లుచాలాఅసమర్థంగావున్నాయి కార్మికుల జీతాలు ఏమీ చేయకుండా అట్లాగే పెట్టి మాకేమీలేదు, కార్మికులకు ఇట్లాగే దోచుకొని బ్రతుకుతామని చెబుతున్నారు. ఏమి చేయాలంటున్నారు. వాళ్లకు చేతగాకపోతే మీరు తీసుకొని నడపండి. పరిశ్రమలు మనకు చాలా తక్కువగా ఉన్నాయి. కాబట్టి వాటిని మూసివేయమని చెప్పడములేదు. కార్మికులను పీల్చి పిప్పిచేస్తాము అంటే, దీనిని అంగీకరించుటానికి మేము సిద్ధంగా లేము. ఆ పరిశ్రమలను మీరు స్వాధీనంచేసుకొని నడిపించాలి. వెంకటరావుగారు industries ను develop చేస్తున్నాము, రండి, రండి, అని ఆహ్వానిస్తున్నారు. వాటిని సక్రమంగా నడపవలసిన అవసరము ఉన్నది.

ఈ adjudication awards విషయములో ఒక ప్లాను ఉన్నది. మనము దానిని ఖచ్చితంగా అమలుజరుపడానికి వీలులేదు. అంతేకాదు. సమ్మె నోటీసు ఇస్తేనేగాని ట్రిబ్యునలుకు పంపించరు. Adjudication కు పంపించరు, సమ్మె నోటీసు ఉంటేనే dispute ఉన్నట్లు గుర్తిస్తారు. ప్రతి రోజూ సమ్మె చేయాలని ఎవరూకూడా కోరరు. ఆ సమ్మెలు తేలిగ్గా పరిష్కారము అయితే అందరూకూడా సంతోషిస్తారు. మీరు పరిష్కారముచేయరు. మీచేత నిర్బంధంగా పరిష్కారము చేయించటానికి అయినాసరే సమ్మెనోటీసు ఇస్తేనేగాని అది ట్రిబ్యునలుకుపోదు. దానిని సవరణ చేయమని అనేక labour unions కోరుతున్నాయి. Public Utility Service క్రింద ఉంటే electricity పరిశ్రమలలో గాని, సిమెంటు పరిశ్రమలలోగాని అన్నిచోట్లకూడా సమ్మె నోటీసు ఇవ్వవలసిన అవసరము ఉన్నది. సమ్మెనోటీసు ఇచ్చి రోజూ, రోజూ బెదిరిస్తున్నారని ఒక ప్రక్క అంటున్నారు. మీ Act లో defect ఉన్నదని మేము point out చేస్తున్నాము. అది rectify చేయాల్సిన అవసరం ఉన్నదని మీ దృష్టికి తీసుకొని వస్తున్నాను.

అదేవిధముగా ధవళేశ్వరములో P.W.D. Workshop ఉన్నది. అక్కడ ఉన్నటువంటి అధికారులతోనూ, ఇంజనీర్లుతోనూ labourers ఒక agreement కు వచ్చారు. ఆ agreement ను అమలుజరుపరు. జరుపమని కోరటానికి

Sri Pillalamarri Venkateswarlu] [23rd March 1956

నిర్బంధించడానికి వాళ్లకు అక్కడ అవకాశములేదు. సమ్మె నోటీసులు ఉండ నక్కరలేదు, పని గారంటీగా చేస్తాము అని, ప్రమోషనులు ఇస్తామని ఏవో వాగ్దానాలు చేసి, ఆ వాగ్దానాలను అమలుజరపక పోవడమువల్ల ధవళేశ్వరము లాంటి చోట కూడా ఈవిధంగా ఉన్నది. Ideal employers గా ఉండాలన్నారు. ఉన్నదా అని అడుగుతున్నాను. ఈ రోజున ప్రభుత్వం ideal employer గా ఉండాలి. Electricity power company తీసుకుంటే, అక్కడ ఎన్నో increments ఉన్నాయి. ఆ increments అన్నీ ఇస్తాము అని చెప్పారు. ఇంతవరకు అవి implement కాలేదు. Orders జారీ చేస్తారు. కొన్ని కొన్ని ఫ్యాక్టరీలలో ఇస్తున్న సౌకర్యములను ఇవ్వడానికి గవర్నమెంటు నిరాకరిస్తున్నది. ఇవన్నీ మనం చూచుకుంటే administration లో పెద్ద defect ఉన్నదని మనకు బోధపడుతున్నది

ఈ రోజున Employees State Insurance Act అనేది ఒకటి ఉన్నది. దీనిని తప్పకుండా మనం అందరము ఆహ్వానించాలి. దీనిని అన్ని కేంద్రములలో చక్కగా అమలు జరపాలని మనము కోరుతున్నాము. ఈనాడు విశాఖపట్టణము షిప్పుయార్డ్ విషయములో ఒక చిన్న పేచీ వచ్చింది. ఈనాడు ఈ State Insurance Act ప్రకారము, అక్కడ ఉంటే వారు ఇప్పటికి ఎక్కువ సౌకర్యములు అనుభవిస్తున్నా, ఎక్కువగా డబ్బు చెల్లించాల్సిన అవసరం వాళ్ళకూడా లేదు. ఇప్పుడు labours జీతాలను బట్టి రూపాయికి 2 అణాలు State fix చేశారు. దానిని ఇప్పుడు నిర్బంధముగా చేస్తున్నారు. ఇది working లోకి వచ్చినప్పటికి చాలా defect లు వస్తున్నాయి. దీనిని point out చేస్తున్నాము. అన్ని చోట్ల కూడా ఈ ఇన్సూరెన్సు స్కీము లేకుండా ఉన్న రోజులలో కార్మికులకు ఎక్కువ సౌకర్యములు ఉన్నాయి. దానికోసము వాళ్లు ప్రత్యేకంగా డబ్బు చెల్లించుకోవలసిన అవసరములేదు, అలాంటిచోట ఈరోజున వాళ్లు ప్రత్యేకంగా డబ్బు చెల్లించుకొని, ఇంకా తక్కువ సౌకర్యములు పొందాల్సిన స్థితి వచ్చింది. దీనిని దృష్టిలో పెట్టుకొని, వారు ఆ విధంగా చేయకూడదా అనవలసిన అవసరము వున్నది. దీంట్లో ఇంకా లోపములు ఉన్నాయి. దీనిని ముఖ్యముగా బెజవాడలో అమలుజరుపుతున్నారు. సిమెంటు కంపెనీదగ్గర ఒక dispensary ని పెడుతారు. అది మామూలుగా గవర్నమెంటు ఆస్పత్రులు పనిచేసే time లో మాదిరిగానే పనిచేస్తుంది. దానిని కార్మికులు ఏవిధముగా [illegible] ఉన్నారు. అక్కడ కాకుండా బెజవాడలోని [illegible] dispensary ని తెరిచేమార్గము ఆలోచించవలసిన

అవసరము ఉన్నది. అది ఇంతవరకు చేయలేదు. చూస్తాము అని చెబుతున్నారు. అందువల్ల ఈ state insurance act, ఇంకా చక్కగా అమలుజరిగేట్లుగా చూడవలసిన అవసరము ఉన్నది. దీంట్లో production committee లు, work committee లు అన్నీ పెడుతున్నారు. ఈ production committee సంతృప్తికరంగా పనిచేయడములేదని, గవర్నమెంటువారు ప్రకటించిన రిపోర్టు లోనే వున్నది. ఈరోజున కలచలుపెట్టారు. వాటిని ప్రోత్సాహపరచి ఇంకా చక్కగా పనిచేయడానికి కార్మికులకు, పెట్టుబడిదారుల మధ్యఉండే సంబంధాలు పెంపొందడానికి లేబరులు నష్టపడకుండా కాపాడడానికి ఏమైనా మార్గాలు ప్రభుత్వము ఆలోచించాలి. మంత్రిగారి statement లోగాని, వారుచేసిన ఉపన్యాసములోగాని ఇది ఎక్కడా కన్పించడం లేదు. అసలు మంత్రిగారి tour programmes కు నెలకు 30 రోజులుకూడా చాలడములేదు. అనేకచోట్లకు పోతూ ఉంటారు. ఎన్ని ఫ్యాక్టరీలవద్దకుపోయి వారి కష్టాలు తెలుసుకోవడానికి ప్రయత్నము చేశారు. ఉయ్యూరు ఫ్యాక్టరీలో చాలా విపరీత పరిస్థితులు ఏర్పడ్డాయి. వాటిని నివారించడానికి ఏమైనా ప్రయత్నముచేశారా? వెంటనే యజమానులను పిలచి కార్మికుల జీతములు ఇంత అవస్థలో వున్నాయి హెచ్చుచేస్తే బాగుంటుంది. అని వారితో చెప్పి, ప్రయత్నం చేస్తే బాగుంటుంది.

అది ఏవిధంగానూ జరగడంలేదు. ఈనాడు triparty committee ఉంది. దానిప్రకారం ఈ motor transport విషయంలో ఒక report వచ్చినది. గవర్నమెంటు publish చేసినప్రకారం చూసినట్లయితే అనేక recommendations Implement చేస్తున్నాము. Government agrees with the recommendation, the labour commissioner suggested that and we have agreed with that." అని ఉందికాని, ఇంతవరకు implement కాలేదు. ముఖ్యంగా బస్సు, లారీల drivers యొక్క పరిస్థితులు ఈనాడు చాలా అధ్వాన్నంగా ఉన్నాయని మనకందరకు తెలుసు.

దాంట్లో వారమునకు 48 గంటలు, రోజునకు 9 గంటలుకన్నా ఎక్కువ పని వుండకూడదని సూచించారు. దానితో ప్రభుత్వం అంగీకరించినది. కాని ఇప్పటికి ఇంకా అమలు జరుగుటలేదు. అమలు చేయడానికి ప్రయత్నంచేయడంలేదు. ఎందువలన అమలుజరుపుటకు ప్రయత్నంచేయడం లేదు? labour minister గారికి electricity department వున్నది. మిగిలినవన్నీ చిన్నచిన్నవే అనుకొంటాను, కష్టపడి పనిచేసేటటువంటివారి విషయంలో ఇప్పటికైనా సరే ఎందువల్ల అమల్లో

జరపడంలేదో నాకు బోధపడ్డంలేదు. Report లో ఉన్నటువంటి main recommendations ను implement చేయడానికి పూనుకోవాలని నేను కోరుతున్నాను. తరువాత workmen compensation act ఉంది. Act అమలులో వున్నదని, ఏదో ఇన్ని కేసులలో ఇచ్చామని చెబుతున్నారు. కార్మికులు బీదవారుగా వుండుటవలన వారి claims ను వారు కాపాడుకోలేకపోతున్నారు. Courts కు వెళ్లాలి. దానికి 2 సంవత్సరములు పడుతుంది. వస్తుందో, రాదో చెప్పలేము. వచ్చేటటువంటి కొద్దిమొత్తంకూడా వానికి రాకుండాపోతుంది. ప్రభుత్వంవారు దానిని గురించి ఏమి చేయబోతున్నారు. Labour commissioner దగ్గర file తీసుకోవాలి. దానికి ఏదో stamp ఉంటుంది. వీటన్నింటికీ ఈ పేదకార్మికులదగ్గర డబ్బు ఎట్లా వస్తుంది. ప్లీడరులను ఎల్లా పెట్టుకోగలుగుతారు? ఏచేయో కాలో విరిగి ఇన్ని అవస్థలకు గురిఅయ్యేవారికి ఖచ్చితంగా వచ్చేటటువంటి పద్ధతి ఏమీ లేకుండా ఏ labour commissioner దగ్గరనో claim చేయమంటారు. Claim చేస్తాడు. Claim చేసినంతమాత్రాన interim payment వస్తుందా? అదికూడా రాదు. యజమాని ఉన్నట్లయితే దానిని కొన్ని సంవత్సరాలవరకు, కొన్ని నెలలవరకూ పొడిగించుటకు అవకాశం ఉంది. వీటన్నింటిని దృష్టిలో పెట్టుకొనవలసియున్నదని మనవిచేస్తున్నాను. కార్మికుల పరిస్థితులు, అనుభవాలు మనమంతా చూస్తున్నాము. ఆ డిపార్టుమెంటుకు మంత్రిగా ఉన్నవారికి దానియొక్క అనుభవములను పురస్కరించుకొని దాంట్లో ఉన్నటువంటి defects ను rectify చేయవలసిన బాధ్యత ఉన్నదా? లేదా? అని అడుగుతున్నాను. వాటి నన్నింటిని పరిశీలించవలసిన అవసరమున్నదని మంత్రిగారిదృష్టికి తీసుకొనివస్తున్నాను.

Mining విషయం చాలా ముఖ్యమైనటువంటిది. ఈనాడు ముఖ్యంగా నెల్లూరుజిల్లాలోను, కృష్ణాజిల్లాలోని అనేకచోట్ల mines ఉన్నాయని తెలుస్తున్నది. వాటిని పరిశోధనచేసి ఎక్కువచేయడానికి పూనుకోవలసియున్నది. వారి పరిస్థితులను గమనించి తగినవిధంగా సహాయంచేయుటకు పూనుకోవాలి.

గూడూరులోని మైకా కార్మికులకు minimum wages act apply అవుతుంది. ఆ Act apply అవుతున్నదిగాని దానిని implement చేయడం జరగలేదు. వారికి మామూలుగా ఉండే హక్కులు లేవు. దానిని implement చేసినట్లు కనబడుటలేదు. వెంటనే implement చేయాలని కోరుతున్నాను. కాకిరాయికి సంబంధించినవి మేము ఇంచుమించుగా ప్రతిరోజూ చూస్తున్నాము. వారు ఎండలో అయినాసరే, వానలో అయినాసరే రెండు తాటాకులు వేసుకున్న గుడిసెలో

ఉండవలసినదిగాని వారిక్కడ నివసించుటకు తగిన పరిస్థితులు లేవు. ఇట్లా 2, 3 సంవత్సరములనుంచి సాగుతున్నది. ఇంకా ఎక్కువగా సాగాలని మేము కోరుకొంటున్నాము. అది పోవాలని ఎవ్వరూకూడ కోరడంలేదు. కార్మికులపరిస్థితులను గమనించి వారికి సరియైన రక్షణ లివ్వవలసిన బాధ్యత మనపై ఉన్నదని మంత్రివర్గము వారు గుర్తించి వారిని అభివృద్ధిచేయుటకు పూనుకోవాలని కోరుతున్నాను. ఇప్పుడు ఇది ఏవిధంగానూకూడ అమలులోలేదు. ప్రభుత్వం ఇచ్చినటువంటి report ను చూసుకొన్నట్లయితే మనకు ఏమాత్రమూ సంతృప్తి కలుగుటలేదు. ఇప్పుడు Labour welfare officers ను appoint చేస్తున్నారు. వారిని ప్రభుత్వంవారు appoint చేస్తున్నారా లేక factory యజమాని appoint చేస్తున్నాడా? Factory యజమానే appoint చేస్తున్నాడు. Labour యొక్క క్షేమాభివృద్ధి దృష్ట్యా factory యజమాని ఒక ఉద్యోగస్తుని appoint చేస్తున్నాడు. అతను labour యొక్క క్షేమంకొరకు చేస్తున్నాడో లేక capital యొక్క క్షేమాన్ని దృష్టిలోపెట్టుకొని చేస్తున్నాడో తెలియదు. ఇప్పుడు Labour Welfare Officer ఉన్నచోట్ల labour కు చాలా నష్టం కలుగజేస్తున్నాడు. ఆయన labour కు ఏమాత్రమూకూడ ఉపయోగపడుటలేదు.

కాంగ్రెసుపార్టీలకు ఉన్నటువంటి యూనియనులు, ఇతరపార్టీల నాయకత్వంక్రింద ఉన్నట్టి యూనియనులు, కమ్యూనిస్టుపార్టీక్రింద ఉన్నటువంటి యూనియన్‌లు కూడా suggest చేస్తున్నాయి. Labour Welfare Officer ను oppoint చేసి పెట్టుబడి ఖర్చులదగ్గరనుండి డబ్బు వసూలుచేసి Government appoint చేసినట్టిదానికి ఒక independent status కలుగజేయండి. లేనిచో ఆ పదవి శుష్కదండుగ అవుతుంది. దానిని రద్దుచేస్తే బాగుంటుందని నేను అభిప్రాయపడుతున్నాను. మొన్న బెజవాడలోని సిమ్మెంటు ఫ్యాక్టరీదగ్గరకుపోయి చూశాము. అక్కడ ఏదో delegation వస్తే దానికోసం ప్రత్యేకంగా పెట్టారుగాని ఇది ఏ విధంగాకూడ ఉపయోగపడటంలేదు. C. I. D. వారిద్వారాగాని, పార్టీ సభ్యులద్వారాగాని ఇవి ఏవిధంగా అమలుజరుగుతున్నాయో తెలుసుకోవలసియున్నది. క్రీచస్‌గాని మరి మరి ఏయే ఇతర సౌకర్యములు ప్రభుత్వంవారు చేసినామని చెబుతున్నారో అవి ఏవైనాసరే, ఎక్కడయినా ఖచ్చితంగా అమలు జరుగుతున్నాయేమో ప్రభుత్వంవారు విచారణ చేయాలని విజ్ఞప్తిచేస్తున్నాను. అందువల్ల ఇవన్నీ Act లో Provide చేసినాము. కాగితాలలో అచ్చువేసి పెట్టినాము. అవన్నీ అమలు జరుగుతున్నాయని అనుకుంటే ప్రభుత్వం తనకుతానే మోసంచేసుకొంటున్నదని విజ్ఞప్తిచేస్తున్నాను. ఇవి ఏవిధంగానూకూడ అమలు జరగడంలేదు.

Sri Pillalamarri Venkateswarlu] [23rd March 1956

Minimum wages act 14 గ్రామాలలో అమలు జరుపుతున్నామని మంత్రి గారు అన్నారు. ఆంధ్రదేశంలో ఎన్నివేల గ్రామాలున్నాయి. 14 గ్రామాలలో మాత్రమే ఎందుకు అమలు జరుపుతున్నారు. ఈ 14 గ్రామాలలోను ఖచ్చితంగా అమలు జరుగుతున్నదా అంటేలేదు. ఇది సక్రమంగా అమలు జరుగుటలేదని గ్రామములలోని వారందరికీ తెలుసు. ఎందువల్ల అమలు జరగడంలేదు ? అమలు చేయుటకు ప్రభుత్వం ఏ విధంగా ప్రయత్నిస్తున్నది ? Minimum wages act ఒకటి పెట్టినారు. ఊరికే Statement, చట్టము పెట్టినంతమాత్రాన సరిపోదు. దాని అమలుజరిపే మార్గంకూడ ప్రభుత్వమే చూపించాలి. దానిని Revenue department లో కలుపుతామన్నారు. Revenue Inspectors కు ఇస్తే ఎట్లా అమలుజరుగుతాయి ? అని ఎవరో ప్రశ్నకూడా వేసినారు. ఇది Experiment కాదుకదా ? జపాను వరిసాగుపద్ధతివలె Experiment చేసి చూడనక్కరలేదు, అటువంటప్పుడు 14 గ్రామాలలోనే ఎందుకు పెట్టినారు ? ఆంధ్రదేశంలోని అన్ని గ్రామాలలోను పెట్టుటకు ఎందుకు పూనుకొనుట లేదు ? Minimum wages act 1949 సం॥లో Pass అయితే దానిని ఇప్పటికి 14 గ్రామాలలోనే ఎందుకు అమలుపరిచారు ? దీనినిబట్టి ప్రభుత్వానికి వ్యవసాయకూలీలమీద ఎంతప్రేమ, అభిమానం ఉన్నదో తెలుస్తున్నది. కళావెంకట్రావుగారికి మంచి అభిప్రాయమే ఉన్నట్లయితే మిగిలిన అన్నిగ్రామములలోను అమలుచేయుటకు ఎందుకు పూనుకొనుటలేదు ? దీనిని Revenue department కి అప్ప చెపుతామంటున్నారు. అట్లు చేసినప్పటికీకూడ ఇది బాగుపడుతుందనే నమ్మకం నాకులేదు. మనం 14 గ్రామాలలో అమలుపరిచాము. ఇది ఒకపెద్ద ఘనకార్యమని గొప్ప చెప్పకోకూడదు. గానిని దేశమంతా అమలుజరుపుటకు ఏమైనా Defficulties ఉన్నట్లయితే కూర్చొని ఆలోచించండి. అమలుచేయుటకు పూనుకోండి. అసలు ఏమీ ప్రయత్నంచేయకుండా దీనివల్ల ఎవరిని సంతోషపెడదామని ? దీనివల్ల Labour administration అంత Satisfactory గా లేదని తెలుస్తున్నది.

THE HON. SRI G. LATCHANNA :—అధ్యక్షా ! గౌరవనీయసభ్యు అందరూ చేసినటువంటి సూచనలుకు, విమర్శలకు, ఒకొక్కదానికి సమాధానం చెప్పాలంటే గడువుచాలదు. కాని ప్రధానమైన విషయములను గురించి చెబుతున్నాను. Minimum Wages Act గురించి కొంతమందిసభ్యులు మాట్లాడుతూ అది సక్రమంగా అమలుజరుగుటలేదని, దానిని అమలుచేయుటలో ప్రభుత్వం అవలంభించే విధానం సంతృప్తికరంగాలేదని విమర్శించారు. ఈ Minimum

Wages Act 14 గ్రామములలో అమలుజరుగుచున్నది. మిగిలిన అన్ని గ్రామములలోను దీనిని వెంటనే అమలుచేయడం చాలా క్లిష్టమైన సమస్యఅనే విషయం పిల్లలమర్రి వెంకటేశ్వరులుగారికికూడా తెలుసును. వారు ప్రతిపక్షంలో ఉన్నారు, కాబట్టి బాగా ఉన్నదని చెప్పినట్లయితే వారి ప్రతిపక్షం పోతుందని వారిభయం. వ్యవసాయదారుల ఆదాయమునకు, వ్యవసాయ కూలీల కనీస వేతనాలకు సంబంధించిన సమస్య ఒకటి ఉన్నది. బస్తీలలోఉండే కార్మికులయొక్క ఇబ్బందులను పరిశీలించి తొలగించుటకు, వారికి ఉన్నటువంటి రక్షణలు, హక్కులు కాపాడుటకు తగిన సిబ్బందిఉన్నది. కాని వ్యవసాయ కార్మికులయొక్క పరిస్థితులను పరిశీలించుటకు Labour Department చాలదు. అందుచేత దీనికి Revenue Department యొక్క సలహా కోరవలసిఉంటుంది. ఈ 14 గ్రామాలలోను అది సక్రమంగా అమలు జరిగినదనిస్థిరపడిన తరువాత రాష్ట్రవ్యాప్తంగా విస్తరణచేయుటకు ఉద్దేశించి ఈ 14 గ్రామాలలోనే అమలు జరపడమైనది. ఈ 14 గ్రామములు ఆర్థికంగా వెనుకబడి ఉన్నాయి. "వెనుకబడి చాలా హీనస్థితిలోఉన్న గ్రామాలలోనే దీనిని అమలు జరుపవలసిన అవుసరం ఎందుకు కల్గింది ?" అని మన మిత్రులు ప్రశ్నించారు. తక్కువ ఆదాయంవచ్చే ప్రాంతాలలో ఈ కనీసవేతనములు అనేదానిని నిర్ణయించి అది సక్రమంగా అమలు జరిగినప్పుడే ఇతర అన్నిచోట్లా అమలు జరుపుకోడానికి అవకాశం ఉంటుంది. Experiment చేయకుండా అన్ని గ్రామములలోను అమలుపరచినట్లయితే అది తొందరతో చేసిన పనిఅవుతుంది. ఈ 14 గ్రామములలోను అమలుపరచి 2 సంవత్సరములవుతున్నది ఇంతవరకు వీటినిగురించి సరియైన అజమాయిషీ జరుగుటలేదని ఒకప్రక్క అంటూ రాష్ట్రవ్యాప్తంగా ఎందుకు అమలు జరపలేదని ప్రశ్నించడం అంత సమయోచితమైన మాటకాదని ఇది ఆచరణయోగ్యమయిన సలహా కాదని గౌరవసభ్యులు గుర్తిస్తారని నేను ఆశిస్తున్నాను. ఇవి ఉపేక్షించాలనే ఉద్దేశ్యం ఎంతమాత్రంకాదు. ఇందులో మనకు ఎన్నో సమస్యలున్నాయని గౌరవశాసన సభ్యులందరికి తెలిసిన విషయమే. Land Reforms Committee అనేది ఏర్పాటు చేయడం ఆ కమిటీవారి రిపోర్టు ప్రభుత్వపరిశీలనలోఉండి త్వరలోనే శాసన సభా చర్చకు రాబోతున్న సంగతికూడా శాసనసభ్యులకు తెలుసు. అందులోకూడా ఇది ఒక ప్రధానసమస్యగా ఉంటుంది. కనీస ఆదాయం రైతుకు నిర్ణయం కానిదే రైతుతో కలిసి పనిచేసే కార్మికుని కనీసవేతనం నిర్ణయించి అమలు చేయడం అనేది కష్టమని గౌరవసభ్యులందరు గుర్తిస్తారని నేను ఆశిస్తున్నాను. ఒక వ్యవసాయదారునికి ఒక వ్యవసాయ కూలీకి ఉన్నసంబంధం, బస్తీలలో పెట్టుబడిదారులకు ఫ్యాక్టరీ

Sri G. Latchanna] [23rd March 1956

లలో పనిచేసే కూలీలకు ఉన్న సంబంధం ధోరణిలో పరిశీలించడం అనేది అభివృద్ధి దాయకమైన పద్ధతి కాదని గౌరవసభ్యులు గమనిస్తారని ఆశిస్తున్నాను. అందుచేత ప్రభుత్వం దానియొక్క delicacy ని అర్థంచేసుకొని, వీలైతే మనకున్న ఆర్థికస్తోమతును బట్టి Labour Department ను అభివృద్ధి పరచాలనే మా యొక్క ఉద్దేశ్యం. మన రాష్ట్రంయొక్క ఆర్థికపరిస్థితికి అడ్డంకుగా ఉన్నందువల్ల Labour Department ను ఈ గ్రామీణ ప్రాంతాలలోఉన్న వ్యవసాయకూలీల కనీసవేతనాలు వారియొక్క సౌకర్యాలు పరిశీలించి, సిబ్బందిని నియమించడానికి ఇబ్బంది కలుతున్నది. అంతకుతప్ప ఉపేక్షించాలనిగాని, ఆలస్యపరచాలని గాని ఎంతమాత్రము లేదని మనవిచేస్తున్నాను. వ్యసాయ కూలీయొక్క గృహవసతి గురించి ఏమిచేస్తున్నాంఅనేది చాలా పెద్ద సమస్య. ఈ సమస్యనుగురించి పంచవర్ష ప్రణాళికలోకూడా ప్రత్యేకంగా శ్రద్ధతీసుకోవడం జరిగింది. Co-operative Department ద్వారాగాని Social Welfare Department ద్వారాగాని గ్రామాలలో ఉన్నటువంటి హరిజనులు తదితర వ్యవసాయ కూలీలందరికీ కూడా Low Income Group Housing Societies ద్వారా housing facilities ఏర్పాటుచేయుటకుగాను కేంద్రప్రభుత్వంతో సంప్రతించి ఒక పథకాన్ని తయారుచేయబోతున్న సంగతి మన గౌరవసభ్యులందరికి తెలుసును. అందువల్ల దీనిని ప్రత్యేకంగా Labour Department లో ఉదహరించే అవకాశంలేదు. కాని Labour Demand లో బస్తీలలో ఉన్న చిన్నచిన్న ఫ్యాక్టరీలలో పనిచేస్తున్నటువంటి కార్మికుల ఇబ్బందులను గమనించి ద్వితీయపంచవర్షప్రణాళికలో సుమారు 42, 43 లక్షలరుపాయలను ప్రభుత్వం బాధ్యత తీసుకుని గృహవసతి ఏర్పాటుచేయుటకుగాను ప్రత్యేక పద్దును ఏర్పాటుచేసి ఉన్నది. చిన్నచిన్న పరిశ్రమదారులయొక్క పరిశ్రమలలో పనిచేస్తున్న కార్మికుల గురించి గ్రామాలలో పనిచేస్తున్నటువంటి వ్యవసాయ కూలీలయొక్క అవసరాలను గురించి సౌకర్యాలనుగురించి అశ్రద్ధచేస్తున్నదనే అభిప్రాయం ఎవరికైనా ఉంటే అది కేవలం అపోహ అని మాత్రం చెప్పకతప్పదు

గ్రామీణాభివృద్ధి లేనిదే భారతదేశం అభివృద్ధికాదని అందరికి తెలుసు. దానిమీదనే ఆధారపడి మనప్రభుత్వం పనిచేస్తున్నది. Awards ఆలస్యం అవుతున్నాయని, Awards యొక్క అమలులో సరైనటువంటి విధానం లేదని మన సభ్యులు చాలమంది విమర్శిస్తున్నారు. 1955 వ సంవత్సరానికి సంబంధించినంతవరకు సంవత్సరం ఆరంభంలో 18 కేసులు మాత్రం pending లో ఉన్నాయి. అందులో ఏడాదిలోపల మన ప్రభుత్వానికి దాఖలు అయిన కేసులు మరో 9. మొత్తం

20 కేసులూ dispose చేయడం అయినది. 1955 వ సంవత్సరానికి సంబంధించి నంతవరకు 2 కేసులు మాత్రమే pending లో ఉన్నాయి. అందుచేత వాడుకరీత్యా ఆలస్యం జరుగుతోందని చెప్పుకోవలసిందేగాని నిజంగా ఆలస్యం జరిగేదానికి అవకాశం లేదు. ప్రభుత్వం ఈ కేసులు dispose చేసేవిషయంలో Labour Department ప్రత్యేకశ్రద్ధ తీసుకోవడమే కాకుండా గత 3 ఏండ్లుగా tribunal గాని వాటియొక్క కార్యక్రమ నివేదికనుగాని, పరిశీలించినట్లయితే Industrial Tribunal cases పరిష్కరించడంలో ఆలస్యం జరుగుతున్నదనేదానికి అవకాశం లేదని మనవిచేస్తున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU:—ఎప్పుడు చేశారు? Industrial disputes లో ఎన్ని disputes వస్తే ఎన్ని refer చేశారు ?

THE HON. SRI G. LATCHANNA:—ఇప్పుడు నేను ఒకవిషయం మనవి చేయవలసి ఉన్నది. Strike notice ఇస్తేనేగాని ఈకేసు Industrial dispute కాదు అనే ఒక పద్ధతి ఉన్నదని అంటున్నారు. అది పొరపాటు. Strike notice ఇస్తేనే dispute క్రింద ప్రభుత్వం గమనిస్తుంది లేకపోతే గమనించదనే అపోహ ఏర్పడిఉన్నది. అందువలన కార్మికులు తమఅవసరాలను ముందుగా యజమానికి తెలియజేసి వాటిని యజమాని అంగీకరించకపోయినట్లయితే department కు తెలియజేసినపుడు department conciliation కు వస్తుంది. Strike notice ఇస్తేనే ప్రభుత్వం జోక్యంకలిగించుకొంటున్నదనే పద్ధతి సరైనదికాదు కార్మిక Union తమ యజమానికి memorandum పంపిస్తే, దానిని వారు నిర్లక్ష్యపరుస్తారనే complaint ను Labour Department కు అందజేసినప్పటినుండి conciliation ప్రారంభమవుతుంది. ఈ Conciliation అనేది. అందరు అంగీకరించిన policy. ప్రతి స్వామ్యవాదిగాని, సామరస్యాన్ని మనసారా కోరే ప్రతివ్యక్తిగాని సాధ్యమైనంతవరకు సమస్యలను పరస్పర సంప్రదింపులద్వారా పరిష్కరించుకోవడం కనీస కర్తవ్యమని ఈనాడు అంతర్జాతీయంగా కూడా ప్రతి ఒక్కరు అంగీకరిస్తున్న సిద్ధాంతమే. దానిని ఉపేక్ష అని, ఆలస్యంజరుగుతోందనిగాని అనడం సరైన పద్ధతి కాదు.

Labour Department తో అవసరంలేకుండా, Conciliation తో అవసరంలేకుండా సాధ్యమైనంతవరకు ప్రయత్నంచేసి తగాదాలను పరిష్కరించుకొన్న కేసులు అనేకం ఉన్నాయి. కార్మికులు వాయిదాలు కోరుకొని, management గడువు కోరుకొన్నవికూడా ఉన్నాయి. సాధ్యమైనంతవరకు

Sri G. Lacthanna] [23rd March 1956

management ను ఒప్పించి అమలుపరచడానికి ప్రయత్నించడము Labour Department యొక్క ప్రధానకర్తవ్యం. ఆ ధోరణిలో conciliaton జరిపించి విఫలమైన తరువాతనే strike చేయాలి.

SRI B. APPA RAO :—Conciliation పద్ధతి కొంచెము జాప్యం అవుతున్నది. యజమానులు, కార్మికుల ప్రతినిధుల సమ్మతిపై arbitrator ను compulsory గా ఎందుకు వేయకూడదు ? దానికి ఎందుకు ప్రయత్నం చేయకూడదు ?

THE HON. SRI G. LATCHANNA :— ఇప్పుడు మనకున్న Industrial Disputes Act ప్రకారం ముందు మనం conciliation నడపాలి. Conciliation పద్ధతిలో ఉభయులు అంగీకరించనపుడు arbitrator ను వేయవచ్చు. Arbitrator ను నిర్బంధంగా నియమించే అవకాశం లేదు. అందువలన conciliation విధానంలోనే నడచుకోడానికి ప్రయత్నం జరుగుతున్నది. ఆ ప్రయత్నం విఫలమైనపుడు Conciliation Officer కు report చేయడం, ఆ రిపోర్టులో ఉన్నటువంటి సమస్యలు దానియొక్క ప్రత్యేకమైన పరిస్థితులు గమనించి adjudication కు refer చేయడం జరుగుతున్నదిగాని, strike notice ఇవ్వగానే ఎందుకు adjudication కు refer చేయకూడదనే వాదన సరైన వాదనకాదని మాత్రం మనవిచేస్తున్నాను.

గౌరవసభ్యులన్నట్లు నేను కార్మికరంగంలో పనిచేసినవాడను. ఇప్పటికీ కూడా నాకు కార్మికరంగంలో అభిరుచిపోలేదు. పోదనే నా విశ్వాసం. ఈ ప్రభుత్వమేకాదు, ఏ ప్రభుత్వముకూడా strike కూడదని శాసించడంలేదు. Strike చేసినవారందరిని దేశద్రోహులుగా చిత్రిస్తున్నారని చెప్పకోవడం చాల పొరపాటు. చీటికి మాటికి strike అని నినాదంచేసినవారు దేశద్రోహానికి దారితీస్తున్నారని చెప్పక తప్పదు. దానికి వెంకటేశ్వర్లుగారుకూడా ఆమోదిస్తారని నా విశ్వాసం. కాదనడానికి ఎవరికి అవకాశంలేదు. Strike ఎప్పుడు చేయాలనేదే ప్రశ్న. అన్ని ప్రయత్నాలుచేసి, అన్ని పద్ధతులద్వారా విఫలమై వేరే గత్యంతరంలేక కార్మికుల జీవితానికి, ప్రమాద పరిస్థితి ఏర్పడినప్పుడు ఆఖరు ఆయుధంగా తప్పనిసరిగా అవలంభించవలసిన విధానం strike. చీటికి మాటికి strike చేస్తే అది కార్మికులను నష్టపరచడానికి ఉపయోగపడుతోందిగాని బాగుపరచడానికి ఉపయోగపడడంలేదు. ఈవిధంగా చీటికి మాటికి strike చేయడమనేది కార్మికులకు వినాశకరమైన పద్ధతే గాని శ్రేయోభిలాషకరమైన పద్ధతికాదని మనవిచేస్తున్నాను. అందువలన strike ని

ఈ ప్రభుత్వము ఎప్పుడూ ఖండించలేదు. సవ్యంగా strike చేసినప్పుడు ప్రభుత్వం దానినిగూర్చి విచారించి న్యాయమైన చర్యలు తీసుకొంటుంది.

అనవసరంగా strike notice లు ఇచ్చినట్లయితే ప్రభుత్వానికి వారిమీద ఉన్నటువంటి సానుభూతినికూడ పోగొట్టుకోడానికి దారి తీస్తుందేగాని అది సరియైనటువంటి పద్ధతికి దారి తీయదని మాత్రము మనవిచేస్తున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—వారి కోర్కెలు తీర్చడానికి, conciliation ద్వారాగాని, మరేవిధంగాగాని పరిష్కరించుటకు ప్రభుత్వము వెంటనే పూనుకొంటుందని ఒక మాటైనా చెప్పుతారా?

THE HON. SRI G. LATCHANNA :—తప్పకుండా, దానికి పూనుకొంటుందా అనే ప్రశ్నకు తావులేదని మనవిచేస్తున్నాను. పూనుకొంటున్నారు, పనిచేస్తున్నారు. దాన్ని ఎవరు కాదనడానికి వీలులేదు. ప్రతిపక్షమువారు దాన్ని కప్పిపుచ్చినా, ప్రపంచం కళ్లు మూయలేరు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Conciliation కు ఎంత time తీసుకొంటారు.

THE HON SRI G. LATCHANNA :—ఉభయ పక్షాలు అవలంబించిన విధానం మీద ఆధారపడియుంటుందిగాని Department లోని విధానంకాదు. వాస్తవానికి ఉభయ పక్షాలుకూడ మాకేదైన గడువుకావాలి, మీరు చెప్పినది ఆలోచిస్తాము అని హృదయ పూర్వకంగా చెప్పుతున్నప్పుడు, మీకు గడువు ఇవ్వడం లేదు, మీరు ఒప్పుకొంటె ఒప్పుకోండి లేకపోతే మీకు శిక్షవేస్తాము అనే ధోరణి conciliation ధోరణికాదు. కాని ఏదో విధంగా తప్పించుకొనే ఉద్దేశంతో వారు కాలాన్ని పొడిగించడానికి వాయిదాలు కోరుతున్నారు అని తోచినప్పుడు, Labour Officer అట్లాంటి గడువులకు అవకాశము ఇవ్వరు. Labour Officer అట్లాంటి చోట్ల తన రిపోర్టును వెంటనే పంపడానికి పూనుకొంటారని మనవిచేస్తున్నాను.

తరువాత K. C. P. Ltd., వుయ్యూరు, గురించి కొన్ని సూచనలు వచ్చాయి. దాన్నిగురించి కొంత భోగొట్టా ఇవ్వవలసియున్నది. ఈ వుయ్యూరు K.C.P. Ltd., గురించి రెండు మెమొరాండములు డిపార్టుమెంటుకు పంపించారు. ఆ రెండిటిపైన Ex-labour officer విచారణ జరిగింది. Labour officer గారు management వారికి కొన్ని సలహాలు ఇవ్వడం జరిగింది. ఆ management

వారి సమాధానము త్వరలోనే రాబోతున్నది. కనుక దానిమీద Labour Officer విచారణ జరుపుతూనే ఉన్నారు

SRI PILLALAMARRI VENKATESWARLU :— ఎన్ని సంవత్సరాలనుంచి జరుపుతున్నారు?

THE HON. SRI G. LATCHANNA :— మొత్తంమీద రెండు యూనియన్లు ఇచ్చిన మెమొరాండములమీదకూడ Labour Officer విచారణ జరిపించారు. విచారణచేసి management కు కొన్ని సూచనలు ఇవ్వడం జరిగింది. Management వారు త్వరలోనే దానిమీద మా అభిప్రాయము తెలియజేస్తామని చెప్పారు. వారి అభిప్రాయము తెలుసుకొన్న తరువాత Labour Officer యొక్క రిపోర్టు Commissioner ద్వారా ప్రభుత్వానికి రావలసియున్నది. కనుక ఇదేమి ఉపేక్షించే టటువంటి స్థితిలోలేదు. ఈ గవర్నమెంటు ఏర్పడిన తరువాత వచ్చినటువంటి memoranda గురించి సభ్యులకు తెలియజేస్తున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అంతకుముందు కూడ కొన్ని memoranda ఇచ్చారు. వాటిమీద ఏమి చర్య తీసుకొన్నారు.

THE HON. SRI G. LATCHANNA :—నేను ఈ గవర్నమెంటులోకి రాకముందు వచ్చిన మెమొరాండముల గతి ఏమి పట్టిందో నాకు తెలియదుగాని, ఇప్పుడు ప్రభుత్వ పక్షములోకి వచ్చినతరువాత, వచ్చినటువంటి మెమొరాండములను విచారిస్తున్నాము అని చెప్పుతున్నాను. West Godavari జిల్లాలో Motor workers గురించి మరొక reference వచ్చింది. దానిమీద award వచ్చింది. ఆ award అమలుజరపలేదని, గవర్నమెంటు తాఖీదులు ఇస్తూ prosecution చేసేసరికి, ఆ బస్సు యజమాని, తనయొక్క ఆస్తిపాస్తులన్నీ తాను అప్పు తెచ్చిన షావుకారికి దఖలుపరచి తాను దివాళా తీసి తెల్లజండా ఎత్తే స్థితి ఏర్పడినందువల్ల, వారిమీద ఈ prosecution అమలు జరపాలనేటటువంటిది, ఇప్పుడు legal గా ప్రభుత్వము ఆలోచన చేస్తున్నది. కాని ఆ awards ఏవి ఉల్లంఘించడానికి వారికి ఏలాటి అవకాశాలు ఇవ్వలేదు.

తరువాత నెల్లూరు Nazaria Motor Workers గురించి ఒక రిపోర్టు ఉన్నది. అది adjudication కు refer కాలేదు. దానిమీద Labour Officer enquiry జరిగింది. ఆ report కొరకు await చేస్తున్నాము. కనుక దానినిగురించి ప్రభుత్వము ఏమి చర్య తీసుకోదు. అనే అపోహ ఈ సభ్యులకు కలిగింది అంటే

23rd March 1956] [Sri G. Latchanna

అది ప్రభుత్వము నిర్వహిస్తున్న శాసన సభ్యులయొక్క అసమర్థత అని చెప్పకోవడం జరుగుతుందిగాని, అది సరియైనటువంటి సమర్థతతో కూడుకొన్నటువంటిదికాదు అని మనవిచేస్తున్నాను. అందువల్ల ఇది వ్యక్తులతోను, వ్యక్తిగతమైన ఆలోచనలతోను కూడుకొన్నటువంటిదికాదని చరిత్రచూస్తే తెలుస్తుంది. కనుక సభ్యులకు అటువంటి అపోహ ఉండడం సరియైనదికాదు.

Contract labour గురించి ఇప్పుడు ఏమి జరుగుతున్నదో చెప్పతాను. Labour Commissioner ను Chief Engineer ను ఈ ఉభయులను రెండు మార్లు సమావేశపరచి ఆ సమస్యలన్నీ పరిశీలించి, ఉపయోగకరమైనటువంటి, న్యాయమైన కోర్కెలన్నీ కూడ పరిష్కారం చేశాము. మేము పరిష్కారం చేసినవి అమలుకాలేదనేటటువంటి ఒక memorandum వచ్చింది. దానిని వెంటనే నేను పరిశీలనకు పంపించాను దాన్నిగురించి ఏవిధంగాను అశ్రద్ధ చేస్తున్నామని చెప్పడానికి వీలులేదని మనవిచేస్తున్నాను. శ్రీ నరశింగరావుగారు future నిర్మాణం గురించి కొన్ని సూచనలు చేశారు. కూలీలకు ఆ Act ఎలాగు అమలు జరుపబడుతున్నదో చూడడము, కూలీల అభివృద్ధిగురించి, వారి సంక్షేమంగురించి శ్రద్ధ తీసుకొంటున్నదో లేదో చూడడం. వారు చేసినసూచనలలోకల్లా, ప్రధానమైనటువంటిది. ఆ విషయాలన్నీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చర్చించబోతున్నాము. త్వరలోనే, అందులో వచ్చే యేడాది, labour కు సంబంధించి 12 కేంద్రాలలో Welfare Centres open చేయడానికి ఒక ప్రణాళిక తయారు చేశాము. దాన్ని కేంద్ర ప్రభుత్వము ఆమోదిస్తుందని నేను ఆశిస్తున్నాను. కనుక దానిపట్ల అశ్రద్ధ అనేదికాదు. అదేవిధంగా, ఈ Fair Wages Act, కనీసవేతనాలు, వీటికి సంబంధించి వెంకటేశ్వర్లుగారు చాలా సూచనలు చేశారు. వాటన్నింటిని ప్రభుత్వం చెయలేకుండా, తప్పించుకొంటున్నారేమో అనేటటువంటి అపోహ విడిచిపెట్టి విచారణచేస్తే ఎవరికి ఏలాటి అభ్యంతరంలేదు. కాని ఏమిచేసినా, చేయలేదు అనే ధోరణితోనే విమర్శచేస్తాము అంటె దానికి దేవుడే సమాధానం చెప్పాలి. కాని మాబోటి సామాన్య మానవుడు సమాధానం చెప్పలేడు. ఇప్పుడు ఇది నేను చేస్తున్నాను అనేదికాదు. ఇది ప్రభుత్వముయొక్క policy. ఎవరు ఉన్నా ఈ policy ని నడిపించవలసిందే. వ్యక్తిగతమైన లక్ష్యాలకు ఇందులో అవకాశములేదు. ఇప్పుడు కేంద్రములో రాష్ట్రానికి సంబంధించిన శాసనాలు Women's Maternity Act అని, Shop Employees Act అని రెండే రెండు శాసనాలు ఉన్నాయి. మిగతా శాసనాలన్నీ కేంద్ర ప్రభుత్వము అమలు పరచవలసినటువంటివే. కేంద్ర ప్రభుత్వానికి మేము అనేక సూచనలు చేసిఉన్నాము.

Sri G. Latchanna] [23rd March 1956

వాటిని కేంద్ర ప్రభుత్వంవారు పరిశీలన చేస్తున్నారు. ఇప్పుడు పార్లమెంటులో Labour Minister గారు ఒక శాసనము ప్రతిపాదన చేస్తున్నారు. దానివల్ల చాలా సమస్యలు పరిష్కార మవుతున్నాయి. Tribunal enquiries కూడా చాలా త్వరగా, నిర్ణీత కాలములో, జరుగవలెననే సూచనకూడ ఉన్నది. దాన్నికూడ పరిశీలన చేస్తున్నారు.

గోపాలక్రిష్ణయ్యగారు కొన్ని ప్రత్యేకమైన కేసులుగురించి తెలియజేశారు. దానికి వెంటనే తగిన information ఇవ్వడానికి నా దగ్గర ఆ record లేదు. నేను అవన్ని పరిశీలన చేస్తాను. అలాగే వెంకటేశ్వర్లుగారు తెలియజేసిన కేసులు గురించికూడ information call for చేసి చర్యతీసుకోడానికి అభ్యంతరంలేదు. ఉపేక్ష మాత్రము ఉండదు. కనుక అనవసరంగా, ఈ demand పనికిరాదు అనే దానికంటే, దీన్ని బలపరచి ఇంకా ఎక్కువ కోరితే అది న్యాయంగాని, బలపరచకుండా అడ్డుపెట్టి మాకు అదిచేయలేదు, ఇది చేయలేదు అనేది అభివృద్ధి నిరోధకమైన పద్ధతి అని మనవిచేస్తూ ఈ cut motions అన్ని విరమించుకొని అందరు ఏకగ్రీవంగా దీన్ని ఆమోదించవలసిందని కోరుతున్నాను.

Mr. SPEAKER :—Discussion on the Demand is closed. I am now putting the cut motion (No. 606) of Sri Vavilala Gopalakrishnayya to the vote of the House.

The question is :

To reduce the allotment of Rs. 8,07,700 for Labour including Factories by Rs. 100.

కార్మికులు తమ యిబ్బందులు లేబరుఆఫీసరుకు తెలియజేసిన 3 నెలలు లోగా పరిష్కారం చేయవలెనని డి. ఎల్. ఒ. లకు హుకుం యివ్వించవలెను.

The motion was lost.

Mr. SPEAKER :—I am now putting the cut motions (Nos. 607 and 608) of Sri Pillalamarri Venkateswarlu to the vote of the House.

The question is :

To reduce the allotment of Rs. 8,07,700 for Labour including Factories by Rs. 100.

23rd March 1956]

To discuss the working of the Industrial Tribunal.

The motion was lost.

The question is:

To reduce the allotment of Rs. 8,07,700 for Labour including Factories by Rs. 100.

To discuss the failure of the Government to implement the terms of agreement arrived at with the Andhra Electricity Employees Union.

The motion was lost.

MR. SPEAKER —I am now putting the cut motion (No. 615) of Sri M. Nagi Reddi to the vote of the House.

The question is.

To reduce the allotment of Rs. 8,07,700 for Labour including Factories by Rs. 100.

పరిశ్రమలలో పనిచేస్తున్న కూలీలందరికి కనీస వేతనాలు నిర్ణయించి, అమలు పరచుటకు ప్రభుత్వం పూనుకోనందుకు.

The motion was lost.

MR. SPEAKER :—I will now put the main Demand to the vote of the House.

The question is :

"That the Government be granted a sum not exceeding Rs. 8,07,700 under Demand XXIII—Labour including Factories."

The motion was carried and the Grant was made.

## (2) DEMAND No. XXI—INDUSTRIES.

## (3) DEMAND No. XXXVII — CAPITAL OUTLAY ON INDUSTRIAL DEVELOPMENT.

THE HON. SRI K. VENKATA RAO :—On the recommendation of the Governor, Sir, I beg to move :

"That Government be granted a sum not exceeding Rs. 67,81,800 under Demand No. XXI—Industries".

Sri K. Venkata Rao] [23rd March 1956

"That Government be granted a sum not exceeding Rs. 37,94,800 under Demand No. XXXVII—Capital Outlay on Industrial Development".

అధ్యక్షా, Indusrties demand ను నేను యీ దినము యీ సభముందు ప్రవేశపెట్టుతున్నాను. ఈ డిమాండుకు సంబంధించి మన రాష్ట్రములోఉన్న వివరాలన్ని నేను ఒక note ద్వారా సభ్యులందరికి యీ దినము ఉదయమున అందజేశాను. దానిలో వివరాలన్నిగూడ తెలియజేయబడినవి. అందువల్ల మరల ఆ వివరాలను యిప్పుడు వివరించి చెప్పేబదులు, అధ్యక్షులవారి సూచన ప్రకారము సభ్యులకు కొద్ది విషయాలు మనవిచేస్తున్నాను. అందులోఉన్న ముఖ్యమైన విషయాలలో మొదటిది యేమిటంటే, 1948వ సంవత్సరములో పారిశ్రామిక విధానాన్నిగురించి కేంద్రప్రభుత్వముచేసిన నిర్ణయాలను తిరిగి నేను మనవిచేయవలసిన అవకాశము ఏర్పడింది. త్వరలోనే నూతనమైన పంథాఒకటి లభిస్తుందని ఆశిస్తున్నాము. ఇదివరకటి విధానము ఎందువల్ల మార్చవలసివచ్చిందంటే, అసలు కాంగ్రెసు విధానంలోనే మార్పువచ్చి మనకు Socialistic pattern of society అనేది అమలుజరిపేటందుకు ప్రయత్నం జరుగుతున్నది గనుక, మన Industrial policy గూడ దాని కనుగుణమైన మార్పుతీసుకుని రావటానికి నూతనపద్ధతి ఒకటి ప్రవేశపెట్టటానికి సిద్ధముగా ఉన్నారు. కాని పునాదిలోనే కొన్ని విషయాలు ఉన్నవి. ఈ నూతనపంథానుబట్టి కొన్ని basic industries ను ప్రభుత్వమే హస్తగతము చేసుకుంటున్నది. ఇనుము, ఉక్కు. బొగ్గు వగైరాలు, యింకా యితర defence industries మన దేశములో చాలా ఉంటున్నవి. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో వీటిసంఖ్య హెచ్చుచేయటానికి ప్రయత్నం జరుగుచున్నది

తరువాత ప్రైవేటు వ్యక్తులుగాని, కంపెనీలుగాని నిర్వహించే సంస్థలలో ఉత్పత్తికి వినియోగించే పదార్థములకు అనువైన పరిస్థితులు కల్పించే విధానము అమలులో పెట్టడముకూడ ముఖ్యమయిన విషయం. ఇది దృష్టిలోపెట్టుకుని మనయొక్క పారిశ్రామిక విధానమును అమలులోకి తీసుకుని రావలసి ఉంటున్నది సభ్యులు చాలమంది cut motions యిచ్చారు. వాటి అన్నింటిలో ప్రభుత్వము అది చేయలేదు, యిది చేయలేదుఅని అన్నారు. అవిఅన్నీ చెప్పితే లాభములేదు ప్రభుత్వము పెట్టగలిగిన వేవోపెట్టారు. పెట్టినవి చెప్పాను. ఇంకా ఏవైనా పెట్ట గలిగినవిఉంటే, పెట్టబోతారు. కాని ప్రైవేటు వ్యక్తుల చేతులలో ఉన్నవాటి [illegible] గత సంవత్సరమునుంచి నేనుచేస్తున్న అమితమైనకృషి ఫలితముగా [illegible]ప్తే ఆంధ్రదేశము ప్రజలలో యింకా industrilization mind

రాలేదు. ఇప్పటివరకు ప్రజలలో ఎవరికైనా డబ్బుఉంటే, ఏ 12-8-0 రూపాయి వడ్డీ సంపాదించుకోటానికి అప్పులు యిచ్చుకుంటూ, వడ్డీలు ఆర్జించుకునే ఉద్దేశ్యములోనే ఉన్నారుగాని, వాళ్లకు ఉన్నటువంటి డబ్బు గవర్నమెంటు బాండ్సులోనైనా deposit చేయటానికి చూస్తారేగాని, ఆ సొమ్మును ప్రభుత్వము ఏర్పాటు చేసే పరిశ్రమలలో పెట్టుబడిక్రింద యివ్వటానికి తోడ్పడేదృష్టి వారికి యింకా రాలేదు.

AN HON. MEMBER :—మీరు కలవారేగదా! దానిని మీరు ఎందుకు invest చేయకూడదు ?

THE HON. SRI K. VENKATA RAO :—మేము కళావారము గాని, నేను కలవాడినికాదు. అందువల్ల యీ industries యొక్క నిర్వహణలో ప్రజలనుంచి యింకా ఎక్కువ తోడ్పాటులభిస్తే, వీటిని ఎక్కువవృద్ధి చేయటానికి వీలవుతుంది. నేను యిచ్చిననోటులో 8వ పేజీ చూడండి. అందులో అన్ని వివరాలు యిచ్చాను. Sericulture క్రింద 1956-57 వ సంవత్సరములో 65,500 రూపాయలు ఖర్చుచేస్తూ ఆరు స్కీములు తలపెట్టాము. కుటీరపరిశ్రమలకు సంబంధించిన వివరాలుఅన్నీ ఆ note లో ఉన్నవి. ఇవిగాక Handicrafts వేరే ఉన్నవి. ఈ సంవత్సరములో 1½ లక్షలు అప్పుక్రింద ఒకలక్ష గ్రాంటుక్రింద ఇండియాగవర్నమెంటువారు మనకు యిచ్చారు. నేను అందజేసిన Note లో తొమ్మిదవ పేజీలో యీ స్కీములుఅన్నీ ఉన్నవి తరువాత 11 వ పేజీలో Small scale industries ను గురించి వివరాలు ఉన్నవి. 1955-56 వ సంవత్సరములో 9,62,749 రూపాయలులోను క్రింద 3,90,250 రూపాయలు గ్రాంటు క్రింద వచ్చినది. రాబోయే 1956-57 వ సంవత్సరములో 5,08,000 రూపాయలు గ్రాంటుక్రింద, 17,04,000 రూపాయలు ఇండియా గవర్నమెంటువారు మనకు యిస్తున్నారు. అందువల్ల యింకా ఎక్కువగా కృషి చేయటానికి వీలవుతున్నది. చేనేత పరిశ్రమలక్రింద 1956-57 వ సంవత్సరములో మొత్తముమీద స్కీములన్నిటికీకలసి 1,53,12,588 రూపాయలు మనకువచ్చినవి దీనికి వివరాలు 13 వ పేజీలోఉన్నవి. ఇప్పుడు ప్రభుత్వము పెట్టబోయే కొత్తఫ్యాక్టరీలలో అప్పుడే మూడు ఫ్యాక్టరీలు కట్టుతున్నారు. అవి తయారైనట్లే, కొంచెము హెచ్చు తక్కువగా రాబోయే season లో అవి పని ప్రారంభించగలవు ఇవిగాక యింకా కొత్తవి అయిదు ఫ్యాక్టరీలు Co-operative విధానముక్రింద recommend చేస్తూ కేంద్రప్రభుత్వానికి వ్రాశాము. ప్రైవేటు వ్యక్తులుగూడ పెట్టుకుంటామంటే, అవిగూడ రెండు, మూడింటికి సిఫార్సుచేయటానికి సిద్ధముగా

ఉన్నాము. రాబోయే 31 న తేదీనాటికి గరివిడిలో Ferro Manganese factory కి శంఖుస్థాపన జరగబోతున్నది. దానికి 1,50,00,000 రూపాయలు పెట్టుబడి పెట్టబడుతున్నది. అదిగూడ అమలులోకి రాబోతున్నది తరువాత మూడు సిమెంటు ఫ్యాక్టరీలకు లైసెన్సుయిచ్చారు. ఇంకా లైసెన్సులు యివ్వబోయే వాటితోగూడ రెండు మూడు సంవత్సరాలలో మనకు తయారుకాబోయే సిమెంటు మనకు 10,15 సంవత్సరాలదాకా పుష్కలంగా లభిస్తుంది. సిమెంటుకు కొరత అనేది ఉండదు. కాబట్టి ప్రభుత్వము ఆయేర్పాట్లుఅన్నీ చేస్తున్నది.

తరువాత spinning mills విషయంవున్నది. ఈ మిల్సుకు నాలుగింటికిఇండియా గవర్నమెంటువారు లైసెన్సులు యిచ్చారు. ఇందులో ఒకటి co-operative basis మీద పనిచేస్తుంది. వీటిలో ఒకదానికి 17½ లక్షలు పెట్టుబడిపెట్టి ప్రభుత్వమువారే తాడిపత్రిలో నడపబోతారు. ఇదిగాక చీరాలలోఒక spinning mill పెట్టటానికి ప్రయత్నం జరుగుతున్నది. కాని దానికి యింకా స్పష్టముగా ప్రణాళిక తయారు కాలేదు. మిగిలినవి మూడుకంపెనీలు పెట్టబోతారు. ఆ మూడింటికి అప్పుడే share capital కూర్చటానికి చర్యలు తీసుకొంటున్నారు. డిపార్టుమెంటులో యింకా ఒక ముఖ్యమైన విషయము ఉన్నది. అది ఖనిజములగురించి. ఈ ఖనిజాలను గురించిన వివరాలన్నీ నేను అందజేసిన note లో గూడ వ్రాయబడినవి. ఆంధ్రదేశములో blast furnace plant ఒకటి పెట్టినందుకు ప్రభుత్వాన్ని అభినందించాల్సివున్నది. ఈ blast furnace గాలిలో పెట్టేదికాదు. మన రాష్ట్రములో iron deposits అక్కడక్కడ ఉన్నవి. మనకు ఊరకనే iron deposits ఉంటే లాభము లేదు. దానికి చేరువలో coal గూడ ఉండాలి. ఇదిగాక దీనికి lime stone కూడాకావాలి. ఈమూడు అక్కడక్కడ దూరదూరముగా ఉంటే లాభములేదు. ఈ మూడున్నూ, ఒకదానికొకటి దగ్గరలో ఉండాలి. రాష్ట్రములో యీమూడు ఒకే చోట సమీపములో ఉండేచోటుగా చూడాలి. మూడున్నూ ఒకేచోటులో ఉండే ప్రదేశముగాచూచి పట్టాలి. అప్పుడే యీ industry ని పైకితీసుకొని రావటానికి వీలు అవుతుంది. ఆంధ్ర దేశములో coal deposits ఎక్కడెక్కడ ఉన్నవో వాటిని గురించి enquire చేయటానికి top priority యిచ్చారు. ఇవి గోదావరి రివర్ వ్యాలీలో కొన్ని ప్రదేశాలలో ఉన్నట్లు తెలుస్తున్నది. మనకు విశాలాంధ్ర ఏర్పడ్డ తరువాత, దానికిప్రక్కనే కొత్తగూడెము ఉన్నది. అదిగూడ మనకు కలిసివస్తున్నది. అది యీ industry కి చాలా సహాయముగా ఉంటుంది. జగ్గయ్యపేటనుంచి [illegible] వెళ్ళే యినుపరాయిని పోనివ్వకుండా నేను అడ్డు తగులు [illegible] గాకూడ ఉన్నది. ఆరాయి నెల్లు

23rd March 1956] [Sri K. Venkata Rao

తున్నదిగాని, అది ప్రభుత్వానికి ఉండేస్థలములో ఉంటే, అదిమాత్రము పోనివ్వడములేదు. ఇవతల మాచర్ల వైపునగూడా ఎక్కువగా ఉన్నట్లు తెలుస్తున్నది. నేను అనుకున్న అంచనాలప్రకారము, విధానము ప్రకారము అయితే, నా estimates అన్నీ correct అయితే, మనకు లాభమే. అది ఇండియా ప్రభుత్వమువారు చూస్తున్నారు. మన రాష్ట్రములో భూగర్భములో యింకా ఎక్కడెక్కడ ఉన్నవో, అవి మనకు తెలియవుగాని, అవి అన్నీ దొరికితేమాత్రము యిక్కడ మనకు ఒక steel factory పెట్టుకోటానికే వీలు ఉంటుంది. అధమపక్షము pig iron manufacture అయినా ఒకటి పెట్టాలని ప్రభుత్వము ప్రయత్నిస్తున్నది. ఈవిషయమంతా ఇండియా గవర్నమెంటువారికి వ్రాశాము. అది అంతా వారు అజ్మాయిషీలో ఉన్నది. ఇంకా మూడు సంస్థలు ప్రభుత్వపు అధీనములో ఉన్నవి. అవి యేమిటంటే, రాజమండ్రీ పేపరుమిల్సు, గూడూరు సిరమిక్సు, block glass factory. ఈ గ్లాసు ఫ్యాక్టరీ తయారు అయి యింకా ఒకసంవత్సరము అయినా పూర్తికాలేదు. సిరమిక్సు ఫ్యాక్టరీమీద మనకు లాభము వస్తున్నదని నేను యిదివరకే చెప్పాను. ఇక రాజమండ్రీ పేపరుమిల్లు విషయములోగూడ ఒక సంతోషకరమైన వార్త మీకు చెబుతున్నాను. మొన్న నేను రాజమండ్రీకి వెళ్లినప్పుడు ఆ మిల్లు మేనేజరును పిలిపించి ఆయనతో మాట్లాడాను. ఆ మిల్లులోని stock యింతవరకు ఏ సంవత్సరములోనూ అమ్ముడుపోనంత సరకు యీ సంవత్సరము అమ్ముడు పోయిందని ఆయన చెప్పారు. పోయిన సంవత్సరము మేము ప్రభుత్వములో చార్జీ తీసుకునేటప్పటికి యీ మిల్లులోని 1200 tons పేపరు ఉన్నది. ఇప్పుడు ఆ stock అంతా అమ్ముడుపోయి, మిగిలి ఉన్నది, 300 టన్నులే అని ఆయన చెప్పాడు. మొన్న మార్చి 18 వ తేదివరకూ 1915 టన్నులపై చిల్లర stock అప్పుడే ఎగుమతి అయిపోయింది. దాని ఖరీదు 26,75,922 రూపాయలు అవుతుంది. గత సంవత్సరము దానిలో 66,000 రూపాయలు నష్టమువచ్చింది. ఈ సంవత్సరము1,25,000 నుంచి 1,50,000 రూపాయలుదాకా, రేపు మార్చి 31 వ తేదీనాటికి యీ పేపరు మిల్లుమీద లాభము వస్తుందని, యిప్పుడు ప్రభుత్వము వేసుకున్న అంచనాలను బట్టి తెలుస్తున్నది. కాబట్టి యీ విధానము అంతా యీవిధముగా నడుస్తున్నది. పోతే, మిగిలిన విషయాలు వాటియొక్క వివరాలు, అన్నిగూడ నేను అందజేసిన note లోనే నమూదుచేయబడినవి. సభ్యులు అవి అన్నీ విపులంగా చదువుకుంటే బోధపడుతాయి. కాని సభ్యులు ఆవివరాలన్నీ / కొంచెము సహృదయముతో చూడాలని నాకోరిక. ఇవి అన్నీ గాక, యింకా ఆవిపెట్టలేదు, యివి పెట్టలేదు అని విమర్శించటానికి ఆరంభిస్తే, యిక నేను వాటికన్నింటికి సమాధానము చెప్పవలెనని ఉంటుంది. దానికి నాకేమి, అభ్యంతరములేదు, . కాని ఇంత

Sri K. Venkata Rao] [28rd March 1956

వరకు ప్రభుత్వము చేసిన పనులు అన్నీ నేను వివరించి చెప్పాను. పోతే మిగిలిన గొడవ అంతా మనకు యిప్పుడు అక్కరలేదు.

AN HON. MEMBER:—Fertiliser factory ని గురించి చెప్పలేదండి.

THE HON. SRI K. VENKATA RAO :—దానిసంగతి తరువాత చెబుతాను. దానికి ఒక cut motion ఉన్నదిగనుక తరువాత చెప్పవచ్చునని ఊరకున్నాను. అందువల్ల యిప్పుడు చెప్పలేదు.

MR SPEAKER :—Motion moved :

"That Government be granted a sum not exceeding Rs. 67,81,800 under Demand No. XXI—Industries."

"That Government be granted a sum not exceeding Rs. 37,94,800 under Demand No. XXXVII—Capital Outlay on Industrial Development."

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 67,81,800 for Industries by Rs. 100.

గుంటూరులో ప్రభుత్వం ఒక సిగరెట్ ఫ్యాక్టరీ ప్రారంభించవలెనని

SRI PILLALAMARRI VENKATESWARLU :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 67,81,800 for Industries by Rs. 100.

(To discuss the failure of the Government to press upon the Government of India to make provision for starting of major industries in Andhra including a fertiliser factory).

SRI M NAGI REDDI :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 67,81,800 for Industries by Rs. 100.

సిమెంటు ఇనుము ధరలు పెరిగి బ్లాకుమార్కెట్ లోకి పోయినందుకు

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Sir, I beg to move .

> To reduce the allotment of Rs. 37,94,800 for Capital Outlay on Industrial Development by Rs. 100.

విజయపురివద్ద సిమెంటు ఫ్యాక్టరీ ఏర్పరచవలెనని

SRI M. NAGI REDDI :—Sir, I beg to move :

> To reduce the allotment of Rs. 37,94,800 for Capital Outlay on Industrial Development by Rs. 100.

పల్నాడు తాలూకా మాచెర్లలో సిమెంటు ఫ్యాక్టరీని ప్రభుత్వము నిర్మించుటకు పూనుకోనందుకు.

MR. SPEAKER :—The main Demands and cut motions are now before the House for discussion.

SRI G. YELLAMANDA REDDI :—అధ్యక్షా! పరిశ్రమలశాఖా మంత్రిగారు తమ ఉపన్యాసంలో అవిలేవు, ఇవిలేవు అనేదానికంటె చేసిన పనిని అభినందించగల్గితే మంచిదని చెప్పారు. చేసిన మంచిపనిని తప్పకుండా అభినందిస్తాం. ఇతర విషయాలుకూడా చర్చించుకున్నప్పుడే మనం ముందుకు వెళ్ళడానికి వీలుంటుంది. దేశం ముందుకుపోవాలంటే ఈ రెండో పంచవర్ష ప్రణాళికలో పరిశ్రమలు బాగా అభివృద్ధికావాలి అనే సూత్రంమీద దీనిని పరీక్షిస్తే గమనించతగ్గ మొత్తాలు కేటాయింపబడలేదని స్పష్టమవుతుంది. ఈ Budget memorandumలో చూస్తే Capital outlay క్రింద, 1955-56లో 22.13 లక్షలు కేటాయిస్తే, 1956-57 లో 19.91 లక్షలు మాత్రమే Capital outlay క్రింద చూపించారు. ఈ Budget ను వివరంగా చూస్తే ఇందులో తమాషా ఏమిటంటే, 1955 లో Estimates కు కేటాయించిన డబ్బు ఖర్చుపెట్టకుండా 1956 లో ఆ మొత్తాలే ఇక్కడ చూపించారు. అందువల్ల Government Capital outlay క్రింద ఇప్పుడు చూపించిన మొత్తం 1955 లో కేటాయించిన మొత్తమే. యంత్రాలు కొనడానికి కేటాయించి, అప్పుడు కొనకుండా ఈ సంవత్సరం దాన్ని కొనడానికి ప్రయత్నిస్తున్నారు కాబట్టి ఈ సంవత్సరంలో Capital outlay క్రింద ఒకలక్షరూపాయిలుకూడా లేద నేది మనకు స్పష్టంగా కనబడుతోంది. 1956 లో 22.13 లక్షలు చూపించి, 1955-56 Revised estimates లో 1.69 లక్షలు చూపించి, 1956-57 లో 19.91 లక్షలు చూపించారు. గత సంవత్సరంలో కేటాయించిన మొత్తమే ఈ సంవత్సరం Capital outlay క్రింద ఖర్చుపెడ్తు

తోంది. Capital outlay క్రింద ఒక లక్షరూపాయిలకంటే జాస్తి ఈ సంవత్సరం కేటాయించలేదనే విషయం మనకు స్పష్టంగా కనబడుతోంది. అందువల్ల పరిశ్రమలక్రింద ఏమీలేవని గమనించతగ్గ విషయం 21 వ Demand క్రింద ఉన్న variation చూస్తే కొంత మొత్తం ఈ గృహపరిశ్రమలకు కేటాయించడం జరిగింది తప్పితే capital outlay క్రింద గమనించతగ్గ పెద్ద మొత్తం ఏమీ పెంచలేదు. 10 లక్షలు original works క్రింద 4.04 లక్షలు tools క్రింద కేటాయించారు. ఈ Budget లో కర్నూలులోనూ, గుంటూరులోనూ కొనే అచ్చుయంత్రాలుకూడా Industries Capital outlay క్రింద చూపించారు. అచ్చుయంత్రాలనుకూడా Capital outlay క్రింద చూపించడం ఏమంత సమంజసంగాలేదు. అది మొత్తం లెక్కకుమాత్రమే కనబడుతుంది కాని పరిశ్రమలక్రిందపెట్టిన ఖర్చుకాదని తెలుస్తోంది.

THE HON. SRI K. VENKATA RAO:—ఎందులో జమకట్టమని మీ కోరిక ? Accounts లో నుంచి తీసెయ్యమనా?

SRI G. YELLAMANDA REDDI :—Accounts లో నుంచి తీసెయ్యమని కాదు. పరిశ్రమల అభివృద్ధికి వినియోగించేధనమే capital outlay క్రింద చూపిస్తే సమంజసం.

THE HON. SRI K. VENKATA RAO :—Printing మాత్రం పరిశ్రమకాదా ? దానిక్రింద వినియోగించిన ధనం పెట్టుబడికాదా ?

SRI G. YELLAMANDA REDDI:—పెట్టుబడి కావచ్చునుగాని, అది పరిశ్రమలు అభివృద్ధిచేసుకోడానికి వినియోగించే పెట్టుబడిక్రింద మాత్రం ఎవరూ కూడా జమకట్టరు. ప్రభుత్వ యంత్రాంగం నడుపుకోడానిని కావలసినటువంటి ఖర్చులక్రింద జమకట్టవలసింది తప్పితే ఈ 16 లక్షలూ Capital outlay క్రింద చూపించినందువల్ల వచ్చే సంతృప్తిగాని, అభివృద్ధిగాని కనబడడంలేదని నా ఖచ్చితమైన అభిప్రాయం. 10 లక్షల రూపాయిలకంటె Capital outlay మీద ప్రభుత్వం కేటాయించలేకపోయిందని చూచినప్పుడు ఈ rate న మనం ఈ 5 సంవత్సరములలో పంచవర్ష ప్రణాళిక క్రింద ఎంతవరకూ మన పరిశ్రమలు అభివృద్ధిచేసుకోగలమో నాకు బోధపడడంలేదు. ఇప్పటివరకూ చెప్పుకోతగ్గ అభివృద్ధి ఏమీలేదు. Sugar Industry చూస్తే 6.35 నుంచి 0.40 వరకూ అభివృద్ధి చెందన్నారు. ఇది కేవలం ప్రచారసాధనంగా వినియోగించుకుంటున్నారు తప్ప పరిశ్రమలలో మనం అనుకున్నంత అభివృద్ధి సాధించలేకపోయామని,

ప్రభుత్వం వారు ఇచ్చిన లెక్కలనుబట్టే మనకు స్పష్టమవుతోంది. పెద్ద పరిశ్రమాధిపతికి చెందినదైన హిందూపత్రిక మన పరిశ్రమలనుగురించి వ్రాసినది చూస్తే మన Budget ఏరకంగా ఉందో ఏ రకంగా మన కేటాయింపులు జరుగుతున్నారో చూచినట్లయితే కేవలం కమ్యూనిస్టులు విమర్శచేస్తున్నారనే కాకుండా, ఒక పెద్ద Industrialist యొక్క అభిప్రాయాలూ, విమర్శకూడా మీకు బాగా గోచరిస్తుంది.

THE HON. SRI K. VENKATA RAO:—Printing Industry కాదన్నారు. మళ్ళీ మీ అవసరం వచ్చినప్పుడు అది Industry గా ఒక secon లో మారిపోయింది. గవర్నమెంటువారు Printing machines కొంటే, Printing Industry కాదన్నారు. Hindu paper వారిని పెద్ద Industrialist అంటున్నారు. అక్కడ printing కాక ఇంకేముందండి?

SRI G. YELLAMANDA REDDI:—Hindu పత్రిక Industry అని నేను చెప్పలేదండి. ఆయన స్వతాహా పెట్టుబడిదారు కనుక Industrialist అన్నాను.

THE HON. SRI K. VENKATA RAO:—ఆయన ఇంక దేనిమీదా పెట్టుబడి పెట్టలేదే?

SRI G. YELLAMANDA REDDI:—ఏదైనప్పటికీ ఆయన పెద్ద పెట్టుబడిదారు కాబట్టి అన్నానుగాని, Hindu paper యంత్రంవల్ల పెట్టుబడిదారనలేదు.

" All this expansion has been left to the private sector but in the conditions prevailing in Andhra, the Government should come forward with the help in all possible ways to get these new enterprises started. The Government should provide at least a crore of rupees a year for financing the new industries. To limit their attention to the Andhra Paper Mills and the starting of Co-operative Sugar Factories as is suggested by the budget speech would be to neglect grievously more essential areas of development."

MR. SPEAKER :—You cannot read cuttings from the newspapers. Let us have our own opinions.

SRI G. YELLAMANDA REDDI :—చక్కెర factory లు రెండు, మూడు పెడతామని మంత్రిగారు చెప్పారు. ఈ చక్కెర factory లకు సంబంధించినంతవరకూ సుమారు 1 కోటి రూపాయిలు భాగాలు కొనడంద్వారా కానివ్వండి, లేకపోతే అప్పులుపెట్టడంద్వారా కానివ్వండి ఈ 5 సంవత్సరాలలో ఖర్చుపెట్టాలి. దానికి సంబంధించిన కేటాయింపు budget లో ఎక్కడా కనిపించ లేదు. ఈ పద్ధతిలో ఈ 5 సంవత్సరాలలో పారిశ్రామిక అభివృద్ధి ఏమాత్రం జరగ జాలదని మనవిచేస్తున్నాను.

ఆంధ్రరాష్ట్రంలో వుండే చాలా ముఖ్యమైన పరిశ్రమలు ఆంధ్రరాష్ట్రం రాకముందునుంచి చాలా హీనస్థితిలో ఉన్నాయి. వీటినిగురించి ప్రభుత్వం శ్రద్ధ తీసుకోనలేక పోతుందని మనవి చేస్తున్నాను. నెల్లూరుజిల్లాలోని మైకాపరిశ్రమ ఆంధ్రరాష్ట్రంలోని ముఖ్య పరిశ్రమలలో ఒకటి. యుద్ధకాలంలో సుమారు లక్ష కార్మికులు పనిచేస్తుండేవారు. గనులలో పని చాలా గొప్పగా జరుగుతుండేది. ఈమధ్య పరిస్థితి చాలా హీనమైపోయింది. 30% నుంచి 50% వరకు కార్మికులు నిరుద్యోగులుగా ఉంటున్నారు. మైకా పరిశ్రమ పనిచేయడంలేదు. ఇది సక్ర మంగా పనిచేయడానికి తగిన proposals తో ప్రభుత్వం ముందుకు రాలేక పోతోంది అని మనవి చేస్తున్నాను. Mica factory ఒకటి అక్కడ private industrialist పెట్టాడు. ప్రభుత్వ సహాయం కావాలని కోరారు. ప్రభుత్వం వాగ్దానంకూడా చేసారు. దాని విషయమై ఏమి జరిగిందో తెలియదు. మైకా మనదేశంలో వినియోగించడానికి ప్రభుత్వం ఈ బడ్జెటుకు సంబంధించిన విషయా లలో బడ్జెటు ఉపన్యాసంలో వివరాలు ఏమిలేవు. ఇది ఒక జిల్లాకు సంబంధిం చినవిషయం. అంతేకాకుండా విదేశాలనుంచి డాలరులు సంపాదించుకోనడానికి అనువైనవస్తువు. ఇటువంటి పరిశ్రమమీద సక్రమమైనవిధానం అవలంభించడం లేదు. గనులకు సంబంధించినంత వరకు royalties విషయంలో ప్రభుత్వానికి రావలసిని మొత్తాలు రావడంలేదు. ఇందులో పోటాపోటీలు ఎక్కువ; licences సంపాదించడానికి వెచ్చించే మొత్తాలు లక్షలకొలది ఉన్నవి. మైకా పరిశ్రమను అభి వృద్ధిచేయడంవలన నిరుద్యోగం కొంత తగ్గుతుంది. దీని విషయమై ప్రభుత్వం తీవ్రంగా ఆలోచించాలని కోరుతున్నాను. సయినేడు గనులు నెల్లూరుజిల్లాలో ప్రారంభించ బడి, కొంత పరిశ్రమ సాగి, ముడిసరకు తయారుచేయబడి ఎగుమతి లేకుండా నిలబడి పోయింది. Private పెట్టుబడిదారులు కొంతవరకు పెట్టుబడిపెట్టి పని సాగించినా ఎగుమతి లేకపోవడంవల్ల ఆపివేయడం చాలామందికి నష్టాలురావడం జరిగింది. Market లేక ముడిసరుకు నిలబడిపోతోంది. ప్రభుత్వం ఆలోచించి సరిఅయిన కృషి చేయాలని. అభిప్రాయం [illegible] సంబంధించిన విషయాలున్నాయి.

చాలాకాలం నుంచి ఆంధ్రదేశంలోని రైతాంగం ఆందోళన చేస్తున్న విషయం. 3, 4 జిల్లాలలో పొగాకు Commercial Crop గా పెంచుతున్నారు. I. L. T. D. Company speculation మీద రైతాంగం జీవితం ఆధారపడి వుంటుంది. సరి అయిన ధర ఇస్తే ఇచ్చినట్లు లేకపోతే లేదు. మన దేశంలో ఉత్పత్తి అయ్యే పొగాకు సక్రమంగా వినియోగంలోనికి రావాలంటే సిగరెట్లు ఫాక్టరీ ఒకదానిని పెడితే రైతాంగానికి లాభాలురావడమే కాకుండా కార్మికులకు ఉద్యోగాలు దొరకడం ఉంటుంది. దీనికై రైతాంగం అనేక రోజులనుంచి ఆందోళన చేస్తున్నారు. దానివిషయమై చేనేకృషి మంత్రిగారి ఉపన్యాసంలోకాని వివరాలలోకాని ఎక్కడా లేదు. Cement factories గురించి చెప్పారు. సంతోషించదగిన విషయమే. ఎవరూ పనికిరావని వదిలిన పరిశ్రమలను ప్రభుత్వం public sector లోనికి తీసుకొని దానిని subsidise చేసి లాభాలు రావడంలేదు. కాబట్టి చాలించుకుంటున్నామని చెబుతున్నారు. ప్రభుత్వానికి ఆదాయంవచ్చే విషయాలను గురించి సక్రమంగా explore చేయడంలేదని మనవి చేస్తున్నాను. నాగార్జునసాగరు ప్రాజెక్టువద్ద సిమెంటు factory కట్టడానికి private capitalists కు licence ఇచ్చారు. 120 కోట్లు రూపాయలు ఖర్చుచేసి ఈ ప్రాజెక్టు కట్టుకుంటున్నారు. ఇందులో కొంతడబ్బును అప్పుగాతీసుకుని సిమెంటు factory కడితే 10 సంవత్సరాలలో లాభం రావడానికి వీలు ఉంటుంది. మన ప్రాజెక్టులు నిర్మించడానికి అవకాశాలు లభిస్తాయి. దీని విషయమై చాలాకాలంగా ఆందోళన జరుగుతుంది. అయినా ప్రభుత్వం ఇదమిద్ధమైన నిర్ణయం తీసుకోలేదు. Cement scarcity జాస్తిగా ఉన్నది. ఈ పరిస్థితులలో ఆంధ్రదేశంలో ఉత్పత్తి సరిపోతుందని ఊరుకునేబదులు ప్రభుత్వమే ఇటువంటి ప్రాజక్టుప్రాంతాలలోకడితే మనపనులు చురుకుగా జరగడానికి అవకాశం ఉంటుంది. దీనిని ప్రభుత్వం ఆలోచించాలని మనవి చేస్తున్నాను. రెండవ పంచవర్ష ప్రణాళికలో భారీ పరిశ్రమల విషయమై ప్రభుత్వం కృషిచేసింది. ప్రతిపక్షంకూడా హర్షించింది. రెండవ పంచవర్ష ప్రణాళిక గురించికూడా ఇటువంటిదేదైనా తెప్పించుకోవడం శోచనీయమైన విషయం. ఆంధ్రరాష్ట్రం చిన్నదే అయినా విశాలాంధ్ర దృష్టితోచూస్తే విశాలాంధ్రకు ఒక భారీపరిశ్రమ అవసరం. దానికి కావలసిన ముడివస్తువులు రెండు రాష్ట్రాలలోను లభిస్తున్నాయి. ప్రభుత్వం ఇంకా గట్టిగా కృషిచేయవలసిన అవసరం వున్నది. కేంద్ర ప్రభుత్వం నిర్లక్ష్యం చేసినందుకు విచారం చెందవలసియున్నది. దేశం మొత్తంలో జరిగే ఎరువుల వాడకంలో 1/5 వంతు ఆంధ్రదేశంలో వాడుతుంటే ఆంధ్రదేశంలో విజయవాడ ప్రాంతంలో అన్ని సౌకర్యాలు ఉన్నా ఎరువులఫాక్టరీ పెట్టడంలేదు.

తనంతకు తానైనగాని లేకపోతే ఇతర రాష్ట్రప్రభుత్వాలను చేర్చుకొనైనాగాని కేంద్రప్రభుత్వాన్ని ఈ చట్టాలను సవరించండి ఈ పద్ధతులను మార్చుకోండి, ఈ విధానాన్ని మార్చుకోకుండా పోయేటట్లయితే మా పరిశ్రమలు పెరుగవు, మా రాష్ట్రము అభివృద్ధిలోకి రావు, మా రాష్ట్రాల ఆదాయాలు పెరుగవు అని చెప్పి అడక్కపోవడం అనేదిమట్టుకు ఒక పెద్ద charge గా నేను పెట్టుతున్నాను. ఇక్కడఉండే ఈ పరిశ్రమల మంత్రినిగాని, ఈ పరిశ్రమలశాఖనుగాని, ఇతర రాష్ట్రాలలోగాని ఎందుకో ప్రయత్నాలు జరుగలేదని అడుగుతున్నాను. అందును గురించి పోయిన ప్రభుత్వము కొద్దిపాటి ప్రయత్నముచేసింది. కాని ఫలితాలు మాత్రం అనుకున్నంతగా రాలేదు ఆ ప్రయత్నాన్ని వదలక సాగించడం ఎంతమాత్రం అవసరం. ఆ ప్రయత్నాన్ని సాగించి ఇదిగో మేము ఈ పని చేసినాము, ఇతర రాష్ట్రప్రభుత్వాలు మనతో సహకరించలేదు, కాబట్టి ఈ ఫలితాలను మేము చూపలేకపోయినాము అని మన ఈ శాఖగాని, శాఖను నిర్వహించే మంత్రిగాని చెప్పే టట్టుగాఉంటే సభఅంతాకూడా ఒప్పుకోవాల్సివస్తుంది. ముఖ్యంగా ఈ Minesకు సంబంధించి కొద్దిమాటలు చెప్పదలచుకొన్నాను. కేంద్రప్రభుత్వము mineral survey చేయిస్తూవుంది. ఎప్పుడో 1908 లో ఒకసారి చేయించింది. ఈమధ్య కూడా కొంతమంది చేస్తున్నారు. ఆ mineral survey చేసే ఉద్యోగస్థులు ఎక్కడఉంటారో ఏమో తెలియదు, వస్తారు. వీళ్లు పాపము పెద్ద ఉద్యోగస్థులు. 800, 1000, 2000 రూపాయలు జీతాలు తీసేటటువంటి వీళ్లు రాష్ట్రాలకువచ్చినపుడు ఇదిగో ఇక్కడఉంది పరిశోధనలు చేయండి అనడానికి చెయించడానికి అవకాశాలు లేకుండా ఉన్నాయి. కేంద్రప్రభుత్వముమీద దీనిని ఎందుకు విడిచిపెట్టాలి రాష్ట్రప్రభుత్వమే ఈ పరిశ్రమల శాఖలక్రిందనే ప్రతి అంగుళపుభూమినికూడా రాష్ట్రములో ఎందుకు పరిశోధనచేయించకూడదు? దీంట్లో ఇంకొకటిఉంది. ఒక లేమాటవిన్నాను. ఈ మధ్య ఒక స్నేహితుడు చెప్పుతూవచ్చాడు. ఎక్కడెక్కడ ఏమేమి వస్తువులు భూమిలో దొరుకుతాయో ఈ పరిశోధనలు చేసేవాళ్ళకు ఏదైన డబ్బు ఇచ్చుకుంటే కొన్ని తెలుస్తాయని చెప్పినాడు. దీంట్లోకూడా ఒక Black market ఏర్పడింది. Industrial survey చేసే కొంతమంది ఉద్యోగస్థులనైనా, అందరిని అనడంలేదు, Industrial survey చేస్తూ ఎక్కడైనా, ఏదైనా కనబడితే దాన్ని ఎవరైనా పరిశ్రమదారుడు లేక వ్యాపారస్థుడూ పోయివాళ్లను అడుగుని వాళ్లకు భాగమిచ్చేటట్లుగాఉంటే ఇదో ఫలానితావున ఇనుముఉంది. ఫలానితావున అభ్రకంఉంది, ఫలానితావున నారఉంది అని ఇవన్నీకూడ చెప్పుతున్నారు. దీనికి సంబంధించి రాష్ట్రప్రభుత్వమే రాష్ట్రమంతటినీకూడ ప్రతి అంగుళభూమికూడ పరిశోధన చేయించాల్సని నేను మనవిచేస్తున్నాను. రెండవ విష

యము, అది చదువుల మంత్రిగారికి సంబంధించినది పాఠశాలలు ఆ సేకరిస్తున్నవి, Industrial museums అని పెట్టుతున్నారు. కాని మన రాష్ట్రంలో మన ప్రాంతంలో ఏమేమిరకరకాలయో అవిగాని ఆ భూమిలో వారికి అన్ని వస్తువులను సంబంధించిగాని sample ను ప్రతి Elementary school లో High school లో College లలో పెట్టితే చాల బాగుంటుందని నేను మనవిచేస్తున్నాను. ఆ samples అక్కడ ఉన్నట్లయితే చిన్నబిడ్డలు కావచ్చు, పెద్దవయస్సువచ్చిన విద్యార్థులు కావచ్చు, తమ తమ ప్రాంతాలలో ఆ samples ను సంబంధించినవి కనుగొంటే అవి ఆ పాఠశాలలద్వారా College ల ద్వారా ప్రభుత్వానికి తెప్పించటానికి వీలుగా ఉంటే అదే ఒక mineral survey అవుతుంది. ఇతరదేశాల్లోకూడా అలా జరుగుతుంది. ఇంగ్లండులో ఏమి జరుగుతుందంటే ప్రధానంగా విద్యార్థులను camp లను తీసుకొనిపోతే ఒక మైలో లేక రెండు మూడు చుట్టుప్రక్కల తీసుకొని వెళ్ళి ఆక్కడ ఉండే ప్రాంతాన్నంతటినికూడా పరిశోధనచేసి వారికి వింతగా కనబడే ప్రతిరాయిని ప్రతి ఇసుకనుకూడా తీసుకొనివచ్చి దాన్నివాళ్ల School authority లు శాస్త్రజ్ఞులచే పరిశోధనజేసి ఫలానవస్తువని వారు నిర్ణయంచేస్తున్నారు.

ఈ మధ్యనే కేంద్రప్రభుత్వం చెప్పింది, Monazite యిలాంటివి కొంటే ట్లయితే పెద్ద పెద్ద బహుమానాలిస్తాం అని, ఎందుకు మన రాష్ట్ర ప్రభుత్వం కూడా ఏదయినా ప్రత్యేకలోహం చూపించినట్లయితే వందో, వేయో 10 వేలో 20 వేలో లేకపోతే దాంట్లో వచ్చే లాభంలో వాటాయిస్తాం అని చెప్పి ఎందుకు ప్రకటించకూడదు. అది చేసినట్లయితే చాలా ఆకర్షణీయంగా ఉంటుందని మంత్రి గారికి మనవిచేస్తున్నాను. తరువాత Forest Department లో ఉండే ఉద్యోగస్థులు ఎప్పుడూ అడవులలో తిరుగుతూ ఉంటారు. ఈమధ్య నేను ఒక ఉద్యోగుని అడగడం జరిగింది. ఏమయ్యా తిరిగేవాళ్లు అడవులలో తిరుగుతూ ఉంటారు ఏదో సాగులమ్యే భూములలో చూస్తుంటాం ఏమయినా దొరుకుతుందేమో నని, మీ అడవులలో ఏమి దొరుకుతుందో మీకు తెలుసునా అంటే డెహ్రాడూన్ లో training అయిన Ranger లకు D.F.O. లకు కొద్దిగా తెలుస్తుంది, వాళ్ళకు యీ Minerals గురించి చెప్పడం కొద్దిగా తెలుస్తుంది కాని అక్కడుండే Watcher లకు guard లకు ప్రతి ఉద్యోగికి యీ minerals ఎట్లా ఉంటాయో samples యిచ్చినట్లయితే అడవులలో ఎక్కడెక్కడ దొరుకుతాయో కనిపెట్టి చెప్పడానికి అవకాశం ఉంటుంది. తరువాత సోదరుడు యల్లమందారెడ్డి చెబుతూ licence తెచ్చుకోవేది పెద్ద కష్టం అన్నారు. అది యీ మధ్య కొంచం సులభంగా యిస్తున్నారు. దానికి ఫలానా చోట వస్తువు దొరుకుతుందని మీరంటే ఆ భూమిని

వృత్తి పనివారికి ఈ plan క్రింద వాళ్లను అభివృద్ధిచేయడానికి వాళ్లకు కొంత training ఇవ్వడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుంది. ఈ training ఇచ్చే సందర్భములో గ్రామసీమల్లో అవసరమైనటువంటి పనిముట్లు, బైట జరుగుతున్నటువంటి సునిసితమైన విషయాలు ఈ రెంటికికూడా సమన్వయం వచ్చేటటువంటి పద్ధతులలో training ఇవ్వాలి. లేకపోతే కేవలము పట్టణవాసాల్లోలాగ కుర్చీలు ఇలాంటివాటికి training ఇచ్చినట్లయితే గ్రామసీమలలో వ్యవసాయానికి కావలసిన పనిముట్లు మొదలైనవాటికి అవకాశము లేకుండా మనముచేసిన కృషి వృధా అవుతుంది. అందువల్ల గ్రామాలలో కావలసిన అవసరాలనూ ఇక్కడ మనకున్నటువంటి పనినేర్పరితనమున్నూ ఈ రెంటికీకూడా సమన్వయంచేసి ఆరకంగా వృత్తి పనివారలకు, కుమ్మరులు, వడ్రంగులు, కమ్మరులు ఈలాంటి వారికి తగుమైన తరిఫీదు ఇవ్వటమేకాకుండా వారికి కావలసిన పనిముట్లుకూడా మనము సక్రమమైన విధానములో సహాయముచేసినట్లయితే వారికెంతో మేలు చేసకూర్చినట్లు అవుతుంది. ఇకపోతే చెప్పులుకుట్టే వార్ల విషయం చాలా సార్లు వచ్చింది. ఇందులో ముఖ్యంగా నెల్లూరు జిల్లాలో dry areas లో ఈ చెప్పులు కుట్టేవృత్తి చాల అవసరంగా ఉంటున్నది. అందువల్ల వీరికి ప్రధానంగా కావలసిన ముడివస్తువు చర్మమన్నమాట. ఈ చర్మముదొరకక బహుకాలమునుంచి చాల బాధపడుతున్నారు. అందువల్ల ఈ చర్మాలు ఊరవేసినవాడు చదునుచేయడమే కాకుండా వాటిని సరియైన ధరలకు ఈ చర్మాగారాల వృత్తి వారికి, ముఖ్యంగా dry areas లో, supply చేసినప్పుడే అక్కడ కావలసినటువంటి వ్యవసాయానికిగాని, రైతాంగానికి చెప్పులకుగాని సరియైన సహాయముచేసిన వారవుతాము. అందువల్ల ఈ విషయమై co-operative society ల ద్వారా కానీయండి వేరే మార్గాలద్వారా కానీయండి ఈ ఉన్నటువంటి చర్మాలను కావలసినటువంటి వృత్తి పనివార్లకు సక్రమమైన ధరలకు supply చేసేదానికి ప్రభుత్వం తగుచర్యలు తీసుకోవాల్సిన అవసరం ఉందని నేను మనవిచేస్తున్నాను.

SRI P. THIMMA REDDI :—అధ్యక్షా! ఈ శాఖను నిర్వహించేది కళా వెంకటరావుగారు కాబట్టి ఈ శాఖను గురించి ప్రభుత్వము అశ్రద్ధచేసి ఉంటుందని చెప్పేదానికి అవకాశము లేదు. ఈ శాఖలను నిర్వహించడం అంటే ఇది ఒక తమాషా పని అనుకోవచ్చు. కాసింత రుచిచూడని శాసన సభ్యులుకాని దూరంగా ఉండే ప్రజలుగాని వీళ్లు Dictators కదా, వీళ్లు చేయలేని పని ఉంటుందా, వీళ్లు ఉత్తరువులు ఇస్తే పనులు జరుగవా, అనే భ్రమ మాత్రం పెట్టు [illegible] మంచిదికాదని మట్టుకు నేను చెప్పతున్నాను. వెంకటేశ్వర్లుగారికి

ఎక్కడైనా ఈ దేశంలో కొంత కాలంఅయినా కమ్యూనిస్టులుకూడా ప్రభుత్వాన్ని నడిపే అవకాశం దొరికితే అప్పుడు వీళ్ళ సంగతి తెలుస్తుంది, ఎంతమట్టుకు చేస్తారు, ఎంతమట్టుకు చేయలేరని. ఇద్ది చూడండి అని అంటూను వెంకటేశ్వర్లు. కాని ఇస్తే పిచ్చోడిచేతికి కత్తి ఇచ్చినట్టు అవుతుందేమో అని అనుమానంకూడా ఉన్నది. అందువల్ల ఈ సభలో వెంకట్రావుగారు కొన్ని సౌభాగ్యాలను చూపినారు. అన్ని శాఖలకంటే ఎక్కువగా ఈపరిశ్రమలను సంబంధించే పత్రికల్లో మనమెప్పుడు చూచినా చదువుతుంటాము. ఆయన చెప్పగలిగినవి కూడా పరిశ్రమలను గురించి ఎక్కువగా రాజమండ్రి పేపరు మిల్లు గురించి సామాను సిరామిక్స్ను గురించి. అంతకంటే ప్రభుత్వం తానుగా పెట్టుబడి పెట్టి నిర్వహించు గలిగిన పరిశ్రమలేమి ప్రభుత్వం చేతిలోలేవు. అయినను తాను మనందరికి పంపించేసిన note లోనే ఉంది. పెద్ద పరిశ్రమలన్ని కేంద్ర ప్రభుత్వం చేతిలోఉన్నాయి. ఏదో సన్నసన్నపరిశ్రమలు,చేతిపరిశ్రమలు అ సేవాటిని రాష్ట్రప్రభుత్వం నిర్వహిస్తుంది దానికి అవకాశాలు చూస్తామా! ఆయన noteలో మొట్టమొదటి పేరాగ్రాఫ్ కడపటి వాక్యంలోనేఉంది. రాష్ట్రంలో అన్నిపరిస్థితులు అన్ని, అవకాశాలు అనుకూలంగా ఉన్నాయి కాని మనకు లేనిదేమిటంటే పెట్టుబడి అని, పెట్టుబడిఉన్నా కూడా దాన్ని ప్రయత్నంచేసే మనుష్యులు లేకపోవడం గురించి ప్రభుత్వం ఏమి చేయగలదు అనే విషయాన్ని మీకు మనవిచేస్తున్నాను. ప్రధానంగా ఈ దినము ఇక్కడ మాట్లాడవలసిన విషయాల్లో Cottage industries కు సంబంధించిగాని Handlooms కు సంబంధించిగాని Authoritative గా మాట్లాడగలిగిన వ్యక్తులు ఇద్దరున్నారు. వారు ప్రగడ కోటయ్య, సందా నారాయణప్ప. మిగతా విషయాలు సంబంధించికూడ కొంతమంది స్నేహితులు మాట్లాడే దానికి అవకాశంఉంది. ధర్మవరం పట్టు పరిశ్రమఉంది. ఆ పట్టుపరిశ్రమ హిందూపురం తాలూకాలో ఇప్పుడిప్పుడే గట్టిపునాదులతో ముందుకు వస్తావుంది. దాన్నిగురించి ఏదైనా మన సుబ్బారావు గారు చెప్పేటట్టుగాఉంటే ఆ విషయాలను మిగతా సభ్యులుకూడా వినగల్గుతారు. నేను మాట్లాడదలచుకొన్నది Mines గురించి. అందు విషయమై ఒక్కవిషయము మట్టుకు మనవిచేస్తున్నాను మీద్వారా సోదరసభ్యులకు. రాష్ట్రప్రభుత్వము కేంద్రప్రభుత్వ సంబంధాలతో చేయవలసిన పనిని చేయడంలేదని నా మనవి. కేంద్ర ప్రభుత్వంవారికి తోచినవిధంగా వారి అవసరాలనుబట్టి వారిమీదఉండే ఒత్తిడిని బట్టి కొన్ని చట్టాలు చేసిపెట్టారు. ఈ చట్టాలప్రకారం రాష్ట్రప్రభుత్వాలు నడుచుకోవాల్సిందని చేసిపెట్టారు. కాని రాష్ట్రప్రభుత్వాలకు అది యుక్తంగా లేకపోవచ్చు, రాష్ట్రప్రభుత్వంయొక్క ఆదాయాలను పెంచుకునేదానికి ఉపయుక్తంగా లేకపోవచ్చు, రాష్ట్రంలో పరిశ్రమలను పెంచేదానికి అవకాశం ఇవ్వకపోవచ్చు రాష్ట్రప్రభుత్వము

Sri P. Thimma Reddi] [23rd March 1956

తనంతకు తానైనగాని లేకపోతే ఇతర రాష్ట్రప్రభుత్వాలను చేర్చుకొనైనాగాని కేంద్రప్రభుత్వాన్ని ఈ చట్టాలను సవరించండి ఈ పద్ధతులను మార్చుకోండి, ఈ విధానాన్ని మార్చుకోకుండా పోయేటట్లయితే మా పరిశ్రమలు పెరగవు, మా రాష్ట్రము అభివృద్ధిలోకి రావు, మా రాష్ట్రాల ఆదాయాలు పెరగవు అనిచెప్పి అడక్కపోవడం అనేదిమట్టుకు ఒక పెద్ద charge గా నేను పెట్టుతున్నాను. ఇక్కడఉంటే ఈ పరిశ్రమల మంత్రినిగాని, ఈ పరిశ్రమలశాఖనుగాని, ఇతర రాష్ట్రాలలోగాని ఎందుకొ ప్రయత్నాలు జరగలేదని అడుగుతున్నాను. అందును గురించి పోయిన ప్రభుత్వము కొద్దిపాటి ప్రయత్నముచేసింది. కానీ ఫలితాలు మాత్రం అనుకున్నంతగారాలేదు ఆ ప్రయత్నాన్ని వదలక సాగించడం ఎంతమాత్రం అవసరం ఆ ప్రయత్నాన్ని సాగించి ఇదిగో మేము ఈ పని చేసినాము, ఇతర రాష్ట్రప్రభుత్వాలు మనతో సహకరించలేదు, కాబట్టి ఈ ఫలితాలను మేము చూపలేకపోయినాము అని మన ఈ శాఖగాని, శాఖను నిర్వహించే మంత్రిగాని చెప్పేటట్టుగాఉంటే సభఅంతాకూడా ఒప్పుకోవాల్సివస్తుంది. ముఖ్యంగా ఈ Minesకు సంబంధించి కొద్దిమాటలు చెప్పదలచుకొన్నాను. కేంద్రప్రభుత్వము mineral survey చేయిస్తూవుంది. ఎప్పుడో 1908 లో ఒకసారి చేయించింది. ఈమధ్య కూడా కొంతమంది చేస్తున్నారు. ఆ mineral survey చేసే ఉద్యోగస్థులు ఎక్కడఉంటారో ఏమో తెలియదు, వస్తారు. వీళ్లు పాపము పెద్ద ఉద్యోగస్థులు. 800, 1000, 2000 రూపాయలు జీతాలు తీసేటటువంటి వీళ్లు రాష్ట్రాలకువచ్చినపుడు ఇదిగో ఇక్కడఉంది పరిశోధనలు చేయండి అనడానికి చెయించడానికి అవకాశాలు లేకుండా ఉన్నాయి. కేంద్రప్రభుత్వముమీద దీనిని ఎందుకు విడిచిపెట్టాలి రాష్ట్రప్రభుత్వమే ఈ పరిశ్రమల శాఖలక్రిందనే ప్రతి అంగుళపుభూమినికూడా రాష్ట్రములో ఎందుకు పరిశోధనచేయించకూడదు? దీంట్లో ఇంకొకటిఉంది. ఒక తమాషావిన్నాను. ఈ మధ్య ఒక స్నేహితుడు చెప్పుతూవచ్చాడు. ఎక్కడెక్కడ ఏమేమి వస్తువులు భూమిలో దొరకుతాయో ఈ పరిశోధనలు చేసేవాళ్ళకు ఏదైన డబ్బు ఇచ్చుకుంటే కొన్ని తెలుస్తాయని చెప్పినాడు. దీంట్లోకూడా ఒక Black market ఏర్పడింది. Industrial survey చేసే కొంతమంది ఉద్యోగస్థులనైనా, అందరిని అనడంలేదు, Industrial survey చేస్తూ ఎక్కడైనా, ఏదైనా కనబడితే దాన్ని ఎవరైనా పరిశ్రమదారుడు లేక వ్యాపారస్థుడూ పోయివాళ్లను అడుగుని వాళ్లకు భాగమిచ్చేటట్టుగాఉంటే ఇదో ఫలానితావున ఇనుముఉంది. ఫలానితావున అభ్రకంఉంది, ఫలానితావున నారఉంది అని ఇవన్నికూడ చెప్పుతున్నారు. దీనికి సంబంధించి రాష్ట్రప్రభుత్వమే రాష్ట్రమంతటినీకూడ ప్రతి [illegible]కూడ పరిశోధన చేయించాలని నేను మనవిచేస్తున్నాను, రెండవ విష

యము, అది చదువుల మంత్రిగారికి సంబంధించినది పారశాలలు అనేకముఉన్నవి, Industrial museums అని పెట్టుతున్నారు. కాని మన రాష్ట్రంలో మన ప్రాంతంలో ఏమేమిరకు రకరకాలయో అవిగాని ఆ భూమిలో దొరికే అన్నివస్తువులకు సంబంధించిగాని sample ను ప్రతి Elementary school'లో High school'లో College లలో పెట్టితే చాల బాగుంటుందని నేను మనవిచేస్తున్నాను. ఆ samples అక్కడ ఉన్నట్లయితే చిన్నబిడ్డలు కావచ్చు, పెద్దవయస్సువచ్చిన విద్యార్థులు కావచ్చు, తమ తమ ప్రాంతాలలో ఆ samples కు సంబంధించినవి కనబడితే అవి ఆ పారశాలలద్వారా College ల ద్వారా ప్రభుత్వానికి చెప్పేటట్టుగాఉంటే అదే ఒక mineral survey అవుతుంది. ఇతరదేశాల్లోకూడా అలా జరుగుతుంది. ఇంగ్లండులో ఏమి జరుగుతుందంటే ప్రధానంగా విద్యార్థులను camp లకు తీసుకు పోతే ఒక మైలులో లేక రెండు మూడు చదరపుమైళ్లలో తీసుకువెళ్ళి అక్కడఉండే ప్రాంతాన్నంతటినీకూడా పరిశోధనచేసి వారికి వింతగా కనబడే ప్రతిరాయినీ ప్రతి ఇసుకనుకూడా తీసుకొనివచ్చి దాన్నివాళ్ల School authority ల కిస్తే దాన్ని పరిశోధనజేసి ఫలానవస్తువని వారు నిర్ణయంచేస్తున్నారు.

ఈ మధ్యనే కేంద్రప్రభుత్వం చెప్పింది, Monazite యిలాంటివి దొరికే టట్లయితే పెద్ద పెద్ద బహుమానాలిస్తాం అని, ఎందుకు మన రాష్ట్ర ప్రభుత్వం కూడా ఏదయినా ప్రత్యేకలోహం చూపించినట్లయితే వందో, వేయో 10 వేలో 20 వేలో లేకపోతే దాంట్లో వచ్చే లాభంలో వాటాయిస్తాం అని చెప్పి ఎందుకు ప్రకటించకూడదు. అది చేసినట్లయితే చాలా ఆకర్షణీయంగా ఉంటుందని మంత్రి గారికి మనవిచేస్తున్నాను. తరువాత Forest Department లో ఉండే ఉద్యోగస్థులు ఎప్పుడూ అడవులలో తిరుగుతూ ఉంటారు. ఈమధ్య నేను ఒక ఉద్యోగుని అడగడం జరిగింది. ఏమయ్యా తిరిగేవాళ్లు అడవుల్లో తిరుగుతూ ఉంటారు ఏదో సాగులమ్యే భూములలో చూస్తుంటాం ఏమయినా దొరుకుతుందేమో నని, మీఅడవులలో ఏమి దొరుకుతుందో మీకు తెలుసునా అంటే డెహ్రాడూన్ లో training అయిన Ranger లకు D.F.O. లకు కొద్దిగా తెలుస్తుంది, వాళ్ళకు యీ Minerals గురించి చెప్పడం కొద్దిగా తెలుస్తుంది కాని అక్కడుండే watcher లకు guard లకు ప్రతి ఉద్యోగికి యీ minerals ఎట్లా ఉంటాయో samples యిచ్చినట్లయితే అడవులలో ఎక్కడెక్కడ దొరుకుతాయో కనిపెట్టి చెప్పడానికి అవకాశం ఉంటుంది. తరువాత సోదరుడు యల్లమందారెడ్డి చెబుతూ licence తెచ్చుకోనేది పెద్ద కష్టం అన్నారు. అది యీ మధ్య కొంచం సులభంగా యిస్తున్నారు. దానికి ఫలానా చోట వస్తువు దొరుకుతుందని మీరంటే ఆ భూమిని

నిర్ణయించడం అంతా ఉంటుంది. దానికి ఆరు నెలలకు, సంవత్సరం రెండేళ్లు పట్టిన పరిస్థితులున్నాయి. మంత్రిగారికి విరామంలేరికి ఒకతూరి వచ్చిన తరువాత యీ minerals త్రవ్వేవారి conference ఒకటి పెట్టి, "applications పెట్టిన ఎన్నాళ్లకు, licence వచ్చింది? Licence వచ్చినతరువాత ఫలానా తావున భూమి survey చేసి యిమ్మంటే ఎన్నాళ్ళకు రెండో licence వచ్చింది?" అని అడగండి. ఈ మధ్యనే విశాఖపట్నం, శ్రీకాకుళం స్నేహితులు, వచ్చినారు. Manganese పరిశ్రమ చేసేవాళ్లు. వాళ్లు ఏడ్వడంఒకటే కొరత. వాళ్లు చదువుకున్న వాళ్లు కనుక, ఏడ్వలేకుండా ఏడుస్తూ చెప్పారు. ఈ ప్రభుత్వంలో ఏమిచేసేది? మేము డబ్బు యిస్తాం మీకు. మాకు వెంటవెంటనే licences కు permissions వచ్చినట్లయితే త్రవ్వి ఎగుమతి చేసేదానికి వీలుంటుంది, Contracts enter అవుతూ వుంటాము. 6 నెలలో ఇన్ని వేల టన్నులు యిస్తాం అంటే అన్ని వేల టన్నులు యివ్వకుండా పోతే additional cost కట్టవలసివస్తుంది. దివాలా ఎత్తుతున్నాం. వెంటనే permission యిమ్మంటే యివ్వకుండా చంపుతున్నారు. ఎవరు దిక్కు.

THE HON. SRI K. VENKATA RAO :—Manganese విశాఖపట్నంలోనూ శ్రీకాకుళంలోనూ దొరుకుతుంది. అక్కడ ఎక్కువ area inam గ్రామాలలో వున్నది. Rights గురించి Inam గ్రామములలో 20 మంది దెబ్బలాడుతుంటారు. అవి Government inams అయినా ప్రతివాడూ Courtకు వెళ్లి Writ వేస్తుంటాడు. అందుచేత జరుగుతుందిగాని export కు వెళ్ళేటటువంటి mines లో ఆలస్యం చేయకుండా చేస్తున్నాం. ఇప్పుడు కష్టం ఉంటుందనుకోను. ఇలాంటి తగువులుండి legal matters ఏమీ చేయలేకపోతున్నాం.

SRI P. THIMMA REDDI :—అలాంటి తగువులుండడం నిజమే. దానినిగురించికూడా వాళ్లను పరిశీలన చేసినప్పుడు విన్నాను. విశాఖపట్నంలో manganese కు సంబంధించి ఒక Deputy Collector నో, లేకపోతే Senior Tahasildar నో, లేకపోతే ఒక I.A.S. Officer నో వేసి ఆ Officer కు అయ్యే ఖర్చుకు mines చేసే వాళ్లను భరించమంటే భరించడానికి సిద్ధంగా ఉన్నారని ప్రభుత్వంవారికి అక్కడ వ్యాపారం చేసేవారి తరఫున మనవిచేస్తున్నాను. అంతే కాని మామూలుగా ఉంటే Collector ను వేస్తే మారు పనులలో వుంటే ఆయనకు నూటొక్క పనవుతుంది ఇది చూడడం. ఏదయినా Tahasildarకు పోయి ఫలానా field survey చేయ్యాలంటే, వాడు నా duties చాలా ఉన్నాయి, యీ దినం [illegible] మంత్రి వస్తున్నాడు, మంత్రివస్తున్నాడు అని చెప్పి వాళ్ళ duties వాళ్లు

23rd March 1956] [Sri P. Thimma Reddi

చేయలేకుండా ఉన్నారు. అందుచేత ప్రత్యేక ఉద్యోగస్థుని వేయాలని మనవి చేస్తున్నాను. ఇంకో విషయం, మంత్రిగారి చెవి యిట్లా పెట్టమని అడుగుతున్నాను. Iron ore export అవుతున్నది. Mica త్రవ్వుతున్నారు. Export అయ్యే iron ore మీద త్రవ్వే మైకామీద కొంత సుంకం వస్తుంది. ఆ సుంకం సక్రమంగా వస్తున్నదా? అని నేను అడుగుతున్నాను. గడచిన ప్రభుత్వంలో ఒక సభ జరిగింది. పెద్దపెద్ద ఆఫీసర్ల సభకూడా జరిగింది అక్కడ యీ ప్రశ్న అడిగినాను నేను వస్తున్నదా? అంటే రాలేదని ఆఫీసర్లు బయటపడి చెప్పినారు వాళ్లను బయట వేయడం కాదు. అదిసరిగా వసూలు కావడంలేదు. అంటేదానికి అనేకమైన కారణాలున్నాయి. ఈదినం ఆంధ్రదేశంలోనుంచి ఎగుమతయ్యే iron ore కాకినాడనుంచి బందరునుంచి విశాఖపట్నంనుంచి లేకపోతే యీ ప్రాంతంలోనికి Madras ద్వారా export అవుతున్నది. అక్కడ shipping accounts చూస్తే ఎన్నివేల ton లు export అయినదీ మనకు తెలుస్తుంది. కాని ఎన్నివేల టన్నులు ఆంధ్రదేశంనుంచి export అయ్యేముందు Iron ore మీద రావలసిన సీనియరేజి అనండి. Royalty అనండి ప్రభుత్వానికి వచ్చిందా అని నేను సూటిప్రశ్న వేస్తున్నాను. ప్రభుత్వంవారు దానికి జవాబు చెప్పలేరు. విచారణచేయించుకోవలసిన అగత్యం ఉన్నదని నేను మనవిచేస్తున్నాను. ఏదో ఒక జవాబు చెప్పవచ్చు. తరువాత మైకాకు సంబంధించినది. మైకావిషయం బ్రహ్మాండమైనది. ఆంధ్రదేశంనుంచి ఒక Scandalous affair ఏదయినా ఉన్నదంటే అది మైకాకు సంబంధించి నెల్లూరుజిల్లాలో కనపడుతుంది. ఎందుకంటారా అక్కడ త్రవ్వే మైకాకు ప్రభుత్వానికి రావలసినపన్ను రావడంలేదు. స్వాయంత్రంవరకు త్రవ్వుతూనే ఉన్నారు. త్రవ్వినవాడే అమ్మకం చేసినట్లయితే Incometax 93% పడుతుందని చెప్పి పంపకంచేస్తున్నారు.

రాత్రి వ్యాపారం జరుగుతున్నది. మబ్బువ్యాపారం జరుగుతున్నది, యీ మైకాలో అని మనవిచేస్తున్నాను. ప్రభుత్వానికి రావలసిన పన్నే రావడంలేదు. నేను దానినిగురించికూడా వివరాలు కొంతమందిని అడిగాను. మామూలుగా 8 pounds మైకా భూమిలోనుంచి త్రవ్వితే కనీసం దాదాపు 2 pounds ఎగుమతికి తయారవుతుంది. కాని ఎగుమతయ్యే మైకాకంటె త్రవ్వేమైకా తక్కువగా కనపడుతుంది. అదనపుమైకా ఆకాశంనుంచి ఊడిపడిందా? 2 pounds త్రవ్విన లెక్కకు వస్తుంది. 8 pounds ఎగుమతి అయినట్లు లెక్కకువస్తుంది. ఎక్కడ యీ మోసం, ఎక్కడ యీ దగా, ఎక్కడ యీ తంత్రం జరుగుతుంది? విచారణచేయవలసినదని మనవిచేస్తున్నాను. ఎందుకంటారా మంత్రులుగారున్నప్పుడు

ఎవరికి ఏమి తెలుసును. ఏమి తెలియదు. ఒకరిని గుప్పున తీసుకువచ్చి ఒక శాఖ మీద పడేయాల్సివస్తుంది ఆ శాఖలోవుండే విషయాలు తెలుసుకోడానికి 2 సంవత్సరాలు పడుతుంది. కాని వెంకట్రావుగారి విషయంలో అట్లాకాదు. ఆయన మంత్రి అయిన మరుమాసంలోనే ఆయన చర్చచేస్తుంటే Industries లో పెద్ద షావుకార్లతో ఎవరితోకూడ సంబంధం లేనటువంటి ఆయన, వాటాలుకూడా లేనటువంటి మనిషి, బంధువులద్వారాకూడా వాటాలేని మనిషి. ఆయనకు పరిశ్రమల గురించి యింత ఎట్లా తెలిసినదని ఆశ్చర్యంవేసినది. మేధావి కాబట్టి అవి తెలుసుకున్నాడు. ఆయనదగ్గర ఆ గ్రహణశక్తి ఉన్నది. ఈ వివరాలు సంపాదించకుంటా ఉంటే ప్రభుత్వానికి నష్టంవస్తుంది.' ఇంకోవిషయం, గోపాలరెడ్డిగారు ఆదాయం చాలదంటారు. ఆదాయం చాలదంటూ ఖర్చుపెట్టడం నిలుపుకోడం అది పిసినారి తనంక్రిందికి వస్తుందేకాని ఆదాయం పెంచేనానిక్రిందకురాదు. ఆదాయం వచ్చేచోట ఆదాయం రాబట్టమని మనవిచేస్తున్నాను.

ఈదినం కడప, చిత్తూరు రెండుజిల్లాలు విచారించినాను. కృష్ణ-గుంటూరునుంచి వచ్చిన మిగతా స్నేహితులు చెబుతున్నారు. R. T. O. లు తెలిసుంటే జాబులు వ్రాశాము. ఒకరినొకరు బాధించుకున్నారు. లారీలు కావాలనిచెప్పి మా ప్రాణాలు తీస్తున్నారు.

లారీలివ్వడానికి ఎందుకు కష్టంవచ్చింది ? మాశాఖ కాదంటారా ? ఎవరి శాఖయినా సరే ప్రభుత్వం అంతా ఒకటే. ఎందుకంటే కాకాని వెంకట రత్నం అంతటిమనిషి. ఆ కాలంలో Iron man అని title యిచ్చాం, ఆయన పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారిని చూచికూడా అంత భయపడలేదుగాని - ఒకరిని చూచి భయపడే రకంకాదు-అలాంటాయన లారీలనుచూచి భయపడిపోతున్నారు. Lory లు తక్కువ కాబట్టి, trip లు తక్కువ కాబట్టి speed హెచ్చు

**MR. SPEAKER :—You can more appropriately discuss this subject on the relevant Demand.**

SRI P. THIMMA REDDI :—ఈ Iron ore బెల్లుర్తిప్రాంతంలో ఉన్నది. దాన్ని గుత్తికి తోలుతున్నారు. లారీలు తక్కువ. వచ్చే Iron ore ఎగుమతి కావడంలేదు. కృష్ణాజిల్లాలోని Iron ore అంతా బందరుకుపోవాలసి వస్తుంది. అక్కడ లారీలు కావాలి.

చిత్తూరుజిల్లాలో కాళహస్తిదగ్గర iron ore ఉన్నది. Madras కు పోవాలి. శ్రీకాకుళం, వైజాగ్ జిల్లాల Manganese, Vizag Harbour కు పోవాలి. రైళ్లలో wagons దొరకలేదు. Priorities సక్రమంగా యివ్వడంలేదు. రాష్ట్రంలో

పరిశ్రమదారులు సంవత్సరానికిన్ని వేల wagon లు కావాలని Railway శాఖను అడిగినపాపాన పోలేదు. ఆ రకంగా wagons supply చేస్తే యీ బాధ లుండేటటువంటివి కావు. రెండోది Iron ore ton 30 రూపాయలు 40రూపాయిలు అమ్మిన రోజులున్నాయి. ఈదినం 100,120 రూపాయిలవరకు పెరిగినదికాని సీనియరేజిలో మార్పురాలేదు. ప్రభుత్వానికి వచ్చేది ధరలు తగ్గినపుడు దానిని తగ్గించి, పెరిగినప్పుడు హెచ్చించే ఏర్పాటు గురించి కేంద్రప్రభుత్వంతో మన ప్రభుత్వం సంప్రదిస్తే బాగుంటుందని మనవిచేస్తున్నాను. తరువాత ఎగుమతులున్నాయి. Iron ore, Manganese, బైరైటాన్, Asbestosకు అంటే మన వ్యాపారస్తులకు marketing knowledge తెలియదు. ఏదో తీసుకుపోవడం ఆడవాళ్ళదగ్గర అప్పులు పోరికేటట్టుగావుంటే పెళ్ళికూతురు యిచ్చే కట్నం లక్ష తీసుకువెళ్ళి Iron ore అని Harbour దగ్గరకు తీసుకువచ్చి పడేయడం, ప్రభుత్వం notice యిచ్చి సీనియరేజివేస్తే కాళ్లుపట్టుకుని నిలుపుకోవడం, Steamer లో shipping space దొరకక, దొరికినప్పుడు అమ్ముకోడం, యీ రకంగా దివాలాతీస్తున్నారు. ఎందుకు ? రాష్ట్రప్రభుత్వమయినా కేంద్రప్రభుత్వం అయినా ఫలానా ఫలానా దేశాలలో యిన్ని లక్షలు టన్నులు Iron ore కు demand ఉన్నది, ఈదేశంలో యీరకంగా ధరలున్నవి, ఫలానాదేశానికి అమ్మితే ఎక్కువధర వస్తుంది అని periodical గా quarterly, Half yearly, yearly magazines ను run చేయడం మంచిదని అలా చెప్పవలసిన అగత్యం ఉన్నదని మనవిచేస్తున్నాను.

ఆంధ్రదేశములో రాతినార దొరుకుతుంది. మనదేశములో దానికి demand లేదు ఇతరదేశములలో దీనికి బాగా demand ఉన్నది. ఇతరదేశములకు ఎగుమతి చేయాలంటే, బిర్లాకు ఒక్కడికే భారతదేశం మొత్తంమీద permission ఉన్నది. గనులు త్రవ్వకునేవారు దీనిని 100 రూపాయిలు అప్మేసరుకును 20 రూపాయిలకు అట్లా వారికి అమ్ముకుంటే, వారు ఇతరదేశములలో దీనిని 100 రూపాయిలకు అమ్ముకొంటున్నారు. అందువల్ల మనరాష్ట్రమునుంచి ఎగుమతులకు మనవ్యాపారస్తులకు మన ప్రభుత్వమువారు permits సంపాదించిపెట్టాలని మనవిచేస్తున్నాను

Sugar Factory ల గురించి వెంకటరావుగారు చేస్తున్న కృషిని నేను అభినందిస్తున్నాను. ప్రతిజిల్లాకు ఒకటిచొప్పున మనకు Sugar Factory లు కావాలి. పెట్టుబడిమాత్రం లేదు. ఆస్ట్రేలియాలో ప్రభుత్వమే చక్కెరఫ్యాక్టరీలను కట్టి రైతులకు ఇచ్చి, ప్రతిటన్నుకు 2, 3 రూపాయిలు వసూలుచేస్తున్నారట. ఆవిధంగాచేస్తే దాని పెట్టుబడి అంతా ప్రభుత్వమునకే వస్తుంది. ఈ పద్ధతిని అక్కడ

Sri P. Thimma Reddi] [23rd March 1955

పంచదార ఫ్యాక్టరీలు నడుస్తున్నాయి. గడచిన 3 యేండ్లలోను 40,50 కోట్ల రూపాయిలు విలువగల చక్కెరను, ఇతరదేశములనుంచి మన ప్రభుత్వముద్వారా దిగుమతి చేసుకున్నాం. ఒక్కొక్క ఫ్యాక్టరీ నిర్మిస్తె 60, 70 లక్షల రూపాయిలకంటే ఎక్కువకాదు. ఒక్కసంవత్సరములో మనం విదేశాలనుంచి దిగుమతి చేసుకుంటున్న చక్కెర ధర పెట్టినట్లయితే 100 ఫ్యాక్టరీలు మనదేశంలో నిర్మించుకునేందుకు అవకాశము ఉన్నది. ఫ్యాక్టరీలు కట్టినందువల్ల రు 1000 లు ఆదాయమువచ్చే రైతుకు రు 2000 లు ఆదాయము వచ్చేదానికి అవకాశము ఉన్నది. కాబట్టి రైతులు గ్రాంట్సు ఇస్తేనే మేము చక్కెరఫ్యాక్టరీలు కడతాము లేకపోతే లేదు అనకుండా వెంకటరావుగారు ఆస్పత్రిలోఉన్నా, కేంద్రప్రభుత్వము వారిని వేడించాలని నేను ప్రత్యేకంగా మనవిచేస్తున్నాను.

Mica mines ను ఎందుకు వేలమువేయకూడదు, మామూలుగా వాళ్లు తీసుకునే mines ను forests ను వేలమువేస్తున్నారు. 3,4 వేలమంది వడ్డివాళ్లు ప్రొద్దున నేలేచి, గడ్డపారలు పుచ్చుకొని సాయంత్రముదాకా రోటిని పెళ్లగించి, నెత్తిన రాళ్లుమోసి, దున్నపోతులను చావగొట్టి దీనిని తెచ్చుకుని రు. 1000 లకు అమ్మితే, తిరిగి వారు 2,3,4 వేలకు అమ్ముకుంటున్నారు. ఈ గనులలో బంగారముత్రవ్వి ఎత్తుతున్నారు. నేను ఒకరిచేతులలో ఉన్నదానిని పెరుకొమ్మని చెప్పడములేదు. దానిని సక్రమముగా ఉపయోగించి దానిద్వారా ఎక్కువరాబడిని సంపాదించుకోవడానికి ప్రభుత్వము ఎందుకు ప్రయత్నముచేయదుఅని అడుగుతున్నాను ? ఆ mica mines లో జరిగే విషఫలితాలు ఎట్లా యుంటాయోకూడా ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను. ప్రభుత్వాన్ని పడద్రోసే దానికికూడా ఈ mica ఉపయోగపడింది. ఈ ప్రభుత్వాన్ని ఏమిచేస్తుందో నాకు తెలియదు. ఇప్పుడు ఏమైనా చేసినాసరే, చేయకపోయినాసరే, ఏమట్టికైనాసరే పన్నులు ఎక్కువచేసి వచ్చేవాళ్లమీద అప్పుల భారమువేస్తే వాళ్లు గోడుగోడు మంటారని, పూర్వులకు బుద్ధి ఉన్నదా లేదా అని అంటారు అని చెప్పుతున్నారు. ఆరకంగానే నేను చెప్పుతున్నాను. ఈ mica మీద సంపాదించ గలిగినంత సంపాదించే దానికి చేతగాకుండా పోతోంది. అందువల్ల ఈ ప్రభుత్వాన్ని విమర్శచేయవలసి వస్తున్నది. నిందించవలసి వస్తున్నది. కమ్యూనిష్టు సోదరులకు చెబుతున్నాను. మైకాలో మీ చేయి ఉన్నదా లేదో నాకు తెలియదు. కాని మీరు ఆవిషయములో మాట్లాడ గలిగినంతా మాట్లాడవలసినంతా మాట్లాడడములేదని చెబుతున్నాను ఈ మైకా పరిశ్రమ ఆంధ్రదేశములో కల్లా ముఖ్యమైన పరిశ్రమ. ఎక్కువ ఆదాయము [illegible]పరిశ్రమ ఎక్కువ కూలీలకు employment కల్పించే పరిశ్రమ. నెల్లూరు జిల్లా

గూడూరులో 3 మైళ్ల పొడుగున mica mines ఉన్నాయి. అక్కడ ప్రొప్రయిటర్లు, కూలివాళ్లను నానా అవస్థలు పెడుతున్నారు. అందువల్ల ప్రొప్రయిటర్లకు, కూలివాళ్లను ఒక మేనిజిమెంటుక్రిందకు తీసుకువస్తే బాగుంటుందని మనవిచేస్తున్నాను. డైరెక్టర్లుగా I.A.S. ఆఫీసర్లను, I. C. S. ఆఫీసర్లను వేస్తున్నారు. అట్లుకాకుండా ఒక సంవత్సరము private business చేస్తున్న మనుష్యులను తీసికువచ్చి, కంట్రాక్టు చేసినమీద వాళ్లకు జీతములుఇచ్చి పరిశ్రమను అభివృద్ధిపరచడానికి అవకాశాలు ఏమి ఉన్నవో తెలుసుకొని, దీనిని నడిపేదానికి మంత్రిగారు ప్రయత్నంచేస్తే బాగుంటుందని మనవిచేస్తూ ఇంతటితో సెలవుతీసుకుంటున్నాను.

SRI M. BAPAIAH CHOWDARY —అధ్యక్షా, ఈ పద్దును బలపరుస్తు కొన్ని సూచనలు చేస్తున్నాను. ఏ ప్రభుత్వంయొక్కగాని, ఏ రాష్ట్రంయొక్కగాని, ఏ దేశంయొక్కగాని, అభివృద్ధి అంతా ఈ పరిశ్రమలమీదనే ఆధారపడి ఉంటుంది.

ఇందులో రెండురకములైన పరిశ్రమలు ఉన్నాయి. పెద్ద పరిశ్రమలు, గృహపరిశ్రమలు, ఈ రెండుకూడా ఒకే శాఖక్రింద ఉండడమువల్ల గృహపరిశ్రమలలో చాలినంత attraction ఉన్నదా లేదా అనేటటువంటి, అనుమానము ఉన్నది. అందుచేత ఈ గృహపరిశ్రమలు అనేటటువంటివి, పెద్ద పరిశ్రమల డైరెక్టరుయొక్క అజ్మాయిషీనుంచి తీసివేసి, దానికోసం ఒక ప్రత్యేకమైనటువంటి బోర్డు ఏర్పాటుచేస్తే బాగుంటుందేమో ? దేశౌన్నత్యానికి, నిరుద్యోగ సమస్యలను తీర్చడానికికూడా ఈ పరిశ్రమలు ఉపయోగపడుతాయి. ప్రభుత్వము నడిపే పరిశ్రమలు ఎక్కువలేవు. 1954 సం||లో బడ్జటు ఉపన్యాసములలో ఈ డిమాండు మీదఇచ్చిన ఉపన్యాసమును ఈ రోజున ఇచ్చిన ఉపన్యాసమును పోల్చిచూచినట్లయితే ఒక్కమాట ఎక్కువగాని, తక్కువగాని చెప్పడానికి సావకాశములేదు. అసలు అభివృద్ధి జరగలేదు అనడానికి వీలులేదు. ప్రభుత్వము నడుస్తున్నంత కాలము ఏదో జరుగుతూనే ఉంటుంది. దానినే అభివృద్ధిక్రింద తీసుకున్నట్లయితే ఏమీ చెప్పనక్కరలేదు కాని ఈ ప్రభుత్వం పరిశ్రమలలో చేయగలిగినంత అభివృద్ధిచేయలేదేమో అని సూచనగా కన్పిస్తున్నది. రంగులు, రసాయన పరిశ్రమల ఉత్పత్తికి ప్రభుత్వముగాని, వ్యక్తులుగాని పోత్సహించాలి, వ్యక్తులను ప్రోత్సహించి వారికి లైసెన్సులు ఇచ్చి ప్రభుత్వం ప్రోత్సహించినట్లుగా కన్పించుటలేదు. ఇప్పుడు గృహపరిశ్రమలలో చేనేత పరిశ్రమమీద, కేంద్రప్రభుత్వము వారికిగాని, రాష్ట్రప్రభుత్వము వారికిగాని, ఉన్నటువంటి కుతూహలం మిగిలిన గృహపరిశ్రమల

మీద కన్పించడము లేదు. చేనేత పరిశ్రమలకు ఇస్తున్నటువంటి సహాయము మిగిలిన పరిశ్రమలకు కూడా ఇస్తున్నట్లు బడ్జటు వుపన్యాసములో ఎక్కడా కనుపించడము లేదు. తగినఆందోళన తీసుకురావడానికి ఆ పరిశ్రమలు నడిపేవారికి తగిన backing లేదు. ఆందోళన లేదు. అందువల్ల వాటిని ఎక్కువగా ప్రోత్సహించడము లేదు. ఈ నాడు చేనేతపరిశ్రమకు ఎంతో ప్రోత్సాహము ఇస్తున్నారు. ఇంకా ఎక్కువగా దానికి ప్రోత్సాహము ఇస్తూ మిగిలిన చిన్న పరిశ్రమలకుకూడా ప్రోత్సాహము ఇవ్వ వలసినదిగా నేను కోరుతున్నాను.

పంచదార మిల్లులు చాలా పెడుతున్నారు. చుండూరు పంచదారమిల్లు విషయంలో ఒక ఉప ప్రశ్న అడిగితే రైతులు కావలసినంత contribution తేలేదు అన్నారు. Report లో చూస్తే సరియైన ఏకరేజ్ లేదన్నారు. ఈ విషయం సరిగా బోధపడడం లేదు. మొదట కొంతడబ్బు వసూలు చేయమన్నారు. తరువాత అది చాలదు, ఇంకా వసూలుచేయమన్నట్లు తెలుస్తున్నది. ఈ రోజున వారు డబ్బు వసూలుచేయుటకు కుతూహలంగా వున్నారు. అక్కడ కొన్ని గ్రూపులు ఏర్పడి, కో-ఆపరేటివ్ రిజిస్ట్రారు గారు ఇంతవరకు ఆ డైరెక్టర్ల పేర్లు నమోదుచేయ లేదు. ప్రకటించ లేదు. ఆవిషయమును మంత్రిగారు విచారించాలని మనవి చేస్తున్నాను. చుండూరు ప్రాంతములో మంచి మాగాణిభూమివున్నది. అందులో చెరకుపంటపండించవచ్చును. అక్కడ పంచదార తయారుచేయుటకు వీలైనన్ని చెరుకు తోటలు పెంచవచ్చును. అక్కడి factory ని గురించి మన ప్రభుత్వంవారు కేంద్రప్రభుత్వమునకు వ్రాసి అక్కడనుంచి ధనసహాయం కల్గేటట్లుగా చేయాలని కోరుతున్నాను.

గుంటూరు జిల్లాలోని రెంటచింతల గ్రామంలో మంచి పాలరాయి దొరకు తుంది: ఆ రాళ్లు అనేకమైన రంగులతో, అమోఘమైన చక్కదనంతో కళకళ లాడుతూ ఉంటాయి ఈరోజువరకు కేతలిక్ మిషనరీవారు ఇద్దరినో, ముగ్గురినో కూలీలను పెట్టి చదునచేయించి దానిని ఒక చేతిపరిశ్రమగా చేయుటలేదు. ప్రభుత్వం గాని, ప్రజలుగాని దానిని చేయుటకు పూనుకోలేదు. ఈ పరిశ్రమను చేసినట్లయితే చాలా లాభదాయకంగా ఉంటుంది. ఆంధ్రరాష్ట్రములోకెల్ల మంచిపరిశ్రమయని పేరుగాంచ గలదు ఈ Industries ను గురించి నేను మాట్లాడుతాననుకోలేదు. ఈమాటు సమావేశమునకు నేను వచ్చేటప్పుడు అక్కడ వున్నటువంటి కొన్ని మంచి పాలరాళ్లను తీసుకొనివచ్చి అందరికీ చూపించెదను. అక్కడకు విద్యుచ్ఛక్తికూడా వస్తున్నది. ప్రభుత్వంవారు Marble stone Industry ని స్థాపించాలని కోరుతున్నాను. అక్కడ కొన్నివందల కొండలు పాలరాతితో నిండివున్నాయి

23rd March 1956] [Sri M. Bapaiah Chowdary

అందుచేత ప్రభుత్వమువారు ప్రత్యేకశ్రద్ధ వహించి అక్కడ పాలరాతి పరిశ్రమను స్థాపించవలసినదిగా కోరుతున్నాను

తుమ్మడుకూరులో జరగేవిషయమునుగూర్చి మిత్రులు ఇందాక ఏదో చెప్ప బోయి మళ్ళీ మానేశారు. Best & Co., దగ్గరకు చాలామందివచ్చి చూసిపో తున్నారు అక్కడ చాలా ఇనుము దొరుకుతుంది అంటున్నారు. ఆ Best & Co., వారికి permission ఇచ్చినారో లేదో నాకు తెలియదు Permission ఇవ్వ డమనేది ప్రభుత్వమువారి ఆలోచనలో వున్నదనుకుంటున్నాను Best & co., వారికి ఇచ్చినా, ఎవరికి ఇచ్చినా మాకు ఏమీ అభ్యంతరం లేదు మా తాలూ కాలో ఎవ్వరికీ నిర్వహించగల శక్తిలేదు ఎవరికిచ్చినప్పటికీ ఆ పరిశ్రమనుమాత్రం వృద్ధిచేయాలని కోరుతున్నాను అక్కడ 1942 వ సంవత్సరంలో చేసిన పరి శోధనలవల్ల by-products గా రాగి, గంధకం కూడ దొరుకుతాయని తెలుస్తున్నది. రాగి, గంధకం ప్రత్యేకంగా ఇతరచోట్ల దొరకనివస్తువులు ఇక్కడ iron contents తక్కువైనప్పటికీనికూడ రాగి, గంధకముల కొరకైనా permission ఇవ్వాలని ప్రభుత్వమునకు విజ్ఞప్తి చేస్తున్నాను ఈ పరిశ్రమల విషయంలో మంత్రి గారు మాట్లాడుతూ "నేను కళావాడినైనప్పటికినీ కలవాడినికాను" అన్నారు. ఈ రోజున కళలు చాలా వెనుకబడి ఉన్నాయి శిల్పకళలను వృద్ధిచేయాలని నేను కోరుతున్నాను.

MR. SPEAKER:—మీరు ఇప్పుడు కవిత్వం చెప్పుటకు అవకాశం లేదండీ.

SRI M. BAPAIAH CHOWDARY.—నాకు కవిత్వం రాదు. వారు చెప్పినదానినిబట్టి ఏదో అల్లుదామనుకున్నాను. కాని అది మధ్యలో fail అయింది.

ఇప్పుడు కంసాలులు, వడ్రంగులు వారుచేసేపనికి తగినఫలితం దొరకుట లేదు. వారికి తగిన కూలీలభించేటట్లుచేసి ఇటువంటి కళలను ప్రోత్సహించుటకు తగిన శ్రద్ధ తీసుకోవాలని మనవి చేయుచున్నాను.

SRI N. C. CHENGALRAYA NAIDU :—అధ్యక్షా! ఈనాడు మంత్రిగారు ప్రవేశపెట్టిన Demand ను నేను బలపరుస్తున్నాను. క్రొత్తగా సిమెంటుఫ్యాక్టరీలను, నూలుమిల్లులను పెట్టబోతున్నామని వారు వ్రాతమూలకంగా ఇచ్చిన explanation లో ఉన్నది. Sugar factories కూడా పెడతా మన్నారు. ప్రభుత్వసహాయం లేకపోతే ఇవన్నీ కాగితాలమీదనే నిలిచిపోతాయని నేను అనుకొంటున్నాను. వారు ఇచ్చిన conditions ఇటువంటి అనుమానమును కల్గజేస్తున్నాయి. Co-operative sugar factories గా ఉండాలనే condi-

Sri N. P. Chengalraya Naidu] [23rd March 1956

tions పెట్టినారు. మొట్టమొదట 10 లక్షల రూపాయలసొమ్ము ప్రజలు వసూలు చేసిఇస్తే మిగతా డబ్బులో Central Government వారు కొంత, Industrial Corporation వారు కొంచెము ఇస్తామన్నారు. మరల ప్రజలు ఇంకో 4 లక్షలు ఇవ్వాలన్నారు. ఇటువంటి conditions పెట్టినట్లయితే ఒక co-operative sugar factory కూడ అమలులోకిరాదని నేను అనుకొంటున్నాను. ఈ 5 సంవత్సరముల Plan 5 కాగితములమీద నిలిచిపోతుంది.

Cement factories పెడతామన్నారు. ప్రభుత్వంవారు ఆ కంపెనీలకు కావలసిన మిషనరీ తెప్పించుటలోగాని, కంపెనీలను register చేసుకొనుటకుగాని సహాయం చేయకపోయినట్లయితే Sugar factory లకు పట్టినగతే వీటికికూడ పడుతుందని నా నమ్మకం. ఇప్పుడు Cottage Industries కు 26 లక్షల రూపాయలు కేటాయించారు. ఇది చాలా సంతోషించవలసిన విషయం. ఇప్పుడు మన ప్రభుత్వంలోఉన్న Industries Department వారు Cottage Industries అంటే ఈతాకుల చాపలుఅల్లుట, మామిడి ఆకులబుట్టలు అల్లడం అనుకుంటారు.

ఈ Block Development Blocks లోగాని N. E. S. Schemes లోగాని అవి ఎట్లా పనిచేస్తున్నారో మనము చూస్తున్నాము. Cottage Industries వారు ఏమేమిపనులు చేస్తున్నారో ప్రతినెలా చదువుతారు. అందులో ఈత చాపలు తయారుచేశాము. ఈతఆకులతో బుట్టలు తయారుచేశాము. అని చదువుతారు. ఈ Industries Department వారికి ఇవి రెండూతప్ప ఇంకేమీ గోచరించవు. ఈ విధంగా జరిగినట్లయితే కేటాయించిన 26 లక్షలు దండుగేనని నా అభిప్రాయం మనం క్రొత్తపద్ధతులలో క్రొత్త Cottage Industriesను చేసుకోవాలి. Soap manufacturing, ink manufacturing, Fountain pens manufacturing ఇటువంటివి చేసుకొనుటకు మనం ప్రయత్నించాలి. అంతేకాని ఈ ఈతాకుల బుట్టలు ఎందుకు ? ఇవి ఇప్పుడు అందరకూ తెలుసు ఈ పాతపద్ధతులను వదలిపెట్టి గ్రామాలలో నవీనపద్ధతులతో పనిచేసేటట్లు చేస్తారని ఆశిస్తున్నాను ఈ 26 లక్షలు సక్రమంగా ఖర్చుపెట్టి Cottage Industries ను అభివృద్ధిచేయవలసియున్నది. ఇప్పుడు జపాన్‌లోకూడ Cottage Industries ఉన్నాయి. మనం ఈ విషయంలో వారిదగ్గరనుంచి నేర్చుకొనవలసిన విషయములు చాలా ఉన్నాయి. అందుచేత ఇక్కడఉన్నటువంటి మంచి తెలివిగల ఉద్యోగస్థులను జపానుకు పంపించి అక్కడి పద్ధతులు నేర్చుకొనివచ్చిన తరువాత ఇక్కడకూడ నవీనపద్ధతులలో ఏదైనా తయారుచేసి బజారుకు పంపించి ఖర్చుపెట్టుటకు ప్రయత్నించాలి. పాతపద్ధతులను మార్చుకోవాలని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను.

ఇంక Handloom industries ను గురించి కొన్ని విషయములు చెబుతాను.

MR. SPEAKER :—ఇంక కోటయ్యగారు మాట్లాడుతారు. మీరు కూర్చోండి.

SRI N.P. CHENGALRAYA NAIDU :—వారికి తెలియని విషయాలు కొన్ని ఉన్నాయండి. Hand loom co-operative societies లో ఎన్ని గజాల బట్టలు తయారుచేసినా, ఎన్ని తానులు తయారుచేసినప్పటికీ మనం తయారు చేసిన వస్త్రములు ఆకర్షవంతంగా ఉండి బజారుకుపోయి అమ్ముకొనుటకు తగినట్లుగా ఏమీచేయడంలేదు. ముఖ్యంగా ఆ లోటు మన ప్రభుత్వానిదే. మద్రాసు రాష్ట్రంలో Hand looms లో పట్టుచీరలు తయారుచేసేటప్పుడు, కోయంబత్తూరులో నూలు చీరలు తయారుచేసేటప్పుడు వాటికి అందమైన Designs వేయుటకు ప్రత్యేకంగా ఉద్యోగస్తులున్నారు. మొట్టమొదట వారు కాగితములపై రంగులతో Designs వేసి తరువాత చీరలనుకూడ ఈ Design లతో తయారుచేయడంవలన వారు బాగా అభివృద్ధిచెందుతున్నారు. బజారులో ఆ వస్త్రములే ముందుగా అమ్ముడవుతున్నాయి. ఆంధ్రరాష్ట్రంలోకూడ మద్రాసులో తయారైన చేనేత బట్టలనే ఎక్కువగా కొంటున్నారు. మన రాష్ట్రంలో తయారయ్యేవాటిని రంగులతో Designs వేయకుండా చౌకగా తక్కువఖర్చుతో తయారు చేయుటవలన ఇవి బాగా ఖర్చుకావడంలేదు కనుక మద్రాసు రాష్ట్రంలోవలెనే మన రాష్ట్రంలో కూడ Designs వేసే పద్ధతి ఏర్పాటుచేసి Hand looms cloth కూడా బాగా ఖర్చుఅయ్యేటట్లు చేయవలసిందిగా కోరుతున్నాను.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, ఈ పరిశ్రమల పద్దును నేను బలపరుస్తున్నాను. ప్రభుత్వము కుటీర పరిశ్రమలను అభివృద్ధిచేయాలని ఆలోచిస్తున్నది. అందుకు ప్రభుత్వాన్ని అభినందించవలసి ఉన్నది. కాని కార్య క్రమాల మాత్రం సంతృప్తికరంగా లేదని వారికి నేను తెలియచేస్తున్నాను. అన్ని వివరాలలోకి వెళ్ళేదానికంటె చేనేత పరిశ్రమ తదితర కుటీర పరిశ్రమలకు సంబంధించిన కొన్ని సమస్యలు ప్రభుత్వం ముందు పెడుతున్నాను. చేనేత పరిశ్రమ చాల అభివృద్ధి చెందిందనే అభిప్రాయం సరైనదిగాదు. అసలు చేనేత పరిశ్రమ అభివృద్ధి చెందాలంటే ప్రధానమైనటువంటి మూడు సమస్యలు పరిష్కరించాలి. చేనేత పరిశ్రమకు సరఫరా చేసేటటువంటి నూలు మిల్లులకు ఏ ధరకైతే అందుబాటు చేయబడుతున్నదో అదే ధరకు అందించే సదుపాయం చేయాలి. చేనేత పారిశ్రామికులనందరిని క్రమంగా మధ్య వర్తకుల చేతులలోనుంచి తప్పించి సహకార

Sri Pragada Kotaiah] [23rd March 1956

సంఘాలలో చేర్పించాలి. వారందరు సహకార సంస్థలలో పనిచేయడానికి చాలి నంత పెట్టుబడిని కల్పించాలి. బట్టలు విడుదల చేయడంలో భారీ పరిశ్రమతో కుటీర పరిశ్రమగా ఉన్న చేనేత పరిశ్రమ పోటిచేయడం సాధ్యంకాదు. కాబట్టి కొన్ని రకాలు చేనేత పరిశ్రమకు ప్రత్యేకంగా కేటాయించాలి. ఈ మూడు విధాల ప్రభుత్వం ఏదైనా శ్రద్ధ తీసుకొన్నదా అంటే హెచ్చు శ్రద్ధను తీసుకో లేదని మనవి చేస్తున్నాను. ప్రభుత్వం సెస్సు స్కీములు ప్రారంభించి మూడు సంవత్సరములయినది. 1955 వ సంవత్సరంలో 60 లక్షల రూపాయల బట్ట ఈ చేనేత సహకార సంఘాలలో తయారైనదని చెపుతున్నారు. ఆంధ్ర దేశంలో 669 చేనేత సహకారం సంఘాలు ఉన్నాయి. 669 చేనేత సహకారం సంఘాలలో 128 వేల మగ్గాలు ఉన్నాయి ప్రతి నెల సరుసగా పనిచేసినట్లయితే 100 రూపాయల బట్ట తయారు చేస్తున్నారు. అంటే రాష్ట్రంలో ఉన్నటువంటి సహకార సంఘాలన్నిటిలో ఉన్నటువంటి 128 వేల మగ్గాలు సక్రమంగా పనిచేసినట్లయితే ప్రతి నెలకూడా 128 లక్షల రూపాయల విలువగలిగిన బట్టను తయారుచేయాలి. మంత్రిగారు చదివినటువంటి నోటు ప్రకారం 20 లక్షల రూపాయల బట్ట మాత్రం తయారుచేస్తున్నాయి. సహకార సంఘాలలో చేరి పోయినటువంటి 128 వేల మగ్గాలలో అంతవంతు మగ్గాలుకూడా పూర్తిగా పనిచేయటం లేదని మంత్రిగారిచ్చి నటువంటి అంకెలవల్లనే స్పష్టంగా తెలుస్తున్నది.

రాష్ట్రంలో ఉన్నటువంటి 128 వేల మగ్గాలలో మగ్గము 1 కి 200 రూపాయల పెట్టుబడైనా కావాలని అందరు అంగీకరిస్తూనే ఉన్నారు. ఇటీవల కృష్ణమాచారి గారు 200 రూపాయలుకూడా చాలవు. 300 రూపాయలవరకు పెట్టుబడి కావాలని అన్నారు. 300 రూపాయల మాట అలాఉంచి 200 రూపాయల ప్రకారం చూచు కుంటే 123 వేల మగ్గాలకు 2 కోట్ల 46 లక్షల రూపాయలు పెట్టుబడికావాలి. ఈ పెట్టుబడిలో ఇండియా ప్రభుత్వం కోటి రూపాయలు మాత్రమే ఖర్చుపెడు తున్నది. నేను చెప్పినట్లుగా ఈ మూడు సంవత్సరాలలో 53 లక్షల రూపాయలు మంజూరు చేశారుగాని ఇన్వలేదు. గత మూడు సంవత్సరాలలో చేనేత సహకార సంఘాలకు పెట్టుబడి క్రింద మంజూరుచేసిన ధనం 53 లక్షలు అయితే 6 వ తేది నాటికి చేతికి వచ్చినటువంటి note ప్రకారం 20 లక్షల రూపాయలు మాత్రం ఈ సహకార సంఘాలలో ఉన్నటువంటి మగ్గాలకు Sanction చేసి విడుదలచేశారు. అంటే 33 లక్షల రూపాయలు ఈ రోజువరకు ఇండియా ప్రభుత్వం దగ్గరో లేక Central Bank దగ్గరో నిలబడిపోయినాయి. లేకపోతే State Co-operative దగ్గరనైనా నిలబడిపోయినాయి. కాబట్టి పెట్టుబడి లేకుండా మగ్గాలన్నీ కూడా పనిచేయాలని చెప్పడంవల్ల ఉపయోగంలేకుండా పోతున్నది. ఆశించినంత అభివృద్ధి

జరగడంలేదు. అందువల్లనే గత మూడు సంవత్సరాలలో 15 వేల మంది చేనేత పారిశ్రామికులను క్రొత్తగా చేర్చాలని ఆలోచిస్తే మార్చి ఆఖరుకు గాని చేర్చలేకపోయింది. 11890 మందిని మాత్రం చేర్చగలిగారు 188 వేల రూపాయలు మిగిలిపోతుంటె ఎందుకు చేర్చలేదు. చేనేత సహకార సంఘాలలో చేరడం అంటే ఇష్టంలేక కాదు, ఇష్టంఉన్నది. చేరినంత మాత్రాన ఆ సంఘం పని చూపగలిగినటువంటి స్థితిలో లేదు. అందువల్ల చేనేత పారిశ్రామికులు సహకార సంఘాలలో చేరడానికి ముందుకు రాలేకపోతున్నారు. కాబట్టి ఈ విషయాన్ని గూర్చి శ్రద్ధగా ఆలోచించాలి.

నూలు సరఫరా విషయంలో చాల కాలంనుంచి అందరు అంగీకరిస్తున్నదే. మామూలుగా Spindle మీదనుంచి సరాసరి మగ్గం మీదకు వెళ్లుతున్నదా అంటే లేదు, చేనేత పారిశ్రామికులకు నూలు రావాలంటె చిలపలుగా చుట్టి, బండ్లుగా కట్టి బిగించి వాటికి రైళ్ల రాకపోకలు Middle mens profit Mill Owners' profits ఇవన్నీ ఉంటాయి. ఇవన్నీ భరించిన తరువాత న్యాయమైన ధరలకైనా చేనేత పారిశ్రామికులకు అందుతున్నదా అంటే అదీ లేదు. గత 5, 6 మాసాలుగా నూలు ధరలు విపరీతంగా పెరిగిపోతున్నాయి. 14, 15 రూపాయిలు అమ్మిన 26 నెంబరు నూలు 18, 19 రూపాయలు వరకు పెరిగింది. 21 రూపాయలు ఉన్నటువంటి 40 నెంబరు 26 రూపాయలు వరకు పెరిగింది. ఈ విధంగా ప్రతి నెంబరు ధర పెరిగిపోతుంటే 2,3 మాసాల క్రితం State Hand Loom Committee వారు ఈ నూలు ఎగుమతి అంతా నిలిపివేసి చేనేత సహకార సంఘాలకు చేనేత పారిశ్రామికులకు న్యాయమైన ధరలకు నూలు అందుబాటు చేయవలసిందని ఆంధ్ర ప్రభుత్వానికి తీర్మానం Pass చేసి పంపిస్తే ఆ తీర్మానంమీద ఆంధ్ర ప్రభుత్వం ఏమి చర్య తీసుకొన్నదో ఇంతవరకు బోధపడడంలేదు. నూలు విషయంలోకూడా ప్రభుత్వం చేయవలసిందికూడా చేయకుండాపోతున్నది. పరిశ్రమల మంత్రిగారు చదివిన నోటులో చేనేత పరిశ్రమ రక్షణ విషయమై తామే విధానాన్ని అవలంభిస్తున్నారో ఒక మాటకూడా చెప్పలేదు. అవిధంగా వారెందుకు మౌనం వహించారో నాకు అర్థంకావడంలేదు. ఒక వైపున T. T. Krishnamachari గారు 10 సంవత్సరాల కాలములో చేనేత పరిశ్రమ శాశ్వతంగా అంతరించిపోతుందని ఉపన్యాసాలు చేస్తుంటే ఆంధ్ర దేశంలో దాదాపు 3 లక్షల మగ్గాల మీద అధారపడిన 15 లక్షల మంది చేనేత పారిశ్రామికులకు ప్రాతినిధ్యం వహిస్తున్నటువంటి ఆంధ్ర ప్రభుత్వం స్పష్టంగా తమ విధానమేమిటో చెప్పకుండా ఈ మౌనం వహించడానికి గల కారణం ఏమిటో నాకు అర్థంకాకుండా ఉన్నది. చేనేత పరిశ్రమను రక్షించాలి అనుకొన్నప్పుడు కొన్నిరకాలను ప్రత్యేకంగా కేటాయించడం

తప్ప మరొక మార్గంలేదు అంటున్నారు. ప్రజా స్వామికం గురించి మనం చాలా గొప్పగా చెప్పుకుంటున్నాము. కాని ఇవ్వాళ ఆంధ్ర ప్రభుత్వము చీరలు, ధోవతులు కేటాయించాలని చెప్పింది. మైసూరు ప్రభుత్వము, హైదరాబాద్ ప్రభుత్వం, మధ్య ప్రదేశ్ ప్రభుత్వం, బీహారు ప్రభుత్వం, కలకత్తా ప్రభుత్వం అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు ఏకగ్రీవంగా చేనేత పరిశ్రమయొక్క శాశ్వత రక్షణకోసం చీరలు ధోవతులు కేటాయించాలని తీర్మానంచేసి కేంద్ర ప్రభుత్వానికి పంపించినప్పుడు పరిశ్రమపట్ల కేంద్ర ప్రభుత్వానికి నిశ్చితమైనటువంటి నమ్మకం గనుక ఉన్నట్లయితే వీరి అభిప్రాయాలను త్రోసిపుచ్చవలసిన అగత్యం ఎందుకువచ్చినదని అడుగుతున్నాను. ప్రజాస్వామికంమీదనే ఆధారపడి మా ప్రభుత్వాలను మా విధానాలను రూపొందిస్తున్నామని చెప్పినపుడు భారతదేశం ముత్తంమీద హెచ్చు మందికి ప్రాతినిధ్యం వహించిన అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు చేనేత పరిశ్రమ చీరలు, ధోవతులు కేటాయించాలని చేసినటువంటి తీర్మానాన్ని ఇండియా ప్రభుత్వంకాదని చెప్పడం నిరంకుశత్వమా లేక కృష్ణమాచారిగారి ఆలోచనలేకుండా కేంద్ర ప్రభుత్వం చేసిన నిర్ణయమా? ఈ విషయాన్ని స్పష్టంగా తేల్చుకోవాలని చెప్పుతున్నాను. ఎందుచేతనంటె నష్టంవచ్చినా కష్టంవచ్చినా ఎదుర్కొనవలసింది రాష్ట్ర ప్రభుత్వంగాని కేంద్ర ప్రభుత్వంకాదు. ముఖ్యమంత్రి గోపాలరెడ్డిగారికి, పరిశ్రమల మంత్రి కళా వెంకట్రావుగారికి యావన్మందికి తెలుసు, ఒకప్పుడు నూళ్ళ కొరతవచ్చి దేశంలో తీవ్రమైనటువంటి నిరుద్యోగంవస్తే వీరంతాకూడా ఆకలి యాత్రలు జరిపించవలవలసివస్తే ఆ రోజున 25, 30 లక్షల రూపాయల నిరుద్యోగ భృతిని పంచి పెట్టడమే కాకుండా రాష్ట్రం మొత్తంమీద అనేక లక్షల రూపాయలు ఖర్చుపెట్టి గంజి కేంద్రాలను పెట్టవలసిన దుస్థితి వచ్చింది. కాబట్టి దానివల్ల వచ్చిన నష్టాన్ని ఎదుర్కొనవలసింది రాష్ట్ర ప్రభుత్వమే. ఇండియా ప్రభుత్వం ఏవో విధానాలను రూపొందిస్తామని చెప్పినంతమాత్రంచేత రాష్ట్ర ప్రభుత్వం ఈ విషయంలో మౌనం వహించడానికి వీలులేదని మనవిచేస్తున్నాను. పెట్టుబడి విషయంలోను, నూలు ధరల విషయంలోను పరిశ్రమ రక్షణ విషయంలోను, రక్షణ ఇచ్చామని అంటున్నారు. రంగుచీరలు మిల్లులు నేయకుండా చేశామని అంటున్నారు. ఒక విషయం ప్రభుత్వం దృష్టికి అనేక పర్యాయములు తీసుకువచ్చాను. రంగు చీరను మిల్లులు బాహాటంగా తయారు చేస్తున్నాయి. ఏ పేరుతో తయారుచేస్తున్నా అంటే, for the purpose of export అనేటటువంటి ముద్ర వేయించి ఆ బట్టలన్నికూడా ఉత్పత్తిచేసి అంతా export చేయడానికికాదు. అమ్ముకోవడానికి అనుమతించవలసిందని కోరగా Bombay Textile Commissioner అనుమతించినందువల్ల బాహాటంగా మార్కెట్ లో అమ్ముతున్నప్పుడు చేనేత పరిశ్రమకు కేటా

యించిన రంగు చీరలు మార్కెట్టులోకి ఎలా వస్తాయి? దానిని check చేసేదానికి ఇండియా ప్రభుత్వం తరఫునగాని ఆంధ్ర ప్రభుత్వం తరఫునగాని ఒక ఉద్యోగికూడా లేదు. ఈ విషయాన్ని నేను ఉదాహరణతో సహా Composite State లో ప్రభుత్వానికి విన్నవించుకొన్నాను. దీని విషయంలోకూడా ప్రభుత్వం శ్రద్ధ వహించలేదు. చేనేత పరిశ్రమకు ఒక కళాశాల పెట్టవలసిందని ఎంతగానో కోరాము. సాంకేతిక విద్యను అభివృద్ధి చేసేదానికి ఆంధ్ర ప్రభుత్వము ఎన్నో లక్షల రూపాయలు ఖర్చు పెడుతున్నది. హెచ్చుమందికి ప్రధాన వృత్తిగా ఉన్నటువంటి చేనేత పరిశ్రమ విషయంలో ఇండియా ప్రభుత్వమువారు మంజూరుచేస్తే తప్ప ఏమి ఖర్చుపెట్టలేమనే దీన స్థితిలో మాట్లాడుతున్నారేగాని 2 సంవత్సరాలనుంచి లక్ష రూపాయలు ఖర్చుపెట్టి చేనేత పరిశ్రమ సాంకేతిక కళాశాలను ఏర్పాటుచేసే దానికొరకు ప్రభుత్వం పూనుకోలేదు. ఎప్పుడో సంవత్సరం క్రితం ప్రణాళికలో పంపిస్తే ఈ రోజువరకుకూడా ఇండియా ప్రభుత్వంనుంచి మంజూరయినట్లురాలేదు. కళాశాల విషయంలో, Finance Co-operative విషయంలో, బట్టలుకొనే విషయంలో ఎంత నిరాదరణ పాలౌతున్నదో కనబడుతూనే ఉన్నది. నవంబరు 55 వ సంవత్సరవరకు మన Department లో ఉన్నటువంటి బట్టలలో Medical Department 2 లక్షల 27 వేల రూపాయలు బట్టలుకొన్నది. Local Bodies 44 వేల రూపాయల బట్టలు కొన్నది Police Department 6 వేలు సరుకుకొన్నది. Forest Department 23 వేలు కొన్నది. Other Departments అన్ని కలిపి 88 వేల రూపాయల చేనేత బట్టలు కొన్నాయి.

ఆంధ్ర ప్రభుత్వము ఏర్పడిన తరువాత, 1955 వరకు చేనేత బట్టలకు సంబంధించిన వివరాలు ఇవి. ఇందులో Police Department హెచ్చుగా బట్టను ఉపయోగిస్తున్నది. అయినా వెనుక అదేదో Manchester లో తయారైన డ్రిల్లో లేకపోతే మామూలుగా Buckingham Carnatic Mills లో తయారైన డ్రిల్లో వాడుతూ, పెట్టుబడిదార్ల ప్రభుత్వము అనండి, లేక పరాయి ప్రభుత్వము అనండి, వారు అనుసరించిన విధానాన్నే ఈవేళ మన ప్రభుత్వముకూడ అనుసరిస్తున్నదేగాని చేమగ్గాలమీద Police Uniforms కు కావలసిన బట్ట తయారు చేయించడానికి అవకాశమున్నదా లేదా అనే విషయాన్ని గురించి ఇదివరకు మన ప్రభుత్వము పరిశీలన చేయలేదు. కనుక ఈ విషయంలో ప్రభుత్వము ఈ చేనేత బట్టకు తగినంత ప్రోత్సాహము కలిగించి, కనీసం పోలీసు డిపార్టుమెంటులో 50 Percent అయినా ఈ చేనేత బట్టలు ఉపయోగించవలసిందని అర్థిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా, గౌరవనీయులైన వెంకట రావుగారు తీసుకువచ్చిన ఈ Demand ను నేను హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను. ఇప్పుడు Industries విషయంలో, ముఖ్యంగా పెద్దపెద్ద Industries ను వ్యక్తులకు అప్ప చెప్పుతున్నారు. అది కొంతవరకు మంచిదే, కాని వాటిలో కూడ ప్రభుత్వము కొంతవరకు Share తీసుకొంటె బాగుంటుందని నేను సలహా ఇస్తున్నాను. ఎందు చేతనంటె ఈ వేళ కాకపోయినా, ఇక పది సంవత్సరములకైనా ఈ Industries ను ప్రభుత్వము స్వాధీనం చేసుకోక తప్పదు. అందుచేత ఇప్పటినుంచే ప్రభుత్వ ధనము దాంట్లో కొంతవరకు ఉండడం అవసరము. మనము ప్రస్తుతము, పెద్దపెద్ద Industries ను ఏ విధంగా ప్రోత్సాహము చేసినా, ప్రభుత్వానికి, ప్రజలకు కావలసిన సామాన్య Consumer Goods విషయములో మాత్రము, ప్రభుత్వమే ప్రత్యేకమైన చిన్న Industries స్థాపన చేసుకోవడం చాలా అవసరమని మనవిచేస్తున్నాను. తరువాత మన వ్యవసాయదారులకు కావలసిన ఇనుప సామానుల విషయములో చాలా కొరతగా ఉంటున్నది. వారు వాటికొరకు చాలా కష్టాలు పడుతున్నారు. కనుక ఆ విషయంలో, ప్రభుత్వమే ఒక చిన్న Industry ని స్థాపించివారికి కావలసిన సామానులు తయారుచేసి సరఫరాచేసినట్లయితే, వ్యవసాయదారులకు ఒక విధమైన అభిమానంకూడ ఏర్పడుతుంది. వాళ్లు పండించే పంటకు కావలసిన సామానులు తయారు చేయించి వాళ్లకు అందించడం ప్రభుత్వము యొక్క ధర్మమైయున్నది. దానివల్ల ప్రభుత్వానికికూడ చాలా లాభాలు వస్తాయని మనవి చేస్తున్నాను. తరువాత శ్రీకాకుళం జిల్లాకు సంబంధించినంతవరకు ఉద్దానంలో కొబ్బరి పరిశ్రమ స్థాపనచేస్తే ప్రభుత్వానికికూడ ఎక్కువ లాభమువస్తుంది. అదే విధంగానే వాడాలో Salt ఉన్నది. దాన్ని Castic soda చెసే విషయంలో, ప్రభుత్వమే కొంత మూలధనము పెట్టి, ఇంక కొంత మంది వ్యక్తులనుకూడ పిలిచినట్లయితే ముందుకువస్తారు. కనుక దానికికూడ తగినటువంటి ప్రోత్సాహము ఇవ్వవలసినదని నేను కోరుతున్నాను. ముఖ్యంగా ప్రభుత్వము ఈనాడు Carpentry Industry ని అభివృద్ధి చేయవలసిన అవసరమున్నది. మొత్తము ఆంధ్ర ప్రభుత్వములో రాజధానిలోగానీ, జిల్లాలలోగాని, తాలూకాలలోగాని, ఉన్నటువంటి అన్ని కార్యాలయాలకు కావలసిన కుర్చీలు, బల్లలు, బెంచీలు మొదలగువాటికి ప్రభుత్వము ఎంతో ధనము వెచ్చిస్తున్నారు. ఈ విషయంలో ఎంతో దుబారా ఖర్చు అవుతున్నదనే విషయము ప్రభుత్వము గమనించాలని మనవి చేస్తున్నాను. అందుచేత ప్రతి జిల్లాలోను ఒక్కొక్క Carpentry Industry ని స్థాపించినట్లయితె బాగుంటుందని సలహా ఇస్తున్నాను. మనకు కావలసిన అడవులు ఉన్నాయి. అడవులలో

కావలసిన కలప దొరుకుతుంది. ఆ కలపను తీసుకువచ్చి ఈ Industry ని అభివృద్ధి చేసి ప్రభుత్వానికి కావలసిన సామానులు తయారు చేసుకొంటె, లాభదాయకంగా ఉంటుంది. ఆ Industry ని అభివృద్ధిచేసిన వాళ్లముకూడ అవుతాము. తరువాత Consumer Goods విషయంలో, ముఖ్యంగా Motor Cars కు, బస్సులకు కావలసిన సామానులు ఉన్నాయి. Batteries తయారుచేసుకోవడానికి పెద్ద పెట్టుబడి అక్కరలేదు, ప్రభుత్వానికి డబ్బు కావాలంటె అప్పుచేస్తే దొరుకుతుంది. కనుక మనకు మన ప్రజానీకానికి కావలసినటువంటి సామానులు తయారు చేసుకొంటే ప్రభుత్వానికి లాభదాయకంగా ఉంటుంది, ప్రజలకుకూడ ఉపయోగకరంగా ఉంటుంది. కనుక అటువంటి చిన్నచిన్న పరిశ్రమలు స్థాపించె విషయములో ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధవహించాలని మనవి చేస్తున్నాను. Sugar Factories విషయంలో ప్రభుత్వము తీసుకొంటున్న శ్రద్ధకు మంత్రిగారిని నేను అభినందిస్తున్నాను. కాని Co-operative Basis మీద నడుస్తున్న ఈ Sugar Factories లో కొంచెము ప్రభుత్వము కొత్తది తీసుకువచ్చి జరుగుతున్నట్లు వ్యవహారాలు, అక్రమాలు అరికట్టేందుకు ప్రయత్నం చేయవలసి ఉంటుంది. శ్రీకాకుళం జిల్లాలో ఆమిదాలవలసలో కూడ ఒక Sugar Factory ని పెట్టినందుకుకూడ ప్రభుత్వాన్ని నేను అభినందిస్తున్నాను. కాని ఆ పని వేగంగా జరిగేటట్లు చూడవలసిందని కోరుతున్నాను. మొట్టమొదట, మన కమ్యూనిస్టు సోదరులు కమ్యూనిస్టులే కాదు, Capitalists కూడ ఈ ప్రభుత్వముయొక్క Industries విధానాన్ని విమర్శింస్తుందనీ చెప్పారు. ప్రజా స్వామ్య సిద్ధాంతానికి సంబంధించినంతవరకు కాంగ్రెసుకుగాని, ఇతర వర్గాలకుగాని కమ్యూనిస్టులు ఎంత శత్రువులో, Capitalists కుకూడ మేము అంత శత్రువులమనే భావిస్తున్నాను. అందుచేత ఈ విధంగా వాళ్లుకూడ విమర్శించవచ్చు ఆ విమర్శ గురించి మేము అంతగా శ్రద్ధతీసుకోము. ముఖ్యంగా ప్రభుత్వానికి నేను ఒక విషయము మనవి చేస్తున్నాను. మన ప్రభుత్వానికి, ప్రజలకు వారిద్దైవందిన జీవితములో కావలసిన సామానులు Consumer goods, తయారు చేసుకొనే చిన్నచిన్న industries ను ప్రతి జిల్లాలోను స్థాపించి ప్రభుత్వము కనీసము నూటికి 51 వంతులు Shares కొనుక్కొని ప్రజలను ప్రోత్సహించినట్లయితే తక్కిన 49 వంతులు ప్రజలు కొంటారు. గనుక ఆ విధంగా మన దేశాన్ని ముందుకు తీసుకుపోవడానికి అవకాశముంటుందని, కనుక మంత్రిగారు ఈ విషయంలో ప్రత్యేకమైన శ్రద్ధ వహించవలెనని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI P. PARTHASARATHI:-అధ్యక్షా, పరిశ్రమలమంత్రి, గౌరవనీయ కళా వెంకటరావుగారు ప్రతిపాదించిన ఈ డిమాండును నేను హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను. మొట్టమొదట వారిని ప్రత్యేకంగా అభినందించవలసినటువంటి అవకాశము నాకు దొరికినందుకు నేను సంతోషపడుతున్నాను. కళా వెంకటరావుగారు చాలా ambitious man. నిజంగా ఆంధ్రదేశములో ఏ ప్రభుత్వము కూడ ఇదివరకు ప్రయత్నించనటువంటి పరిశ్రమలగురించి వీటిని పెంపొందించేదానికోసం వీరు చాలా తీవ్రంగా ప్రయత్నంచేస్తున్నారు. ఈ సందర్భంలో తిమ్మారెడ్డిగారి అభిప్రాయాలతో నేను ఏకీభవించడంలేదు. వారు మంత్రిగాఉండినారు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ ఉపాధ్యక్షులుగా ఉండినారు. అటువంటివారు ప్రభుత్వం పైన ఎన్నో చలాకులువేశారు. కాని వారు సమగ్రంగా ప్రజ్ఞతో విషయాలు తెలుసుకొని మాట్లాడారా అనే సందేహం కలుగుతున్నది. ముఖ్యంగా ఆంధ్ర దేశములో భారీపరిశ్రమలు ఏర్పాటుచేయుటకు ఈ మంత్రులు ఎవరుకూడాను ప్రయత్నంచేయలేదని వారు ఒక సవాలు వేశారు. జనవరి 21,22 తేదీలలో సమావేశమైన National Development Council కు మన కళా వెంకట్రావుగారు, గోపాలరెడ్డిగారు మన ప్రభుత్వముయొక్క ప్రతినిధులుగా వెళ్ళి ఈపరిశ్రమల విషయమై చాలా కృషిచేశారు. భారీపరిశ్రమల నన్నిటినీ ఏ బొంబాయిలోనో, కలకత్తాలోనో పెట్టడంకాకుండా ప్రతిరాష్ట్రానికికూడ కొన్ని భారీపరిశ్రమలు ప్రత్యేకించేటటువంటి ఏర్పాటు చెయవలెనని వారికి నచ్చచెప్పారు వీరియొక్క ప్రతిపాదననుకూడ వారు అంగీకరించినట్లుగా పత్రికాముఖంగా మనకు తెలుస్తున్నది. కాబట్టి ప్రభుత్వ అశ్రద్ధవల్ల ఈ పరిశ్రమలు ఏర్పాటుకాలేదు అనేటటువంటి తిమ్మారెడ్డిగారి అభిప్రాయములో సత్యంలేదని నేను వారికి చెప్పుతున్నాను. నాకు ఇంకా ఏవేవో చెప్పారు. వాటన్నిటికి మంత్రిగారు జవాబు ఇచ్చేందుకు ప్రయత్నంచేస్తారు. ఆంధ్రదేశములో electrical పరిశ్రమలను ఏర్పాటుచేయవలెననే ప్రయత్నం జరుగుతూ ఉన్నది. అది తప్పకుండా విశాఖ పట్టణములో ఏర్పాటుకాగలదని నేను ఆశిస్తున్నాను. ఆప్రకారంగానే, ఏయే ప్రాంతాలలో ఏయే ముడిపదార్థాలు దొరుకుతాయో, వాటికి సంబంధించిన పరిశ్రమలను ప్రభుత్వంవారు ఏర్పాటుచేస్తారని నేను నమ్ముచున్నాను. రాయలసీమజిల్లాలలో barytes అని Paint factory కి అవసరమైన ముడిపదార్థాలు దొరుకుతున్నాయి. కడపజిల్లాలో ప్రత్యేకించి snow white barytes దొరుకుతున్నాయి. అది paint factory కి చాలా అవసరమైనటువంటి ముడిపదార్థము. కడపప్రాంతములో ఒక paint factory ని ఏర్పాటుచేయవలెనని సమాలోచనలు జరుగుతున్నాయి. ప్రభుత్వంవారు దీనిని గుర్తించి అవకాశముదొరికినప్పుడు అక్కడ paint factory ని

ఏర్పాటుచేసేటట్లు ప్రభుత్వం చేయవలెనని కోరుతున్నాను అలాగే రాయలసీమ జిల్లాలలోనె కాకుండా, ఇతరజిల్లాలలో కూడ పండ్లపరిశ్రమ ఎక్కువగా ఉన్నది. కోడూరు ప్రాంతములో చీనా, మామిడిపండ్లు భారీఎత్తున పండుతున్నాయి. కనుక కోడూరుప్రాంతములో గాని, రాజంపేటప్రాంతములోగాని ఒక Canning factory ఏర్పాటుచేయవలెనని Horticulture Association వారేమి, Agricultural Department వారేమి ప్రభుత్వాన్ని అర్థించిఉన్నారు. కాని వారి అభ్యర్థన ఏమైందోకూడ ఇదివరకు ఎవరికి తెలియడంలేదు.

తరువాత సిమెంటు ఫ్యాక్టరీలు ఏర్పాటుచేసే సందర్భములో మాచర్లదగ్గర ఒకటి, ఎర్రగుంట్లదగ్గర ఒకటి, పాణ్యంలో ఒకటి ఏర్పాటు కాగలవని ప్రభుత్వము వారు ప్రకటనలనుబట్టి తెలుసుకోగలిగాము. కాని మాచర్ల దానికి, పాణ్యం దానికి లైసెన్సులు యిచ్చారని తెలిసింది. కడపజిల్లాలో ఉన్న ఎర్రగుంట్ల దాని సంగతి ఏమైందిన్నీ యింతవరకు తెలియలేదు. ఎర్రగుంట్లవద్ద కట్టటానికి ప్రభుత్వం వాగ్దానము చేసింది. కాబట్టి ప్రభుత్వము ఆ ఫ్యాక్టరీ విషయములోగూడ తగుశ్రద్ధ తీసుకుంటారని ఆశిస్తున్నాను. ఎర్రగుంట్లవద్ద ముడిపదార్థాలు, jipsom, clay వగైరాలు సిమెంటు పాక్టరీకి కావసినవి అక్కడ సమృద్ధిగా దొరుకుతాయి కాబట్టి, అక్కడకూడ త్వరలో ఏర్పాటుచేస్తారని ఆశిస్తున్నాను. ఇదిగాక fertiliser factory యొక్క అవసరమునుగురించి విచారించటానికి M.V.Krishnappa యింకా యితర కేంద్రప్రభుత్వపు మంత్రులు బెజవాడ, ఆ ప్రాంతాలకువచ్చి, విచారించి, అది తప్పనిసరిగా పెట్టవలసిందేనని చెప్పినట్లు, అది పెట్టటానికి కేంద్ర ప్రభుత్వము అంగీకరించిందని తెలిసింది. ఆ ప్రయత్నము యింతవరకు సఫలీకృతము కాని కారణములు ఏమిటో తెలియలేదు. ఇంతేగాకుండా bonemeal factory ఒకటి మనకు ఎంతో అవసరము వున్నది. రాష్ట్రములోనుంచి ఎముకలన్నీ యిప్పటి వరకూ ఎగుమతిచేస్తున్నారుగాని, ఎక్కడికి ఎగుమతి చేస్తున్నారో తెలియలేదు. మనది వ్యవసాయదేశము. వ్యవసాయము వృద్ధిచేసుకోటానికి ప్రాజెక్టులను నిర్మించుకుంటున్నాము. వ్యవసాయమునకు bone-powder ఎంతో అవసరము కాబట్టి, యీ factory ను త్వరలో ఏర్పాటుచేయమని కోరుతున్నాను.

తరువాత Iron and Steel implements distribution విషయములో ప్రభుత్వము న్యాయముగా అందరికీ సరిగా సరఫరా అయ్యేటట్లు చూడాల్సివున్నది. వ్యవసాయ పనిముట్లకు అవసరమైన యినుము, fabricators సప్లయిచేయటానికి ధరఖాస్తులు పెట్టుకున్నారు. దరఖాస్తుదార్లకు లైసెన్సు యిచ్చే ఏర్పాటుచేయాలి. విదేశాలనుంచి agricultural implements తెప్పించుకోటానికి అవసరము

లేకుండా పోతుంది. దానివల్ల మనము self reliance ను గూడ సంపాదించుకోటానికి వీలు అవుతుంది. కాబట్టి నేను చేసిన యీ సూచనలను అంగీకరించుతూ ప్రభుత్వము యీ విషయములో సహాయపడుతారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

SRI P. SURYANARAYANA :—అధ్యక్షా, గౌరవనీయులైన మంత్రి కళా వెంకట్రావుగారు చేసిన ఉపన్యాసములో పెట్టుబడిదారులు ముందుకు రాకపోవడమువల్ల industries ప్రోత్సాహకరముగా సాగడములేదని చెప్పారు, వారికి నేను యీ సందర్భములో ఒక విషయము మనవి చేయవలసి ఉన్నది. ప్రభుత్వము వారు అయిదు sugar factories కొరకు సిఫార్సుచేశారనిన్నీ, అందులో రెండు ఫాక్టరీలు యిప్పటికప్పుడే దాదాపు తయారు అయినవని, వచ్చే season కు పని ప్రారంభిస్తారని సెలవిచ్చారు. చోడవరములోగూడ పని ప్రారంభిస్తున్నారు. అయితే ఆమదాలవలస ఫ్యాక్టరి విషయములో ప్రభుత్వము డబ్బుకట్టమని కోరగానే డబ్బు చెల్లించడము జరిగింది. ఈ విషయము ప్లానింగుమంత్రిగారికి తెలుసును. Registrar గారుకూడ ఆ ఫ్యాక్టరీకి డైరక్టర్లను నిర్ణయించిగూడ ప్రభుత్వానికి పంపారు. అది జరిగి యిప్పటికి అయిదుమాసములు కావచ్చింది. దానిసంగతి ఏమి అయిందని మంత్రిగారిని అడిగితే, వారికి కోపమువచ్చింది. అయితే యీ విషయమునుగురించి ఏమి జరిగిందో తెలుసుకోవాలంటే, మంత్రిగారిని అడగకపోతే, మరెవ్వరిని అడగవలెనో అర్థముకావలేదు. అక్కడ ప్రజలవిషయము మంత్రిగారికి చెప్పకపోతే, మరెవ్వరికి చెప్పాలో తెలియలేదు. కాబట్టి మంత్రిగారికి మరొకసారి మనవిచేస్తున్నాను ఆ ఫ్యాక్టరీవిషయము యిప్పటికి అయిదుమాసాలుగా నిర్లక్ష్యము జరుగుతున్నది. మాది వెనుకబడిన జిల్లా అనే సంగతి మంత్రిగారికి తెలియకపోలేదు. Industry చిన్నదైనా, పెద్దదైనా, మాజిల్లాలో ఒకటి నెలకొల్పాలని మా అభిప్రాయము. ఈ ఫ్యాక్టరీ విషయములో డబ్బు కట్టివున్నాము. కావలసిన పనులు అన్నీ అయినవి గనుక ప్రభుత్వము యికమీదట ఎంతమాత్రము అలస్యము చేయకుండా మాజిల్లాలో యీ ఫ్యాక్టరీని నెలకొల్పుతారని ఆశిస్తున్నాను.

తరువాత చీపురుపల్లిలో Manganese Factory ని ప్రభుత్వము ఏర్పాటు చేస్తామనిచెప్పారు. అందుకు మాకెంతో సంతోషముగా వున్నది. సంతోషించే వారిలో నేను ఒకణ్ణేకాదు. మా జిల్లాలోని ప్రజలందరూగూడ సంతోషిస్తున్నారు. మా శ్రీకాకుళం జిల్లాలో చిన్న పరిశ్రమలు, పెద్దపరిశ్రమలు నెలకొల్పాలని మంత్రిగారిని కోరుతున్నాము. ఫ్యాక్టరీలు నెలకొల్పే విషయములో మాలోమాకు పార్టీ కక్షలు పోటీలు వుండవచ్చు. పార్టీకక్షలకు, పోటీలకు ఫ్యాక్టరీలు నెలకొల్పటానికి ఏలాంటి సంబంధము వుండకూడదు. పార్టీకక్షలకోసము యీ ఫ్యాక్టరీని

నెలకొల్పటములో ఆలస్యముగాని, నిర్లక్ష్యముగాని చేయవద్దని మంత్రిగారిని కోరుతున్నాను. కాబట్టి ఈఫ్యాక్టరీవిషయములో, ప్రస్తుతము ప్రభుత్వము ఎదుట వున్న విషయాలను అన్నింటినీ సమగ్రముగా పరిశీలించి, డైరక్టర్ల నామినేషనులుగూడ ప్రభుత్వము ఎదుట వున్నవి. కాబట్టి, యికమీదట ఆలస్యముచేయడము సమంజసముగా లేదు. మంత్రిగారు యీ విషయములో శ్రద్ధతీసుకొని ఆ ఫ్యాక్టరీని నెలకొల్పటానికి వెంటనే ఏర్పాటు చేయాలని కోరుతున్నాను.

తరువాత మాకు కళింగపట్టణము రేవులో చేపలు విశేషముగా దొరుకుతాయి. అక్కడ ప్రజలకు చేపలమీదనే జీవనము చేస్తున్నారు. అదే వారికి జీవనాధారము చేపలను cold storage లో పెట్టడానికి ఒకప్లాంటు తెప్పించారు. అది ఆమదాలవలసలోగాని కళింగపట్టణములోగాని పెట్టించే ఏర్పాటుచేయాలని కోరుతున్నాను. ఇంకా యిటువంటివి అనేక చిన్నచిన్న పరిశ్రమలు మాజిల్లాలో ఏర్పాటుచేయాలని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

SRI. B G. M. A. NARASINGA RAO :—అధ్యక్షా, మంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండును నేను బలపరుస్తున్నాను కళా వెంకట్రావుగారు చాలా సమర్థులు. అందువల్ల యీ planning పరిశ్రమలు, వారి portfolio క్రింద ఉండడముకూడా ముదావహం. వారి హయాములోనైనా ఆంధ్రదేశములో పరిశ్రమలు వర్ధిల్లాలు విశేషముగా వృద్ధిచెందుతాయని మా అందరి ఆశాభావం. ద్వితీయపంచవర్ష ప్రణాళికలో భారీపరిశ్రమలు నెలకొల్పబడవలెనని మా ఆశయము. కేవలం ప్రైవేటు సెక్టరుమీద ఆధారపడి ఉండడమువల్ల, లాభము ఏమాత్రము వస్తున్నదో, అది ఏవిధంగా ఉపయోగపడుతున్నదో అందరికి తెలిసిన విషయమే. అందువల్ల యికమీదటనైనా ప్రభుత్వము ప్రైవేటు సెక్టరుమీద ఆదారపడకుండా, కార్మికులమీదనే ఎక్కువగా ఆధారపడి, కార్మికులకు co-operative enterprises ద్వారా, వారిని వృద్ధికితీసుకునిరావాలని నా అభిప్రాయము Co-operative basis మీద heavy industries యీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఏర్పాటు చేస్తే, కార్మికులను భాగస్వాములను చేసినట్లవుతుంది, Industries గూడ వృద్ధిలోనికి వస్తాయని నా అభిప్రాయము. దీనివల్ల unemployment problem కూడా చాలా భాగము solve అవుతుంది. ద్వితీయపంచవర్ష ప్రణాళికలో heavy electrical equipment తీసుకొని రాబడుతుందని ఆశించాముగాని అది Bhopalకు పోవడం, రెండవది Fertiliser Factory neivelli కి పోవడము మనము చూస్తూనే ఉన్నాము. ప్రభుత్వము యీ విషయములో ఏమి చేయలేకపోయింది. అయితే ప్రభుత్వం యీ సందర్భములో చేయగలిగిన ప్రయత్నం అంతా చేసిందని

మానమ్మకము. ఇవి రెండు మన రాష్ట్రములో నెలకొల్పటానికి కేంద్ర ప్రభుత్వము వారు సమ్మతించక పోవడమువల్ల, ప్రభుత్వము వెంటనే ఒక strong protest ను కేంద్రప్రభుత్వానికి పంపిస్తారని, కనీసము భారీపరిశ్రమల కొన్ని మన ఆంధ్రదేశ ములో ఏర్పాటుచేసేటట్లు అయినా కేంద్రప్రభుత్వాన్ని అర్థించవలసిన అవసరము ఉన్నది

తరువాత రష్యావారు మనకు యిచ్చిన agricultural implements తోబాటు agricultural implements ను తయారుచేసే industry ఒకటి మన ఆంధ్రదేశములో ఏర్పాటు చేయవలసిందని కేంద్రప్రభుత్వాన్ని కోరవలెనని నా అభిప్రాయము.

తరువాత కొన్ని సంస్థలు ప్రభుత్వం అధ్వర్యాన joint management ద్వారా చేయబడుతున్నవి. ఈ సంస్థలలో management చేసేవారికి కార్మికులకు joint management జరిగేటట్లు ఏర్పాటుచేస్తామని కేంద్రప్రభుత్వము చెప్పింది. కనీసము ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోనైనా ఆ ఏర్పాటుచేయాలని అంటున్నాను. ఇది కేంద్రప్రభుత్వమువారి పాలసీ అని అంటున్నారు అటు వంటప్పుడు యీ విధానము వెంటనే ఎందుకు అమలులోకి తేకూడదు. మైసూరు ప్రభుత్వములోని ముఖ్యమంత్రి హనుమంతయ్యగారుకూడా ఆ విధముగా కార్మికులను భాగస్వాములనుగా చేసేపద్ధతి పెట్టుతామని declaration కూడా యిచ్చారు. అదేమాదిరి ఆంధ్రప్రభుత్వం తన ఆధ్వర్యక్రింద నడపబడే సంస్థలలోనైనా, యీ పాలసీ ఎందుకు వెంటనే ప్రవేశపెట్టకూడదు ? కనీసము ఈ బడ్జెటు చర్చలుపూర్తి అయ్యేలోగానైనా ఒకప్రకటనచేస్తారని మేము ఆశిస్తున్నాము. ఆవిధంగాచేస్తే, ద్వితీయ పంచవర్షప్రణాళికలో ప్రభుత్వము స్థాపించబోయే పరిశ్రమలు ఎంతో ఉత్సాహవంత ముగా ముందుకు పోవటానికి అవకాశము ఏర్పడుతుంది ఒక విషయముమాత్రము ప్రభుత్వం మరచిపోగూడదు కార్మికులు లేనిదే పరిశ్రమలు నడవజాలవు అనేది ప్రభుత్వంకు తెలుసుననుకుంటాను. అలాంటప్పుడా కార్మికులకు ఉత్సాహపరు లుగాచేసి, పరిశ్రమలను బాగా నడపటానికి భాగస్వాములుగా చేయండి. పారి శ్రామిక రంగముముందుకు వచ్చేటట్టు ప్రభుత్వము చూడాలి. కాబట్టి ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో యీ విధానము ప్రభుత్వము అమలులోకి తెస్తుందని ఆశిస్తూ, అధ్యక్షులవారు యీ అవకాశము నాకు యిచ్చినందులకు నా కృతజ్ఞతావందనములు తెలియజేస్తున్నాను,

THE HON. SRI K. VENKATA RAO :—అధ్యక్షా, కొంచెము [illegible]తక్కువగా సభ్యులు మాట్లాడిన విషయాలన్ని నేను రెండుమూడు

Headings క్రింద విభజించుకుని వాటికి సంగ్రహముగా సమాధానము చెబుతున్నాను అందులో మొదటిది, Mining ను గురించి, రెండవది, పెద్ద పరిశ్రమలను గురించి, మూడవది, చిన్నపరిశ్రమలు అందులో ముఖ్యంగా చేనేత వ్యవహారము. ఇదివరకు జరిగినచర్చ యీ మూడింటిమీదనే జరిగింది. పరిశ్రమల విషయములో ప్రభుత్వము అవలంబించే విధానమును అంతా నేను యిదివరకే మనవిచేశాను. మరల వాటిని గురించే చెప్పేదానికంటే యీ సంవత్సరము ప్రభుత్వము జరిపిన పరిపాలనలో ఉన్న విషయాలను గురించి ప్రధానముగా చర్చించినట్లయితే ఎంతో మంచిదిగా ఉండేది. అలాంటిది అసలు ప్రభుత్వవిధానాన్ని కూడ చర్చకు తీసుకునివచ్చాను. దానిని గురించి నేను మొదట్లోనే మనవి చేశాను. ఈనాడు భారతదేశముయొక్క విధానమే మారిపోయినది. Socialistic pattern of society కి అనుగుణముగా దేశములో మార్పులు రావాలని అంటున్నారు. మనము ఆ విధానములోకి మారవలసిఉన్నది. కనుక Socialistic pattern of society కి సరిపోయేటట్లుగా పారిశ్రామిక విధానము మారాలి. Socialistic pattern of society అమలులోకి రావాలి అని కాంగ్రెసు declare చేసిన 15,20 రోజులలోగా, అదివరకు ఉన్నటువంటి Industrial policy revise చేస్తూ, క్రొత్తపద్ధతి అమలులోకి తీసుకొని రాబోతామని ఢిల్లీలో ప్రభుత్వమువారు చెప్పారు. అందువల్ల యిప్పుడు ఆ పద్ధతి కనుగుణముగా మనపద్ధతులు, మన భావాలు మనముకూడ మార్చుకోవలసిన అవశ్యకత ఏర్పడింది.

ఆ విధానంలో మాత్రం కొన్ని సూచనలున్నాయి. ఇప్పుడు విమర్శించిన స్నేహితులలో ఒక్కరైనా నేనీ Industry పెట్టడానికి సహాయంచేస్తాను. నువ్వు ఎంతదూరం సహాయంచేస్తావు ? నీ సహాయం ఏమిటని ? అడగలేదు సరిగదా గత సంవత్సరం ఏప్రియల్, మే నెలలలో మండుటెండలలో ప్రతిజిల్లాకువెళ్ళి స్థానిక M.L.A లను, జిల్లాలోఉన్న పెద్దలను అందరనూ Gather—చేసి అప్పటికింకా మన Plan తయారు కాలేదు—అంధ్రదేశంలో పెద్ద పరిశ్రమలు పెట్టడానికి Capital లేదని మీకు తెలుసును, ఉపన్యాసాలమాట ఎల్లాఉన్నా, ఈ Medium size పరిశ్రమలు 10 లక్షలని, 15 లక్షలని, 25 లక్షల రూపాయిలు మించకుండా, ఏరకమైన పరిశ్రమ ఎక్కడ పెట్టినా, నూటికి 51 రూపాయిల Share capital ఆంధ్రప్రభుత్వం ఇస్తుంది, మిగతా దానివిషయంలో సహాయం చేయవలసిందని జిల్లా జిల్లా తిరిగి—ఇంతటిలో జబ్బుచేయడంవల్ల మూడు జిల్లాలకు మాత్రం వెళ్లలేకపోయాను—ఎనిమిది జిల్లాలలోనూ తిరిగి వారితోచెప్పి వచ్చాను. ప్రతిబహిరంగ సభలో పిచ్చివాడిక్రింద ఇదేవాగడంతప్ప నా కింకోమార్గం కనిపించలేదు. నిజం చెప్పవలసివస్తే, ఇంతవరకూ, ఈ Sugar mills textile mill కి సంబంధించి

Sri K. Venkata Rao] [23rd March 1956

నటువంటి response తప్ప పెద్దవనండి, Medium అనండి, ఏపేరెట్టినా ఇతర వాట్లలో ఇప్పటికి ఏవిధమైన response రాలేదు. Government of India వారిని మేము industries లో parttake చెయ్యడానికి మా portion of the capital క్రింద మూడుకోట్ల రూపాయిలు పెట్టవలసిందని కోరాం. నా మొట్ట మొదటి ఉపన్యాసంలో దీనిని గురించి చెప్పాను. వారేమి చెప్పారంటే ఇల్లా ఏ రాష్ట్రంలోనూ పెట్టలేదు మీ రాష్ట్రంలోకూడా పెట్టడానికి వీలులేదు గాని, మీరు ఏ industry ఐనా పెట్టడానికి సంకల్పించి, దానికి మీరు case make out చేస్తే, Plan లో ఉన్నా లేకపోయినా మేము తప్పకుండా సహాయంచేస్తామని industries విషయం చూస్తూఉన్న Planning Commission member గారు మా అందరియొక్క సమక్షంలోనూ చెప్పారు. ఆయనకు ఉత్తరం వ్రాద్దామంటే ఇప్పటికీ ఆస్కారం దొరకడంలేదు. విశాఖపట్టణంలో Hospital లో పడుకున్నాకూడా విశాఖపట్టణములో industries developement ని గురించీ, ఈ industries విషయంలో ఎవరు ఏమిపెడతారో ఎక్కడ ఎవరికి ఏస్థలం కావాలో విచారిస్తున్నాను. మనది agricultural దేశం. ఈ స్వభావం మార్చుకునేందుకు కొంతకాలం పడతుంది. నేను ఎంత ప్రయత్నంచేసినా, దానికి response రావడంలేదు అందువల్ల ఈ వ్యవహారం కొంత కుంటుపడిందని మీఎదుట చెప్పడానికి నాకేమీ సందేహంలేదు. ఐనా మన యత్నం విరమించడానికి వీలులేదు. కాని వచ్చే 5 ఏళ్ళలోనూ ఈవేళ ఉన్నపరిస్థితి కంటె, చాలా ముందుకు తీసుకువెళ్ళగలిగే పరిస్థితి ఏర్పడుతుందని నాకు నమ్మకం ఉంది. అదేనమ్మకంతో ప్రభుత్వంకూడా కృషిచేస్తోంది. నేను మళ్ళీ సభ్యులందరికీ మనవిచేసేదేమిటంటే, మీయొక్క సహాయ సంపత్తులు లభించి ఎక్కడ ఏ industry—కొత్తది కానివ్వండి, పాతది కానివ్వండి—ఎక్కువమందికి పని కల్పించేటటువంటిది మీయొక్క నమ్మకంచేత నిరూపించినట్లయితే, ప్రభుత్వం యొక్క సహాయం తప్పకుండా లభిస్తుందని అన్నివిషయాలకీ కలిపి నేను generalగా ఒక సమాధానం చెబుతున్నాను. mines ని గురించి ఒక ప్రత్యేక విమర్శ వచ్చింది. ఆంధ్రరాష్ట్రంలో భూగర్భంలో చాలా Mines ఉన్నాయి. మనకున్న 60 వేల చదరపుమైళ్ళ విస్తీర్ణంలో 20 వేల చదరపుమైళ్లకే preliminary survey జరిగింది. ఇంకా 40 వేల చదరపుమైళ్లకు survey జరగాలి. జరిగినచోట కూడా బాగా భూగర్భంలోకి వెళ్ళి ఏముందో చూడలేదు. ఇదంతా చాలా పెద్ద సమస్య అయింది. ఐనా ఒకవిషయం తమకు మనవిచేస్తున్నాను. తిమ్మారెడ్డిగారు కూడా చెప్పారు. Mining advisor అని ఒక కొత్త appointment ను create

చేశాను. ఈ పద్ధతిమీద వ్యవహారంచేయడంకోసం అప్పుడే ఏర్పాటుచేశాం. ఇదే కాకుండా Andhra University వారు ఈవిషయంలో మనకు సహాయం చేశారు. వారి సలహాలో ఒకటి ఉంది. విద్యార్థులను తీసుకువెళ్ళి గ్రామాలలో camps వేసి తిప్పారు. Andhra University లోని geology students వారి Profesors తో geo-physical survey చేసే వారి instruments తో వచ్చి మనప్రభుత్వం ఖర్చులతో survey చేశారు వారు delta ప్రాంతాలన్నీ పర్యటించి Lignite ను locate చేశారు ఇప్పుడు lignite కాని, coal కాని ఆంధ్రదేశంలో లేకపోవడంవల్లనే మనకు కొన్ని పరిశ్రమలు ఇక్కడ start చెయ్యడానికి వీలులేక పోయింది. మనము పరిశ్రమలు కావాలని కోరాం. అవి ఎందుచేత రాలేదో మనం యోచించాలి. కావాలని కోరడంలో మనకు బేధాభిప్రాయాలు లేవు. ఈరోజు కూడా నాలుగో ఎరువుల factory పెట్టి మనకు ఇవ్వవలసిందని అడుగుతున్నాం. మనం లక్ష పదివేల టన్నులు సాలుకిఉపయోగిస్తున్నాం.ఇప్పుడు కృష్ణమీద project, తుంగభద్రమీద project గోదావరిమీద project, చిన్న నదులమీద projectలు, వంశధారమీద project ఇవన్నీ వచ్చేటప్పటికి ఈ 110వేల టన్నులు, 350వేల టన్నులవుతుంది. క్రిష్ణప్పగారే చెప్పుకున్నారు. బర్మాలో ఉన్నటువంటి international surplus pool ఎంత ఉందో అన్ని భోజనపదార్థాలూ ఒక్క ఆంధ్రరాష్ట్రమే తయారుచేయగలదు. దానికి కావలసింది ఎరువు. వారు మనకు చెప్పింది, report లో వ్రాసింది నేను చెప్పాను. మీకు గాది వండడానికి వేలుంది అన్నారు. మనకు communications బాగున్నాయి. మీటరు గేజి ఉంది, బ్రాడ్ గేజి ఉంది. Inland water system ఉంది. అన్నీ విజయవాడలోనే ఉన్నాయి. కాని దానికి కావలసిన బొగ్గులేదు. Gypsum లేదు. సుళ్ళూరుపేటదగ్గర super-ficial gypsum ఉంది. రెండురోజులకు సరిపోతుంది. ఇది ఎక్కడనుంచి తీసుకురావాలి. అది basic material. ఎప్పుడైతే University వారు lignite ను locate చేశారో, నేను తక్షణం ఇండియా గవర్నమెంటువారికి వ్రాశాను. గోపాలరెడ్డిగారిచేత కూడా వ్రాయించాం. ఈ lignite ను గురించి investigate చెయ్యమని వ్రాశాం. వారు దాన్నిగురించి ఆలోచిస్తున్నారు. అసలు సిస్టమే మారిపోతోంది. ఇప్పుడు రూర్కేలా ఇనుముఫ్యాక్టరీ పెట్టారు గదా ? అక్కడ ఎందుచేత పెట్టాలి? ఈ factory ఇదివరకు Itarsi లో ఎక్కడో పెడతామన్నారు రూర్కేలాలోనే ఎందుకు పెట్టారో తెలుసునా? దానిలోనుంచి వచ్చిన slag లో నుంచి ఎరువు తయారుచేయవచ్చునట తక్కువ ఖరీదుతో. అందుచేత సిస్టమే మారింది. ఈ బ్రాంకాసెంటర్ లో ఇంకో కొత్త

23rd March 1956] [Sri K. Venkata Rao

సిస్టం ప్రవేశపెడుతున్నారు. Lignite మీద తయారుచేసే system నే వేరీలో ప్రవేశపెడుతున్నారు. అవిరెండూ combined project కనుక విడదీయడానికి వీలు లేక పోతోందని చెబుతున్నారు. మనకు lignite వచ్చింది. విశాలాంధ్ర రావడంతో మనకు బొగ్గుకూడా లభిస్తుంది మనకు ఎన్నోవసతులు ఉన్నాయి. అన్నిటి కంటె మనం ఎక్కువగా వినియోగించేవాళ్ళం ఐనప్పటికీకూడా వాళ్లు ఏమి నిరూపించారంటే cost of production మిగిలిన మూడు సెంటర్లలోకన్న బెజవాడలో ఎక్కువవుతుంది, నిజమే అన్ని ముడిపదార్థాలు ఎక్కడనుంచో తీసుకువస్తే cost of production natural గా ఎక్కువవుతుంది ఐనప్పటికీ transport లో అది మనం make up చేసుకోగలం పడవమీద చాలాదూరం తీసుకుపోగలం ఈవిధంగా మనం argue చేస్తున్నాం Lignite కూడా దొరికింది గనుక మన పరిస్థితి కొంచెం బాగుపడుతుందని అనుకుంటున్నాం ఈ సందర్భంలోనే పెద్ద పరిశ్రమలనుగురించి చెప్పాలంటే విశాఖపట్టణంలో Waggons assembling factory ఒకటి start చేశారు అదీ కాకుండా విశాఖపట్టణంలో నే steel fabrication factory ఒకటి పెడదామని దానికి13 కోట్లు అవుతుందని ఇండియా గవర్నమెంటువారి ప్రతినిధులు private చర్చలలో మనకు ఇచ్చిన సూచన ఉన్నది. దాన్నిగురించికూడా యత్నంజరుగుతుంది. Heavy Chemicals Factory భోపాల్ కు వెళ్లిందని ఆయనచెప్పారు. Bhopal కు వెళ్లినట్లు Government of India వారు చెప్పలేదు. Committee వారు ఇంతవరకూ report వ్రాయలేదు. ప్రచురించడంమాట దేనుడెరుగును ఎక్కడికి వెడితే వారు మన ఊరేవస్తుందని అనుకుంటున్నారు. సుబ్రహ్మణ్యం గారు మదరాసుకు ఇస్తారని అక్కడచెప్పారు Bhophal కు వస్తుందని భోపాలులోవారు చెప్పుకుంటున్నారు Mysore వారు వారికి వస్తుందని అనుకుంటున్నారు మూడు factory లు పెట్టదలచుకోలేదు. ఒకటే పెడుతున్నారు ఎక్కడఉంటుందో నాకు తెలియదు. విశాఖపట్టణంలో పెడితే బాగుంటుందని అన్నారట. కాని అక్కడ మంచినీళ్లులేవు. దీనివిషయం ఆలోచించామన్నారట. కోటి పదిహారులక్షలు ఖర్చుపెట్టి మంచినీళ్ల scheme తయారుచేస్తున్నాం. ఇది వారిదృష్టికి తీసుకువచ్చాం Mica Bill అని ఒకటి తయారుచేస్తున్నాం. ఈ Mica Act పెట్టినట్లయితే unemployment ను గురించి, smuggling ను గురించి తగినటువంటి చర్య తీసుకునేందుకు ప్రభుత్వానికి అధికారం లభిస్తుంది. ఈ royalty వగైరా నిర్ణయించేఅధికారం ఇండియా గవర్నమెంటుచేతులలో యున్నది. వారు ఏది నిర్ణయిస్తే అదేమనం తీసుకోవాలి. ఒక అర్ధరూపాయి ఎక్కువచేయమని మధ్య అడిగాం. టన్నుకి 0-8-0 royalty increase చేయమంటే అది general policy క్రింద తీసుకోవాలని అంటారు. జవహర్లాలు నెహ్రూగారు National

Development Council లో మాట్లాడుతూ, ఈ mining polic నిగురించి తెలియ జేశారు ఇవన్నీ మారాలని ఆయన ఉద్దేశం. మార్పు ఉద్దేశంలో వాళ్లున్నారు. మనకున్న కష్టసుఖాలన్నీ వారికిచెప్పి అటువంటిమార్పు తీసుకువచ్చేటట్లు మనం చేసుకోవచ్చు.

Nationalisation ను గురించి చాలా suggestions వస్తున్నాయి. ఇది All India policy మీద ఆధారపడి ఉంటుంది. కొన్ని పరిశ్రమలకు Nationalisation అవసరం అని చెప్పారు. వాటిలో coal industry కూడా ఒకటిగా చెప్పారు. దానినే పరిపూర్ణంగా చేయడానికి పెట్టుబడిలేక వ్యవహారం నడవడంలేదు. మిగతావి ఏమైనా minerals కూడా కలిపితే మనంకూడా ఆ ప్రకారం చేయడానికి వీలుఅవుతుంది. Auctioning of mines కు కూడా అదే policy అనుసరిస్తున్నాము. Rule లో ఏమిఉన్నది అంటే ఎక్కడయినా ఒకగని దొరికిందని గవర్నమెంటు దృష్టికివస్తే Gazette లో notify చేస్తారు. ఫలానా mine ఫలానాచోట ఇన్ని ఎకరాలలో దొరుకుతుందని. ఆ notification అయిన వెంటనే ఎవరయితే నిర్ణీతతేదీన దరఖాస్తుదారు అవుతారో అన్నారు. వారికి ఇవ్వాలి. గోపాలరెడ్డిగారు ఇది horse race అని మొన్న ఈ విషయంలో 11 మంది మనుష్యులు ఒకేరోజున కలెక్టరుగారికి దరఖాస్తు ఇచ్చారు. Licence ఎవరికి ఇవ్వాలనే ప్రశ్నవచ్చింది. ఈ విషయమై Government of India వారికి refer చేయవలసివచ్చింది. 11 గురు ఒకేసారి అందించారని ఒకేసారి అందుకున్నానని కలెక్టరుగారు వ్రాశారు. It is a fact. ఈ విషయాన్నిగురించి కొంచెం "ఇది" ఉన్నమాట నిజమే దీనిని వారు ఆలోచిస్తున్నాము అంటున్నారు. వారు పెట్టిందికూడా ఒక సిద్ధాంతాన్నిబట్టి Patronage లేకుండా automatic arrangement ఉంటే బాగుంటుంది అనిపెట్టి ఉండవచ్చును.

Sri P. THIMMA REDDI :—Rules frame చేసేవరకు assign చేయకుండా నిలుపుదల చేస్తారా ?

The Hon. Sri K. VENKATA RAO: —అన్నీ నిలుపదలచేస్తే ఏమి లాభం ? ఆంధ్రదేశంలో mines అభివృద్ధిలోలేవు. ఎక్కడఉన్నాయో తెలియదు. ఎవరు ఒప్పుకుంటారో తెలియదు అంతా prospective stage. ఉన్న చిక్కులు మాత్రంవారికిచెప్పాను. ఎప్పటికి change చేస్తారో తెలియదు. ఉన్నకష్టంమాత్రం చెబుతున్నాము. ఇదివరకే ఈ reference వెళ్ళింది. వారుచెప్పిన అభిప్రాయాలు

Sri K. Venkata Rao] [23rd March 1956

ప్రకారం చర్యతీసుకున్నాము. Mica mines ను గురించి గతప్రభుత్వం ఏమి త్రోసి వేసినా ప్రస్తుతప్రభుత్వం ఏమీత్రోసివేయలేదు. మాకు వారని, వీరని ఏమీఅభిమానం లేదు. Government of India వారుఏమివ్రాస్తే దానిమీద సంతకంచేస్తున్నాము. గూడూరులో కోటిరూపాయిల మైకా వెనుకబడిపోయింది. ఆ విషయం Government of India కు represent చేశాము. Clear చేయలేదని, సభలో చెప్ప కూడదుకాని ఒక అపకీర్తి ఉన్నదని వినికిడి, నెల్లూరు మైకాకు, గుంటూరు పొగాకుకు ఉందో లేదో నాకు తెలియదు; చెప్పకునే విషయం. మైకాతోబాటు కొన్నిరాళ్లుకూడా బరువుకోసంకలిపి త్రోసివేస్తారని, ఇక్కడ గుంటూరులో కొంచెం కుళ్ళిపోయిన పొగాకు అడుగున వేస్తుంటారని, ఇటువంటి అపకీర్తి రావడంవల్ల మన International reputation దెబ్బతిన్నది. అంతా బీహారు మైకానే తీసుకువెడ తున్నారు. మన మైకా quality తక్కువదికాదు. ఇది తెలుసు కున్నారు కాబట్టి superior quality మైకాకు export లభిస్తుంది. మైకనేటు Factory గురించి ఎవరో చెప్పారు. నేనువెళ్ళి స్వయంగా చెప్పాను. మీరు service చేయండి. ఈ డబ్బు మేము ఇచ్చికొనుక్కుందుకు అది ఇంకా production లో లేదు. రు 2000 లు ఇచ్చి జర్మన్ ఇంజనీరును పెట్టారక్కడ. రేడియో cuttings చేస్తున్నారందులో. వీరితో equal amount మేమూ invest చేస్తాము; ఈ Industry చాలా ముఖ్యం, మేము సహాయం చేస్తామంటే ఇంతవరకు వారిదగ్గరనుంచి response రాలేదు. అందుచేత ఏమిచేయలేక పోయాము. బాపయ్యచౌదరీగారు మాట్లాడుతూ చేయవలసింది చేయలేదు అన్నారు ఆ మాటనిజమే. కాని చేయగలిగిందిఅంతా చేశాము. ఆ విషయంలో మాత్రం తెలియక ఎవరైనా ఏమైనా అనాలేకాని effort లో మాత్రం లోపం లేదని మనవి చేస్తున్నాను. రంగులను గురించి పార్థసారథిగారు చెప్పారు. ఈ విషయంలో కడపజిల్లానుంచివచ్చిన ఒక application ను ఇదివరకే recommend చేసి పంపాము. రంగులు ఇండియాలో ఇప్పటికే overproduction గా ఉన్నవి కనుక ఆలోచించాలని ఒక interim జవాబు వచ్చింది. మళ్ళీ press చేసి పంపించాము. రంగులను గురించి ఆ stage లో ఉన్నది. చెంగలరావు నాయుడుగారు ఈత, తాటియాకులచాపలగురించి చెప్పారు. గుడిసెలకు ఉపయోగిస్తాయని తెలుసును. బీదవాళ్లకు అందుబాటులో ఉండే సరుకులు తయారు చేయక ఎక్కడో ఉపయోగించే సరుకులు తయారు చేస్తామంటే ఎలా కుదురుతుంది అన్నారు. జపాన్‌లో ఉండే cottage industries ఇక్కడ తీసుకురావాలని

అన్నారు. ఎవరో చెప్పినమాటలు ఆయన చెప్పారు నేను ఆ exhibition కు attend అయినాను. 56 రకాల cottage industries లో 54 రకాలు వెదురుబద్దతో తయారుచేసిన సరుకులే. మనం ఇదే పద్ధతిని అవలంబిస్తున్నాము.

SRI S. NARAYANAPPA :—గుంతకల్లు మహేంద్రసంఘంవారు ఒక society గా ఏర్పడి ఈరకంగా చేయవలెననుకుంటున్నారు. కాని Registrar గారు register చేసుకోలేదు.

THE HON. SRI K. VENKATA RAO :—వారు నాకు ఒక representation ఇచ్చారు. అప్పుడు నారాయణప్పగారు అక్కడే ఉన్నారు దానిని గురించి విచారణ జరుగుతోంది Industrial Estates బెజవాడలోను విశాఖ పట్టణంలోను start చేస్తున్నాము. Guntakal లో ఒకటి పెట్టడానికి ప్రయత్నిస్తున్నాము. Industrial Estate అంటే జపాన్ నుంచి వచ్చింది Japan system of cottage industries ఏమిటంటే — ఒక్క పదార్థం తయారుచేయడం కాదు; పెద్ద సంస్థలలో razer blades తయారుచేస్తారు. ఈ blades cutting cottage industry అవుతుంది. Vertical process కాక horizontal process అన్నమాట. ఒక్కమనిషి ఇనుము కరగడం. పోతపోయడం; పదార్థం తయారుచేయడం—ఇది మన cottage Industries పద్ధతి. జపాన్ పద్ధతిలో కావలిసిన material—పదును చేసిన తోలు, రేకులు, మొదలైనవి, semi-processed material వాళ్లు supply చేస్తారు. ఇదే పద్ధతిలో రాజమండ్రిలో ceramic service centre అని పెట్టాము. మట్టి కలపడం, కుండచేసుకునే విధానం ఆరు centres లో నేర్పుతున్నాము. ఇంటి దగ్గరకు వెళ్లి కుండలు చేసుకోవచ్చును Training లో method ఒకటే పెట్టుబడి ఇవ్వడం ఒకటి; కావలసిన ముడిపదార్థం అందించే యత్నం ఒకటి అయితే బహుళంగా జరుగుతోంది అని నేను చెప్పను. Line of actio . అది, జపాన్ వెళ్లిన Andhra delegation వారు ఇచ్చిన సూచనలను అందుకుని develop చేయడానికి యత్నం చేస్తున్నాము. మల్లెపూడి రాజేశ్వరరావుగారు ఏలూరులో tanning centre, విజయవాడలో foot wear centre కావాలన్నారు. ఒకచోట మనం succeed అయితే కావలసినంత wide spread గా చేసుకోవచ్చును. రు. 100, 200 లు, కావలసివస్తే training అయినవాడికి హామీ అక్కరలేకుండా సహాయంచేయడానికి యత్నిస్తున్నాము. Shares in industries గురించి లక్ష్మణదాసుగారు చెప్పినదానికి ఇదివరకే సమాధానం చెప్పాను. Agricultural tools గురించి చెప్పారు. Community project centres లో

ప్రతిచోట blacksmithy shop పెడుతున్నాము. పదునుపెట్టడం వ్యవసాయ పరికరాల్లో క్రొత్త methods పెడుతున్నాము ఆరు blacksmith centres ఉన్నాయి. Wide గా spread చేసి అందుబాటులోనికి తీసుకురావాలని ఉద్దేశం నాకు చిన్న industries అంటే మనస్సులో ఉన్న అభిప్రాయం ఏమిటంటే ప్రతి తాలూకా headquarters లోను గునపాలు పలుగులు మొదలైన నిత్య అవసరాలు తయారుచేసుకునే స్థితి ఉండాలి. S. S. L. C. మూడు సంవత్సరాలు fail అయి ఏపని చేసుకోలేకుండా కూర్చోడంకంటె ఏదో training అయి ఇటువంటివి ప్రతి తాలూకాలోను పెట్టుకుంటే బాగుంటుంది. దానికి ప్రభుత్వసహాయం ప్రత్యేకించి లభిస్తుంది. Government అన్నీ పెట్టాలంటే సాధ్యంకాదు. దానికి ఒక ఉదాహరణము చెబుతున్నాను Ferro మ manganese factory కి రేపు 31-వ శంకుస్థాపన. పెట్టుబడి రు 1,50,00,000 లు కొంత మొత్తం capital పెడతాము అనుకోండి ఎక్కువభాగం మధ్యప్రదేశ్ నుంచి వచ్చింది మన మాంగనీసుకు ఎక్కువఖరీదు వస్తుంది. 3, 4 వేలమందికి పని దొరుకుతుంది రాష్ట్రంలో వచ్చే పెద్ద factories లో ఇది ఒకటి. 31 వ తారీకున మొదలుపెడతారు దానికి మాచ్‌ఖండ్ నుంచి electricity supply చేయాలి. 25 వేల కిలోవాట్లు కావాలన్నారు. ఇది supply చేస్తే full production లోనికి వచ్చినతరువాత 34 లక్షలనుంచి 50 లక్షలవరకు ఆదాయమే వస్తుంది. దీనికి line అక్కడకు తీసుకువెళ్లడానికి 2 కోట్లరూపాయలవరకు కావాలి. లచ్చన్నగారు ఆలోచిస్తున్నారు. ఎక్కడనుంచి అప్పు తెచ్చుకోడం అని. రెండుసార్లు ఢిల్లీవెళ్లి వచ్చారు. D. O. వ్రాశారు. నేను వెళ్లినపుడు మాట్లాడివచ్చాను. రెండు కోట్లు పెట్టుబడిమీద 50 లక్షలురూపాయిలు సాలుసరి ఆదాయం వచ్చిందంటే ఎంతవడ్డీ అయినదో చూడండి. అయినా supply of electricity కి invest చేస్తే పరిస్థితులో లేము. అయినా కృషిచేస్తాము industry వస్తుంది. ఇన్ని difficulties ను cut చేసుకుని ముందుకువెళ్లవలసి వస్తుందనేది మీదృష్టికి తీసుకు వస్తున్నాను. Soda ash గురించి consumer goods గురించి నేను మనవి చేశాను.

ఇంకా steel fabricators ను గురించి iron and steel యొక్క scarcity ని గురించికూడా చెప్పాను ఏడాదిక్రితందాకా ఇండియాలో cement surplus అనుకొన్నారు. Construction ఎంత ఎక్కువగా raise అయిందంటే ఈవేళ cement scarcity article క్రిందకు వచ్చింది. కాని cementకు ప్రస్తుతం చేసిన ఏర్పాటులవల్ల 1957 సంవత్సరం ప్రారంభానికి demandsను meet

అవుతాయని, 1958 లో మళ్ళీ surplus అవుతుందని Government of India యొక్క calculation. కానీ steel మాత్రం కాదు. 15 లక్షల టన్నులు తయారైంది మనదేశంలో. కానీ 15 లక్షల టన్నుల steel కూడా కొంచెం తేడాతో మనకు normal గా సరిపోయేది. ఈ సంవత్సరం 35 లక్షల టన్నుల steel కు demand వచ్చింది ఈ demand వస్తే supply చేయలేకుండా ఉన్నారు ఇండియాలో కావలసినంత steel లేదు ఇది unofficial సమాచారం ఇంతవరకు నాకు కూడా communication రాలేదుగానీ Government of India వారు speedy steps తీసుకొంటూ ఉన్నారు కొన్ని లక్షల టన్నుల steel ను import చేస్తున్నారు. కానీ మన indian pool price కంటే అది ఏ 100 రూపాయలో 150 రూపాయలో ఎక్కువ వుంది. అయినప్పటికీకూడా దేశంలో వున్నటువంటి development కార్యక్రమాన్ని ఆపకుండా అది తీసుకొనివచ్చి దానికేమో fabrication చేయడానికి తగినటువంటి ఏర్పాట్లు జరుగుతూ వున్నాయి. April నెలాఖరుకి first consignment దిగుమతి అవుతుందని మనకు supply చేస్తారని నాకు informal గా తెలిసింది. దానికి తగినటువంటి ఏర్పాటుల ప్రకారం iron and steel ను fabrication కోసం supply చేయడం demands ను meet కావటానికి వీలు కలుగుతుందని అనుకుంటాను. నరసింగరావుగారు joint management గురించి చెప్పారు నేను మొదటినుంచి మనవిచేస్తున్నాను నేను labour programmes ను గురించి చదువలేదు మొదటినుంచి. ఎందుచేతనో నాకు బాగా తెలియదు. అయినప్పటికీ నేను ఈ raw mind తోటే last time రాజమండ్రికి వెళ్ళినప్పుడు చెప్పాను. ఏడాదికి 60, 80 వేలు నష్టంవస్తుంది దాని మీద ఏరకంగా కార్మికులు improve చేస్తారో చబితే మీరుయిచ్చిన extra కలహాలవల్ల నచ్చేదల్లా మళ్ళి మీకే wages క్రింద ఇస్తానని చెప్పాను. ఊరికే rough and ready గా వాళ్ళేవో కొన్ని proposasl చెప్పారు. కనుక ఈ అభివృద్ధి కొంచెము ఎక్కువ అయితే తప్పకుండా Government అంతా లాభము పుచ్చుకొని ఎక్కడనో పెట్టాలనే ఉద్దేశం లేదు. ఎవరియొక్క సహాయంతో ఇది ఏర్పడిందో వాండ్లకు దాంట్లో సరిఅయినటువంటి భాగం ఈయటానికి వీలుంది. నేను Director of Industries, management వారు అంతా ఉండగా, కార్మికులను పిలచి ఈ మాట చెప్పడమేకాకుండా నేను దానికి separate గా notes ను maintain చేయవలసిందిగాకూడా వారికి మనవిచేశాను. Time అయిపోయింది. ఇంక ఆఖరువిషయము. శ్రీ కోటయ్యగారు, ఇతరమిత్రులుకూడా చేనేత పరిశ్రమను గురించి ప్రత్యేకంగా చెప్పారు. చెప్పవలసినటువంటి న్యాయం కూడా ఉంది.

Sri K. Venkata Rao] [23rd March 1956

ఎందుచేతనంటే ఇది వ్యవసాయం తరువాత చాలామందికి వృత్తి కలిగించేవిషయం. వారుచెప్పిన విషయాలన్ని ఏకరువుపెట్టి చెప్పనక్కరలేదు. ఎందుచేతనంటే ఈ విషయాలను ఆయనద్వారా, ఆంధ్ర చేనేత బోర్డుద్వారా Provincial Handloom Weavers' Co-operative Society ద్వారా నిత్యం చర్చలోనే ఉన్నాయి. కొన్ని విషయాలు పరిష్కారంకాని మాట నిజం. దానికి చాలావరకు మేము బాధ్యులము కాము. వారుకూడా విమర్శలలో మీరెళ్ళి అక్కడ దెబ్బలాడవలసిందే, అక్కడ ఈ పరిస్థితులున్నాయని చెప్పారే కాని ఇక్కడేమో వ్యతిరేకత ఉందన్న విషయం వారుకూడా సూచించలేదు ఈ విషయమున చెయ్యబడుతున్న కృషిఅంతా వారి దృష్టిలోనే ఉన్నది. ధోవతులను, చీరలను separate చేయాలన్న ప్రభుత్వం ఇది. Handlooms కు పూర్తిగా పని చెప్పాలనే 4 textile mills కు licence లు ఇంతవరకు తీసుకొనివచ్చాం ఇంకోదానికి కృషిచేస్తే దానికికూడా సహాయంచేస్తున్నాం. కాని spinning spindle నుంచి తిన్నగా మగ్గంమీదికి తీసుకువెళ్ళే పద్ధతిని మనం అంగీకరించడం లేదు. ఉన్న mills ఉన్నాయి కొత్తగా power looms పెట్టేందుకు మనం అంగీకరించడంలేదు దీనికేమో కొన్ని serious ideas ఉన్నవి. కాని వాటిని అమల్లోకి తీసుకొనిరావడానికి ఇంకా యత్నంచేయాలి. అందువలన కృషి లోపమేమీ ఉండదు మేమేమో Co-operatives ను support చేస్తున్నాము. తరువాత purchase of cloth లో Government వారు definiteగా ఆర్డర్సు ఇచ్చారు, గవర్నమెంటు డిపార్టుమెంటులకు కావలసిన cloth ను దీని ద్వారానే పుచ్చుకోవాల్సిందని. మా Medical Department లో చేనేత వస్త్రాలు తప్ప మేము bandage cloth గానీ lint ను గానీ, మేము ఉపయోగించటంలేదు. తర్వాత Textile Institute ను గురించికూడా, ఇది Government of India సహాయం కోరవలసిఉన్నది. Plan లో include చేయాల్సిందని కోరాము. రాగానే దానినికూడా తయారుచేయవచ్చు Patterns గురించి చెప్పారు. అవి చెంగల్వరాయనాయుడుగారనుకొన్నంత అధ్వానంగాలేవు. ఆంధ్రలో ఉన్నటువంటి నేత బాగా ప్రశంసలో ఉన్నది. నేనెరుగుదును. ఈమధ్య కంచీ చీరలకంటే మనవాళ్లు నేసిన బుటానేత చీరలకున్నటువంటి మార్కెటు వాటికి ఎక్కడాకూడా లేదు. Friends కూడా ఒక చీరకొనితెచ్చి పెట్టమన్న పరిస్థితి ఏర్పడుతుంది. అంటే lady friends కాదు. అందుచేత మనవాళ్ల దగ్గిర ఇవన్నీచాలామంచి samples ఉన్నవి. మన Central Weavers Society వారుకూడా మంచి patterns ను తయారుచేస్తున్నారు. వీటి విషయంలో రంగుకు quality లోగాని మరేవిషయంలోగాని ఏమీ లోపంలేదు. ఇందాకా

నేను మనవి చేసినట్లు చాలా Company లను contact చేసినారు. వాళ్లకు orders వస్తాయని నేననుకొంటున్నాను. Straw Board Paper Mills ను గురించి Government of India వారి report రాగానే plan లో provide చేసుకున్నాము. Start చేస్తారు. ఈఏడు Budget లో చేసే provisions చాలా తక్కువగా ఉంటాయి. ఎంచేతనంటే sanction అక్కడనుంచి రావాలి. వాళ్లు ½ ఇస్తామనీ 1/3 ఇస్తామనీ అంతా ఇస్తామని అనవచ్చు. అనో స్తే ఈ accounts లో చేర్చుకొంటాముగాని Budget లో సూచనలు తప్ప అంతకంటే ఏమీ ఉండవు ఇప్పుడు మన Second Plan లో provide చేసిన మొత్తాలన్నీ కూడా రెవిన్యూకు సంబంధించినవి కావు. చాలావరకు industries లో కూడా అమలుపెట్టే ఏర్పాటు జరుగుతుంది. First year of the second plan కు గత సంవత్సరంలో ఎంత ఖర్చుపెట్టారో అంత కన్నా ఎక్కువ ఖర్చు పెట్టవద్దని చెప్పారు ఎందుకంటే deficit finance ను ఇంకా spread చెయ్యాలి. అందుచేత II year, III year లో ఈలాంటి tempo వస్తుంది. ఈ tempo లో మనం అనుకొన్నవన్నీ జరుగుతాయి కాని దాన్నేమో వెనుకబెట్టే ఉద్దేశం ప్రభుత్వానికేమీ లేదని మనవిచేస్తున్నాను. (Interruption) గోపాలకృష్ణయ్యగారు సిగరెట్లు కాల్చడం మొదలుపెట్టి పెండ్లి కూడా చేసుకొంటే త్వరగా గుంటూరులో cigarette Factory పెట్టించే ఏర్పాటు చేస్తాం. ఇప్పటికి ఆంధ్ర దేశములో సిగరెట్ ఫ్యాక్టరీలకు రెండు అప్లికేషన్లు వచ్చాయి, ఒకటి గుంటూరునుంచి, మరొకటి మోహన హరిశ్చంద్ర ప్రసాదువర్గం వారి నుంచి. వారు అప్పుడే మెషనరీ అంతాకూడా తెప్పించి అట్టే పెట్టారు. కాని భయపడుతున్నారు పెట్టడానికి. ఇప్పుడున్న సంస్థలు చాలా powerful సంస్థలనీ, వాళ్లతో price cut లేకుండా ఈ పనిని చేయడం చాలా dangerous వ్యాపార మని వారు భయపడి మమ్ములను అడిగారు. Defence forces గనుక కొన్ని సిగరెట్లను పుచ్చుకొన్నట్లయితే మేమూ ప్రయత్నం చేస్తామని, మేము వారికి ఉత్తరంకూడా వ్రాశాము, మేము మీ standards ను maintain చేస్తే మా దగ్గిర ఒక portion కొంటారా అని అడిగాము. ఇంకా జవాబురాలేదు. ఆ విషయంలో దాన్నిగురించి నిరీక్షిస్తున్నాము. లేదా శాసన సభ్యులే సిగరెట్లకు ఏజెంట్లు అవుతామంటే వాళ్ళను కొంచెము encourage చేసి త్వరగా పెట్టించడానికి వీలవుతుంది. అందరుకూడా దయయుంచి cut motions ను withdraw చేసు కొని ఏకగ్రీవంగా ఈ demand ను pass చేయాలని కోరుతున్నాను

SRI V. VISVESWARA RAO :—ఇప్పుడు మంత్రి గారు ప్రత్యేకంగా భారతదేశంలో steel కొరత ఉందని చెప్పారు. దానితో పాటు ఆంధ్రదేశానికి కూడా సహజంగా కొరత ఏర్పడుతుందనుకోండి. కాని రైతులకు కావలసిన ఇనుపపని ముట్లు ఏవి కావలసినా రైతులకు మార్కెట్టులో దొరకకుండా పోతున్నాయి. వాటిమీద ప్రత్యేకించి Government శ్రద్ధ తీసుకొంటుందా? దానికిప్పుడు Iron Controller ఉన్నారు. వాళ్ళకు petitions పెట్టినప్పటి కూడా పనిముట్లు సకాలంలో అందటంలేదు. వాటివిషయంలోకూడా ప్రభుత్వ చర్య పుచ్చుకోవలసి ఉంటుంది.

THE HON. SRI K. VENKATA RAO :—అసలు నేను మన చేసింది కష్టము తెలిసే. భారత దేశంలో లేనట్టి ఇనుమును దిగుమతి చేస్తున్నార దీనికి ఈవాళ్లో రేపో మద్రాసులో మీటింగు జరుగుమన్నది. మా డైరెక్టరు గా వెళతారు scheme ను formulate చేయడానికోసం. రాష్ట్రానికి ఎంతరావా ఈ నెలలో ఎంతరావాలి, ఇదంతా station లో నేనొస్తుంటే జరిగిన discussion. దానిలోని implications నా కంతగా తెలియలేదు.

The cut motion of Sri Vavilala Gopalakrishnayya (cut mortion No. 576) was by leave of the House withdrawn.

MR. SPEAKER :—The question is :

To reduce the allotment of Rs. 67,81,000 for Industries by Rs. 100.

(To discuss the failure of the Government to press upon the Government of India to make provision for starting major industries in Andhra including a fertiliser factory.)

The motion was lost.

MR. SPEAKER :—The question is :

To reduce the allotment of Rs, 67,81,000 for Industries by Rs. 100.

(సిమెంటు, యినుము ధరలు పెరిగి బ్లాకుమార్కెట్ లోకి పోయినందుకు.)

The motion was lost.

MR SPEAKER :—The question is ;

To reduce the allotment of Rs. 37,94,800 for Capital Outlay on Industrial Development by Rs. 100.

(విజయపురివద్ద సిమెంటు ఫ్యాక్టరి ఏర్పరచవలెనని.)

The motion was lost.

MR. SPEAKER .—The question is :

To reduce the allotment of Rs 37,94,800 for Capital Outlay on Industrial Development by Rs. 100.

(పల్నాడు తాలూకా మాచర్లలో సిమెంటు ఫ్యాక్టరీని ప్రభుత్వమే నిర్మించుటకు పూనుకోనందుకు.)

The motion was lost.

MR. SPEAKER :—The question is :

"That Government be granted a sum not exceeding Rs. 67,81,800 under Demand XXI—Industries."

The motion was carried and the grant made.

MR. SPEAKER :—The question is :

That Government be granted a sum not exceeding Rs. 37,94,800 under Demand XXXVII—Capital Outlay on Industrial Development.

The motion was carried and the grant made.

MR. SPEAKER :—The House will now adjourn and meet again to-morrow (Saturday, the 24th March 1956) at 8-30 a.m.

The House then adjourned.

# APPENDIX.

[23rd March 1956

[Vide Answer to Clause (*a*) of Legislative Assembly Question No. 684* at page 433 supra.]

The total number of temporary Upper Division Clerks and Lower Division Clerks in each Department of the Secretariat on 31st March 1955 is as follows :—

| Name of the Department. | Number of temporary Upper division clerks. | Number of temporary Lower division clerks. |
|---|---|---|
| (1) Governor's Secretariat ... ... | ... | ... |
| (2) Revenue ... ... ... | 7 | 19 |
| (3) Education and Endowments ... | 6 | 8 |
| (4) Public Works and Transport ... | 1 | 14 |
| (5) Law ... ... ... | ... | 6 |
| (6) Finance ... ... ... | 3 | 22 |
| (7) Health and Local Administration. | 15 | 9 |
| (8) Industries, Co-operation and Labour. | 5 | 11 |
| (9) Home ... ... ... | 20 | 48 |